సరస్వతీగ్రంథమండలి: ౫౧

# స్త్రీసాహసము

## (ద్వితీయ భాగము)

నిష్ఠల కృష్ణమూర్తి

1½ రూ

పబ్లిషర్సు: అద్దేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

# స్త్రీసాహసము

## ద్వితీయభాగము

సుప్రసిద్ధాంగ్లనవలకు భాషాంతరీకరణము

బ్ర. శ్రీ నిష్టల కృష్ణమూర్తిగారు



సరస్వతీ గ్రంథమండలి
రాజమహేంద్రవరము

యుండెను. గనుక నాతనిపట్ల మొగమోటము విడచి ప్రవర్తింపజాలదు. ఇంక నాన్నగారి విషయము తలపెట్టుటకే వీలులేదుగదా ! ఇంక చుట్టు ప్రక్కలవారెవరికైనను నమ్మవచ్చునో నమ్మరాదో తెలియదు. లాగెన్నువారి కేమైన నాశలను పెట్టి నా రహస్యములను కనుగొనుటకు ప్రయత్నించక మానరు.

సరియె. ఏది యెట్లున్నను నేనిచ్చోటు విడచి మరియొక యింటి కరుగక తప్పదు. అట్లు పోవునప్పుడు అవసరమని తోచిన వస్తువులను తీసికొని వెళ్లకతప్పదు. ఇంకనేల ననవసరముగ కాలహరణ మొనరించుట ?

మరియొక క్షణమైన మసలుటకు నామన మంగీకరింపకుండెను. లాగెన్ను మరియేదియో కుట్రను పన్నులోపల నేనీస్థలము బాసి బయట పడవలయును. మరల నతడేమిచేయునో తెలియదు. అందువలన నతని బారినుండి తప్పించుకొనవలయునని యిప్పుడె, యీక్షణము ననె తప్పించుకొనుట క్షేమకరము.

* * * * * *

ముఖ్యమగు బట్టలను, మరికొన్ని వస్తువులను, రెండు ట్రంకుపెట్టెలలో నిముడ్చుకొని వాటిని నేనే క్రిందిచావడిలోనికి మోసికొని పోతిని. తరువాత నాకవరును దాని రహస్యస్థలమునుండి భద్రముగ తీసికొనివచ్చి నా పెద్దకోటు లోపలిజేబులో పెట్టుకొంటిని.

నేను ప్రయాణమునకు సంసిద్ధమగునప్పటికి నాలుగుగంటలయ్యెను. ఇంకను ఎండ తీక్షణముగ నుండెను. అందువలన చీకటి పడువరకు నచటనే నన్నును నా పెట్టెలను గాపాడుకొనుచు కూర్చుంటిని. ఆ సమయమున నాకెంతభయముగ నుండెను ! ఒడలెంత వణకినది ? తలచుకొనిన నిప్పటికిగూడ గుండెలలో పొగలువచ్చును. రెండుమారులు వీధితలుపు చప్పుడయ్యెను. తలుపువెనుకనే మేడమెట్లమీద నేను

గూర్చుండినందున వీధిలోని వారికెక్కడ వినబడునోయని ఊపిరి బిగియపట్టుకొనుచుంటిని. మొదట తట్టినదెవరో తెలియలేదు గాని రెండవమారు తలుపుతట్టినది ఫిన్నేయని తెలసికొంటిని. ఆమెయెంత సేపు తలుపుతట్టినను తీయకుండుటకు విసువుకొని తన పేరువిలాసములు గల "విజిటింగుకార్డును" ఉత్తరములపెట్టెలో పడవైచి పోయెను. క్రమక్రమమున చీకటి హెచ్చసాగెను. అంతట ధైర్యము నవలంబించి తలుపుతీసికొని వీధిలోనికరిగితిని. నాకొఱకెవరును పొంచియున్నట్లు లేదు. ప్రక్కమలుపులోనికిబోయి యొక మోటారుబస్సునెక్కి కూర్చుంటిని. మరియెవ్వరు నాబస్సు నాతోనెక్కకుండుటనుగాంచి కొలది దూరమరుగగనె దిగితిని. నాతో మరియెవరును దిగకుండుటనుగాంచి నన్ను మోసగింపవచ్చిన వారెవరు నచటలేరని నిశ్చయించుకొంటిని. నేను వచ్చునప్పుడు నాకే ట్యాక్సీబండిగాని, రిక్షాబండిగాని యెదురు పడలేదు.

ఆరోజులలో రిక్షాబండి సులభముగ దొరకుచుండెను. దాని యందు ప్రయాణముచేయుట సౌఖ్యదాయకమె. అందువలన నొక బండిని మాట్లాడుకొని గ్రీన్విచ్చికి బేరముచేసితిని. రిక్షావాడు పెట్టెను సర్దుకొని నన్ను బండియెక్కుమనగ నలుదెసల నొకపరి పరిశీలించి మరీ బండిలో గూర్చుంటిని.

అప్పటినుండియె నాకెక్కువ బాధలారంభమైనవనియు బహిరంగముగ నచటినుండి బయలుదేరిన చాలబాగుండెడిదనియు నేను తరువాత నాలోచించితిని.

ఏదియెట్లున్నను అనుకొనినప్రకారమెవరికి కనబడకుండగనే నేను గ్రీన్విచ్చి చేరుకొంటిని.

*   *   *   *   *   *

ఏదియో దివ్యశక్తి నుపయోగించి లారెన్సు నాపలాయనమును గుర్తించి యెక్కడ హింసించునోయని దారిపొడవుననుగూడ నేనను మానించుచునేయుంటిని. నేనెచటికి పారిపోయినదియు తెలిసికొనుట కతడెట్టి దివ్యశక్తియు నుపయోగింప నవసరములేదుగాని నన్ను గ్రీన్విచ్చి తీసుకపోయిన రిక్షావానిని నెట్లయిన గుర్తించు నెడల నారహస్యమంతయు సులభముగ గ్రహించగలడు. నాదురదృష్టదేవత యతనికిట్టి విషయ ములందుగూడ తోడ్పడునేమోయని నేను వెఱగొందుచుంటిని. దారిలో కారణములేకనే నాకు రిక్షావానిపై తరచుగ కోపముగలుగు చుండెను. ఆబండియిరుసునకు కట్టియున్న "స్ప్రింగు" మరలో నేదియో లోపమున్నట్లు నాకు తోచెను. అందులకు క్షమాపణ చెప్పుకొనుచు నే నెన్నిమారులు కోపగించినను మారుమాటాడక వాడు గ్రీన్విచ్చి యరిగినవెంటనే నేనడుగకుండగనే నా పెట్టెలను మేడమీదకెక్కించి సెలవడిగెను. బండియద్దెతో కొంతయీనాముగూడ నియ్యగా వాడెం తయో సంతసించి కృతజ్ఞతావందనము లాచరించుచుపోయెను. వాని యతివినయముజూచి నాకిసహ్యముగలిగి వానిని నమ్మరాదని తోచి నది. మనయూహలకు మనమనస్సే కారణమనియు, నాయప్పటి దౌర్బల్యావస్థనుబట్టి వానిపై నిష్కారణముగ ననుమానముబొందితి ననియు తరువాత గ్రహించితిని.

* * * * * *

లవుజాయి నన్నెంతయో దయతో నాదరించెను. ఆ రోజంతయు తాను నారాకకెదురు చూచుచుండె ననియు రెండు నిముషములలో వంటచేసెదననియు చెప్పి యామె లోపలికరిగెను.

పాపము పుణ్యాత్మురాలు! తన యింటి బాడుగనైన నిచ్చుకొన లేని హీనస్థితికి వత్తునని యా సత్స్త్రీలసుహృదయ యప్పటిలో నించు కయు సంశయింపకుండెను. నాటిసాయంకాలము చలి విశేషముగ

నుండెను. ఆమె కొంచెము నిప్పుచేసి నాకు కాచుకొనుటకిచ్చెను. నేనందులకు కృతజ్ఞతా వందనము లర్పించితిని.

నెడ్డు విడచి పెట్టినదియు, అతని మొదటి భార్య సౌకర్యయుతముగ జేసినదియు నగునా అద్దెగదులలో మెల్లగ నా రాత్రి ప్రవేశించితిని.

మానవ జీవితమొక నదీప్రవాహము వంటిది. ఒకప్పుడొక ప్రక్కకును, యింకొకప్పుడు వేరొకవంకకును, మరొకప్పుడు తిన్నగను ప్రవహించుచుండును. ఒకప్పుడు వెనుకకువచ్చును. ఒకప్పుడు పల్లపు ప్రదేశముచేరి విశాలముగ ప్రవహించును. మరియొకప్పుడు కొండల సందున బడి తొందరగ ప్రవహించును. కాని చివరకెట్లయిన సాగరమున సంగమింపక మానదు. అటులనే చివరకీతనువు విలయకాలమున ప్రకృతి నిలయమొందకమానదు. అని యేమేమియో వేదాంత వాక్యముల నాలోచించుకొనుచుంటిని.

నే నలసట నొందితినని గ్రహించి లవుజాయి నా పెట్టెల నన్నిటిని సవరించి పెట్టెదననెను. నే నందులకు సంతోషముతో సంగీకరించి తాళములగుత్తి నామె చేతికిచ్చితిని. అప్పుడు బడలికవలన నేను స్పృహ తప్పియుండవలయును. నెడ్డు ఛాయాపటము నా పెట్టెలలో పెట్టితినను సంగతి బొత్తుగ జ్ఞాపకము లేకపోయెను. లేకున్న నే నేదియో మిషపైని యామెకా తాళముల నీయకపోవుదును. బట్టలసరుదుచు నామె యాపటమునుతీసి ఆశ్చర్యముతో నావంక జూచువరకు నాకా మాటయె జ్ఞప్తికిరాలేదు.

తప్పులుచేయుటలో నన్ను మించినవారు మరి యెవ్వరు నుండరనుకొని యెదను. కాని నా యప్పటి విపద్దశాపరంపరల సంగతి నించుక నూహించు నెడల మరియొకరి కెటులైన నీ సరికి పిచ్చి యెత్తకుండునా యని యాశ్చర్యము గలుగుచుండెను.

ఆ ముదుసలి అత్యంతాశ్చర్యముతో ఆ ఛాయాపటము నీక్షిం చుచు నన్ను గూర్చి యిట్లు పలికెను. మిమ్మిట్లు అడుగుచున్నందులకు మన్నించవలయును గాని ఈ పటము పాపమా భేజుసతిది గదా మీకెట్లు వచ్చినది."

ఆ పటము క్రిందనె "ప్రేమపూర్వకముగ లోర్నాకర్పించితి" నని నెడ్డు స్వహస్తమున వ్రాసియుండెను.

కాలుజారినది కదా యికనైన తెలివిగ మెలగవలయునని యెంచి, ధైర్యము నవలంబించి యిట్లంటిని.

"సరియె బాగున్నది. ఆ భేజుసతిది కాదే. యన్నాను." అని యాశ్చర్యము నభినయించుచు బలికితిని.

"సందేహ మెందుకు ? ఇది యామెదె ! ఆమె భర్తరూప మేయిది. నే నెఱుగనా ? క్రిందటిమారు మీరిచటికి వచ్చినపుడు దీనినీగదిలో చూడలేదా ? అదిగో ఆగోడకే అచటనే వ్రేలాడు చుండెడిది. ఇది యింకొకటియా ? కాదే. దానికిని దీనికి నేమియు వ్యత్యాసములేదే ?"

"అయ్యొ ఆమాత్రము గూడ నాకు తెలియక పోవలయునా ? ఏమమ్మా వెట్టి ?" అని మెల్లగ సణగితిని. కాని యామెకీ మాటలు సమాధానము కాలేదు. తగిన జవాబు కావలయునని నా దెస చూచు చుండెను. ఇంక నే నేమి చేయగలను ! ఏమి చేయుదునా యని యాలో

చించుచుండగా నామెయె యందులకు సులభమగు మార్గమును జూపించెను.

"అట్లయిన మీరుగూడ నాతని యెరుగుదు రనుమాటయె? మీ కేమిస్నేహమా ?"

"నాకు కాదుగాని నా భర్తకతడు ఆప్తమిత్రుడు. ఆయన మరణించిన సంగతియె నాకు తెలియదు. నే నిచ్చట చూచిన యాపిల్లనతడు వివాహమాడిన సంగతి గూడ నాకు తెలియదు."

అంతనామె విచారముతో తల పంకించి యూరకుండెను.

* * * * * *

కొంతసేపటికి మరల నామె "ఆయన చాల రహస్యముగ దిరుగుచుండెడువాడు. పోలీసువారి కతడు చిక్కినందున పాపమా పిల్ల కంతగా నష్టము కలిగిన దనుకొనను. అతడది యొక రీతిమనిషి. రాకపోక లతిగోప్యముగ నుండెను. ఒకప్పుడు మాసములకొలదియు నింటికి రాకుండెను. అతని జాడలు నాకు తరచుగ ననుమానాశ్చర్యముల గలిగించు చుండెడివి. ఒక మారు మూడుమాసముల వరకు నింటికి రాకుండెను. అది సరికదా జాబయినను వ్రాయలేదు. ఏమో తెలియదనుకొని చెప్పుచున్నాను. మీరతని నెఱుగుదురని చెప్పితిరే !"

పటముపై నున్న వ్రాతయట్లు కన్పించుచుండగ నేనతని నెఱుగుదునని యెట్లు చెప్పవచ్చును ? బొంకినను నిలువనేరదు. అందువలన నామె ప్రశ్న నెటులైన దాటివేయనెంచి, వివరములు మాత్రము తెలసికొన వలయునను కుతూహలముతో "నేను చెప్పినది చాలకాలము క్రిందటి మాట. ఈమధ్య పెక్కు సంవత్సరములనుండి యతని సంగతియే తెలియకుండెను. అందులకే మీ మాటలనింత కుతూహలముతో వినుచున్నాను." అంటిని.

నెడ్డు మరణించెనని యింతమంది యింత నిశ్చయముగ చెప్పుచుండ దానికేమాత్రమైన నాధారముండదాయను అనుమానము నన్ను బాధింప సాగెను. అప్పుడునాకు కలిగిన హృదయవేదనకు పరిమితి లేక పోయెను. నెడ్డు చనిపోయినటు లందరు ననుకొనుచున్నను, యేలనో కాని యతడు మరణింపలేదని నేను నమ్ముకొను చుంటిని. ఈ రెండవ భేజు సతికిని ఫ్రాస్టుసతికిని ఏదియో సంబంధముండుటయు ఫ్రాస్టుసతి నాడా శవాగారమున గన్పించుటయు జూచి ప్రాయశః ఆయువకుడే యీ రెండవ భేజుభర్తయయి యుండునేమో ? నా భర్తయింకను సజీవిగనే యుండవచ్చునని నే ననుకొంటిని. కాని రెండవ భేజుగదిలో నాడు చూచిన నెడ్డు ఛాయాపటము ఆ యనుమానమునుగూడ నపహరించెను. నెడ్డు నిజముగ మరణింపకుండు నెడల ఒక జాబయినను వ్రాయకుండునా ?

"ఆయన యిచటనే మరణించెనా ?" యని ప్రశ్నించుచూ నాయావేగము నామె కనిపెట్టకుండుటకై అగ్నిగుండము చుట్టును చెదరియున్న నిప్పుకణముల ప్రోగుచేయు చుంటిని.

* * * * * *

అయ్యోపాపము ! అదిగూడ జరుగలేదమ్మా ! ఆయన చాల కాలము బట్టి యింటికి రాకుండెను. ఏల రాలేదని దిగులు పడుచుండగా నొకనాడావార్త తెలసెను. ఆ మృత్యువు వచ్చువేళకైన నతడెచట నుండెనో యామె యెరుగదు. ఆయన పోవునప్పుడు మాత్రమెచటికో పోవుచున్నానని చెప్పుచుండును. ఆమెకు డబ్బుచాలక చాల చిక్కు పడుచుండెను. అట్టి సమయములందు అత్తగారు కొంతడబ్బు నిచ్చుచుండెడిది."

"ఆమె అత్తగారా ?" అని నే నాశ్చర్యముతో ప్రశ్నించితిని.

"మీ కెందులకంత ఆశ్చర్యము ! ఆమె గూడ చాల మంచిమనిషి. ఈ దుఃఖ సమయములో భేజుసతికి డబ్బిచ్చుచు విచారముపశమించు చుకుగాను, ఆమె నింకొక చోటికి తీసికొనిపోయెను."

"ఓహో ! నే నిచటికి వచ్చినరోజున మీ యింటికి వచ్చిన యామె యేనా మీరు చెప్పునది? పొడవుగను, కొంచెమునల్లగను, నుండు వితంతువు సంగతియేనా మీరు చెప్పునది ?" అని నే నడిగితిని.

"అవునామెయె ! ఆమెను మీ రెక్కడ జూచితిరి ?"

"నాడు మీ యింటినుండి యావలికరుగు చుండగా జూచితిని."

"అట్లయిన మీరు వారినందరిని నెఱుగునట్లున్న దే ! ఆరోజున నామె యచటనుండగనే మీరు వచ్చిన నెంతయో బాగుండెడిది. ఫ్లోరెన్సు కన్యను గూడ నెరుగుదురా యేమి ? "

ఓరి భగవంతుడా ! నే నెవరికిని తెలియకుండ నిచట డాగియుండ వలెననుకొనగా నీమె వారందరి నెఱుగునట్లున్న దే ! ఇక నేమిచేయను ?

"ఫ్లోరెన్సా ! ఉండండి. పేరువిన్నట్లున్నది. ఆమె భేజుగారి కక్క చెల్లెలా యేమి ? "

"ఒక త్రేలు విడచిన అక్కచెల్లెలు. అనగా ఆమె తండ్రి భేజుతల్లికి ద్వితీయ సంబంధము. ఆమె యిప్పటి పేరు ఫ్రాస్టు. ఇది తృతీయము. నాటకములలో వేషములను వేసికొని తిరుగు ఫ్లోరెన్సుకన్య తండ్రి యింటిపేరు మర్చిసనువారు."

ఈ సమాచారము వలన నాకు కొన్ని క్రొత్తసంగతులు బోధపడి నవి. గ్రాంటుగారి యాగమనము నాటి రాత్రి నెడ్డును మర్చిసనును చాల సేపు సంభాషించుకొనిరి. వారప్పుడొకరి నొకరు గుర్తించుకొని యుండవలయును. ఆతని సంగతి సందర్భములన్నియు నామె కదివరకే తెలసియుండవలయును. అందువలననె వాడు నన్నంత సాహసముతో నల్లరి పెట్టినది ! అని తలచుకొనునప్పటికి నాతల గిరగిరతిరుగ సాగెను.

2

నేను చీకాకు పొందియుండుటను గాంచి లవుజాయి భోజన పదార్థములను తెచ్చుటకరిగెను. పిమ్మట భోజనసమయమున మేము మరి కొంతసేపు ముచ్చటించితిమి. అప్పుడామె యిట్లు చెప్పెను.

"ఫ్రాస్టుసతి చాల గౌరవపాత్రురాలగుట వలన ఆ భేజుగురించి యేమియు చెప్పజాలకున్నానుగాని లేకున్న వాడెందులకు పనికిరాని శుంఠయని వెంటనే చెప్పియుందును. ముందెపుడో పెద్ద బంగారు గనులు దొరకి తాను మహాభాగ్యవంతుడగుదునని వాడు తరుచుగ బడాయి కొట్టుచుండెడివాడు. ప్రస్తుతమా ముసలిదేమైన సహాయము చేయకుండునెడల తినుటకన్నమును, కట్టుటకు గుడ్డయు లేక హీనమాన మొందియుండును.

"ఒక మారేదియో యిటులనే చాల దినములవర కింటికిరాకుండు నప్పుడె పాపమాబిడ్డ ఔషధమిప్పించు దిక్కులేక మరణించినది. ఆబిడ్డ చనిపోయిన పిమ్మట నొక్కనాడు మాత్రమె అతడింటికి వచ్చెను. ఆ వచ్చినపుడు మనిషి చాల నీరసించుటయెగాక పట్టలేనంత విచారమేదియొ పెట్టుకొని కృంగిపోయినట్లుండెను. మరల నతడెచటికరిగెనో యెవరికిని తెలియకుండెను. కొన్ని దినములైన పిమ్మట నతడు నెమోనియా విషజ్వరపీడితుడై మాంచెస్టరులో మరణించినట్లు ఫ్రాస్టుసతికి తెలసెను. అంతట నామె భేజునుతీసుకొని మాంఛెస్టరున కరిగి యచట వాని కపరక్రియల నొనరించినది."

ఈసంగతులను వినిన పిమ్మట నా కింకొక సందేహము కలిగెను. పేరు ఊరు లేని యా నిర్భాగ్యుని శవదహనమున కానాడు తానే సర్వ కార్యములను నిర్వర్తించుటకు ప్రాస్టుసతి పూనుకొనెను. స్వలాభాపేక్ష నేదియో నెరవేర్చుకొననెంచి ఆ మరణించిన యువకుడే నెడ్డు భేజని చెప్పి యీ పిల్లదానిచేత వాని కపరక్రియల నొనరించినదా యేమి?

నాసంశయమును తీర్చుకొనుటకు నే నపుడు లవుజాయి నాయా తేదీల వివరములడుగ నారంభించితిని. ఆమెకా తేదీలంత వివరముగ జ్ఞాపకము లేకపోయినను చెప్పిన సమాచారమును బట్టి చూడగా రెండవ భేజుసతి మాంఛెష్టరున కరిగిన పిమ్మటనె నేనును నెడ్డును కలసి సంభాషించినట్లు నాకు తోచినది. కాని అదియె నిజమని స్థిరపరచుకొనుటకు వీలులేకుండెను. నాకుగూడ తేదీల వివరము లంతగ జ్ఞాపకము లేకుండెను.

ఈ కఠిన సమస్యాపరిష్కారమునకు నాకు కొంత వ్యవధి కావలసి వచ్చెను. ఫ్రాస్టునకీ వివరములన్నియు తెలియుననుట కెట్టి సందేహమునులేదు. కాని ఆమె నాకు ప్రబలవిరోధియని నాయంతఃకరణ స్పష్టముగ బోధించుచుండెను. స్వలాభాపేక్షతో నామె నాకెక్కువ చిక్కులను గల్పించుచున్నట్లున్నది.

అట్టి స్థితిలో నామె నాయందు నిష్కపటముగ ప్రవర్తించునని నమ్ముటకెట్లు వీలగును ?

ఫ్రాస్టుసతి విలాసమునుగాని, భేజుసతివిలాసమునుగాని తెలుపవలసినదని లవుజాయినడుగగా తనకాసంగతి తెలియదని యామె చెప్పెను. వారాసంగతి నితరులకు తెలుపనుద్దేశింపనందుననె యామెకు చెప్పలేదని నేనూహించితిని. భేజుసతికెప్పుడు నెవరియొద్దనుండియు లేఖలు రాలేదు. తరచుగ నామె యొంటరిగ నివసించుచుండెనట. చంటిపిల్లను లాలించుకొనుటతో నామె కాలమంతయు వెళ్లబుచ్చుచుండెనట. పాపము ! దైవమిపుడాపిల్లను గూడ నపహరించినాడు.

కాలక్రమమున నేదియో గృహకృత్యములలోబడి యసూయా మాత్సర్యముల నడంచుకొనుచు నెటులనో కాలక్షేపము చేయుచుంటిని. ఒక దినమున పనియేమియులేక తీరికగ కూర్చుండుటవలన చిక్కియున్న నా శరీర స్థితి నించుక పరిశీలించితిని. నెడ్డు అదృశ్యుడయిన నాటిరాత్రి నుండియు నెడ తెగక గలుగుచుండిన యలజడివలన పూర్తిగ నలసిపోయి శరీరము చాల శుష్కించియుండెను. శరీరము వ్యాధి గ్రస్తమయ్యెనేమో యని యనుమానము కూడ కలిగెను.

నే నెచటికరిగితినో తెలిసికొనవలయునని లారెన్సుగాని మరిమెవ్వరు గాని బ్రయత్నించుచున్నట్లు కన్పించలేదు. అందువలన నా ప్రస్తుతపు నివాసమతనికి తెలియదని స్పష్టమగుచుండెను.

నెడ్డు బ్యాంకుద్వారా పంపినడబ్బు యింకెన్ని దినములు సరిపోవును? ఇప్పుడుచేతిలోనున్న యీ రెండువందల సవరనులు ఖర్చైపోయిన పిమ్మట నేమిచేయవచ్చునని కొంచెము సందేహము కలుగుచుండినను అట్టి స్థితివచ్చునపుడు చూచుకొనవచ్చునని ధైర్యముగ కాలక్షేపము చేయుచుంటిని.

తక్కిన స్త్రీలవలె లవుజాయికి రహస్యాన్వేషణ కౌతూహల మంతగా లేనట్లుండెను. నా దగ్గర కెట్టి మిత్రులుగాని, జాబులుగాని రాకుం డుటయు, నే నెవరితోడ నెట్టి ప్రసంగములను బెట్టుకొనక నేకాకివలె నివసించుచుండుటయు, ఆమెకు వింతగా దోచినట్లులేదు.

ఒకమారు మాత్రమామె నన్నొక ప్రశ్న నడిగెను. దానియందొక గూఢార్థముగూడ నున్నట్లు నాకుతోచెను. నా భర్తమరణించి యెంత కాలమయినదియు, అతడాకస్మికముగ మరణించెనో, వ్యాధిపీడితుడై మరణించెనో తెలుసుకొన యామె తలంచెను. మరణమాకస్మికముగ

సంభవించెననియు, సుమారు రెండుమాసము లయియుండుననియు నేనపుడు బదులుచెప్పితిని. ఆ ప్రశ్నల నపుడామె యేలయడిగెనో నాకు తెలియకుండెను. ఆ రెండుప్రశ్నలుతప్ప ఆమె నన్నింకేమియు నడుగ లేదు. అందువలన నా మనస్సునకు చాల సంతోషముకలిగెను. అప్పుడప్పుడు నెడ్డును నేనును మాచిన్నిగృహమున మనోహరముగ గడపుచుండిన రోజులు జ్ఞాపకము వచ్చుచుండెడివి. కడసారిమే మొకరి నొకరి నెడబాసిన కొలదిదినములలోనే యతడు మరణించియుండుననియు, నా వితంతువేషము చివరకు నిజముగనే పరిణమించినదనియు నేను రూఢిచేసుకొంటిని.

నా విచారపుటాలోచన లిటులుండగ ముందుకలుగబోవు మహాద్భుతవిషయమును గూర్చి యొకనాడు లవుజాయి నాకు సూచనగ చెప్పెను. ఒకరుచెప్పుటకు ముందుగ నేనే యీ సంగతిని తెలసికొన వలసియుండెను. అట్లు తెలసికొనజాలకుండుటకు నాయజ్ఞానమె కారణమో, లేక నప్పటి నా దౌర్భాగ్యావస్థయె కారణమొ చెప్పజాలను.

ఆ రోజంతయు శరీరము చాల నీరసముగనుండెను. మంచము మీదినుండి లేవవలయునను బుద్ధియె పుట్టకుండెను. జరిగినసంగతులను స్మరించుకొనుచు విచారించుచుండుటకంటె నాకు వేరొకకార్యమె తోచకుండెను. మృత్యుదేవత నామీద దయతలచి యప్పట్టున తనధామము చేర్చుకొనునెడల నెన్ని కృతజ్ఞతా వందనములనైన నర్పింతుననుకొనుచుంటిని. గ్రీన్విచ్చికరిగిన నాటనుండియు నాకు మరికొన్ని విశేషములు తెలసి నామనస్సు మరింత క్షోభించుచుండుటవలన ఆపేరే నాకిప్పుడసహ్యాకరముగనుండెను. నెడ్డు నాకెంత యపచారమొనరించినను గూడ నామనసుమాత్రమతనియందే లగ్నమగుచుండెను. మరలనతనినెప్పుడు చూతునాయని యొకప్పు డువ్విళ్లూరుచుందును. లోకులందరతడు మరణించినాడని నిశ్చయించుచున్నను, అతడు సజీవియై సుఖముగనున్నా

డనియు, ఎప్పుడో యొకనాడు తప్పకుండ నన్ను జూడవచ్చుననియు నను కొనుచుంటిని. కాని ఆ యాశ యడియాశగ గన్పించెను. అథవా ఆయన జీవించియెయున్నయెడల నెప్పటికైన తన భార్యను అనగా రెండవ భేజు సతిని జూచుటకీ యింటికి రాకపోడనియు ఆ వచ్చునప్పుడామె స్థానమున నే నుండుటనుగాంచి యామెను విడచిపెట్టి నన్నొక్కర్తెనె చేపట్ట గోరుననియు, అట్లుచేయునెడల నేనతనికెట్టి యభ్యంతరమును జెప్పకుందుననియు ననుకొనుచుంటిని.

ఇంతలో లవుజాయి, రొట్టెలను తేనీటిని తీసికొని వచ్చెను. నా కప్పుడా రొట్టెలుగాని తేనీరుగాని యవసరములేకుండెను. మీదు మిక్కిలి విచారగ్రస్థమునైనను నా యాలోచనాపరంపరలకామె యేల అంతరాయము గలిగింపవలయునని చాల కోపమువచ్చినది. అందువలన కొంచెము తృణీకరముగ మాట్లాడ నారంభించితిని.

పాపమా ముదుసలి నా మాటలకు కోపగించుకొనక ఆ పళ్లెరము నచట డించి యెట్లయిన తేనీటిని తాగునట్లు చేయుటకు బ్రతిమాలుచుండెను. నాతో నెట్టి రక్తస్పర్శయులేని యీ ముదుసలి నాయందేల నింత దయగలిగి ప్రవర్తించు నిదియంతయు కలయై యుండుననని నాకు తోచెను. కాని యచట గూర్చుండిన ముదుసలియు, నా మెముందర రొట్టెలపళ్లెరమును, తేనీటిగిన్నెయు స్పష్టముగ గన్పించుచునే యుండెను.

"నేను చెప్పున దంతయు నిజమనియు, నా శ్రేయస్సునకే యనియు నమ్ముము. దైవవిధి యొకవిధమున నుండగా మరియొకవిధమున నెట్లు జరుగును? నేనప్పుడే నిద్దరిని గోతపెట్టితిని. నలుగురు మాత్రము మిగిలి వారిపొట్టల నెటులనో పోసికొనుచున్నారు. వారెప్పుడో కిసిమిసిపండుగల కొకసారి యిచటికి వచ్చుచుందురు. అప్పుడు వారిని జూచుకొని పొంగి పోవుచుందును. అంతవరకు దినముల నెట్లనో గడపుకొనుచుందును.

ఏమిచేయగలము? చచ్చినవారితో చావలేముగద! ఉన్నవారినైన జూచుకొనవలయును. నీవిట్లు మూర్ఖపుపట్టుపట్టి, వేళపాళల కాహారము తినక, నలుగురిలో కలసి హెచ్చరికగ తిరుగక, విచారముతో కూల బడి యుండునెడల నీకుమంచిది కాదు సరికదా ఆపుట్టబోవు బిడ్డకు గూడ శ్రేయస్కరము కాజాలదు. పెద్దదాననో, చిన్నదాననో నీకంటె యెక్కువయేండ్లు గడపినదాననుకదా! నామాట వినుటమంచిది. చిన్న తనముననె రాకూడని విపత్తువచ్చినది. కాదని యెవరనగలరు? కాని యేసుప్రభుని కరుణాకటాక్షమున కడుపులోబిడ్డ సునాయాసముగ నీవలబడి నీచేతులలో నవ్వుచు, కేరుచు, నాడుచు వుండునపుడు నీకీ దుఃఖమేమియు నుండదు. నానాటికి తగ్గిపోవును. కొన్నాళ్లకు నీహృదయము సంతోషముతో పొంగుచుండును. ప్రపంచమందింకను జీవించి యున్న ఫలమప్పు డనుభవించెదవు. గనుక నామాట విని కొంచె మొంగిలిపడుము."

ఆమెవైపు నిదానించి చూచుచు నేనటులనే యాశ్చర్యముతో కదలకుండను, మెదలకుండను గూర్చుంటిని. అది చూచి యామె,

"ఏమిటి? నీకాసంగతియె యేమియు తెలియదందువా యేమి?" అని యడిగెను.

"ఏసంగతి?"

"ఎంతనంగనాచివమ్మా?"

నాకేమియు తెలియదనునట్లు మరల తలనూచితిని. కాని యామె యుపన్యాస ధోరణివలన నామె యుద్దేశ్య మేమియొ పూర్తిగ బోధ పడినది. అంతట రెండుచేతులతో కన్నులను మూసికొని, సిగ్గుతో తల వంచుకొని కాలగోరుల జూచుచు నూరకొంటిని. మంచి చమత్కా రియు అద్భుతమైన తెలివితేటలును గల ఆముదుసలి మెలమెల్లన

నేదియో పని కల్పించుకొని యావలికరిగెను. నన్నొంటరిగ విడిచి పెట్టుట మంచిదికాదని యామె యూహించుచున్నను ఆసమయమున నేకతముగ విడచుట యవసరమని యామె గ్రహించెను.

ఆమె మాటలు నిజమని నిదర్శనములను బట్టి తెలుసుకొని కొంత తేనీరుత్రాగి యామె దయతో చేసి తెచ్చిన రుచికరములగు రొట్టె లన్నిటిని ఫలహారముచేసి నేదదీరితిని.

క్రమక్రమమున సంతోష మతిశయించి ఆనందాశ్రువులు చోటు చాలక తమలోతాము కలహించుకొని యొక్కమారుగ నన్నియు రాలుచున్న వేమో యని నాకప్పు డనుమానముకలిగెను. నేను నెడ్డు నందు పరిపూర్ణవిశ్వాసముంచి హృదయపూర్వకముగ నతనిప్రేమించి పెండ్లియాడితిని. ఇంక నతనివలన నాకు శిశువుద్భవించుచున్న దనిన నేనేల సిగ్గుపడవలయును?

నే నెంతమాత్రము సిగ్గుపడనవసరములేదు. సముద్రమంతటి పూర్వ విచారమంతయు నానాటికి తగ్గిపోవుచుండెను. మనమునం దనుదిన ముల్లాసము అతిశయించుచుండెను. ఆసంతత సంవర్ధిత సంతోషమున కెట్టి పరిమితియు గన్పించకుండెను. నెడ్డుమాత్రమే గాదు—ప్రపంచ మంతయు నింక నన్నొంటరిగ విడచినను నాకెట్టి విచారము నుండదు. లోకమంతటను వ్యాపించిన చెడుగులన్నియు నొక్కసారిగ నాపై దం డెత్తనిండు. ఈనూతన విశేషము గ్రహించిన పిమ్మట నేను నాభర్తగ నేర్చుకొని వరించిన పురుషవరునందు నాకుగల యపారప్రేమపాతివ్రత్య ములకు నిదర్శనపూర్వకముగా భగవంతుడు దయచేసిన యీయదృష్ట విశేషము నాకొనగూడెనని గ్రహించిన పిమ్మట—నాకెట్టి భయమును లేకుండెను. నాకప్పటిలో సంతతాభివృద్ధినొందిన నపారమగుసంతో షము—సంతోషము! సంతోషము తప్ప వేరొక్కటి లేదు. ప్రపంచ

మంతయు పూర్వవిచారరాగముల విసర్జించి నూతన సంతోషరాగ మన్నికడల నాలాపించుచున్నట్లు నాకు తోచుచుండెను. నెడ్డు చిన్న బిడ్డడు, నాగర్భమున పెరుగుచున్న సంగతి నాకనుక్షణము స్మర ణకు వచ్చుచుండెను. మామహాపవిత్ర ప్రేమచిహ్నమగు ఆపరమాణు స్వరూపమెప్పుడు పెద్దదై నాచేతుల కరవుదీర్చి, నాకన్నులపండువ గావించి, నాహృదయభార మెపుడు తగ్గించునని నేనువ్విళ్లూరుచుంటిని. మాపరమపవిత్ర ప్రేమాంబునిధి సంజనిత స్వరూపముగ నాకొక చిహ్న మైన లేకపోయినదే యని గదా నేనిన్నిదినము లంత యీర్ష్యాసూయ లతో బాధపడుచుంటిని. ఇప్పుడింక కోరదగిన దేమున్నది?

లవుజాయి తిరిగివచ్చి "నామాట నిజమేనా" యని ప్రశ్నించు నపుడు నేనేమి చెప్పగలను? ఆమెకు ప్రత్యుత్తరముగ నొక చిరునగ వును తొలకరించి, సిగ్గుతో తలవంచి యూరకొంటిని.

పైని వివరించిన కథయంతయు జూన్ నెలలో జరిగెను. అనగా జూన్ నెలారంభములో నేను బెల్మూరువీథియందలి పదహారవనెంబరుగల గృహమున ప్రవేశించితిని. అక్రిందటి మార్చి మాసాంతమున నెడ్డు నన్ను విడచిపెట్టిపోయెను.

గ్రీష్మఋతు వతిశీఘ్రగతి నరుదెంచెను. నేనింకెన్నియో పనులను చక్కబెట్టుకొనవలసియుండెను. అయినను చేసిన ఘనకార్యముగాని, తీరికగాని గన్పించుటలేదు.

పై రహస్యవిశేషము నిశ్చయమని నిర్ణయించుకొనినపిమ్మట బ్యాంకు నకరిగి నాకు రావలసిన మిగతాపైకము తీసుకొని ఖాతానెత్తివేసితిని. నాకొరకని నాన్నగారు నాఖాతాలో 300 సవరనులు జమకట్టిరని బ్యాంకువారు తెలిపిరి. నాకాసంగతి పరమానంద ప్రదముగనుండెను. డబ్బునకు కాదాయానందము! నాన్నగారికి మరల నాపైననుగ్రహము కలిగినదిగదాయని.

నేను బ్యాంకులో ఖాతానుంచిన సంగతి నాన్నగారికెట్లు తెలిసినదని నాకాశ్చర్యము కలిగెను. అతడు తలవని తలంపుగ నిపుడిట్టి సహాయ మొనరించుటకేమి కారణమని యూహింపనెంచితిని. కాని నాకిపుడు లేనిపోని యూహలతో కాలహరణ మొనరించుటకు వేళలేకుండెను. అతడట్టి యభిమానమును గనుబరచుటకు నిరుపమానమైన పుత్రవాత్స ల్యముకంటె నింకేముండును? నిర్హేతుకజాయమాన కటాక్షమున నత డొనర్చిన యుపకృతికి నేను కృతజ్ఞతావందనముల నర్పింపవలయును గదా! వెంటనే నాన్నగారికి నాకృతజ్ఞతను తెల్పుచు నాయవజ్ఞతను క్షమింపగోరుచు నుత్తరముప్రాసి ఆడబ్బంతటిని చిన్నచిన్ననోట్లుగా

మార్చి చేతిసంచిలో జాగ్రత్తగా పెట్టుకొని మరల గ్రీన్విచ్చికి పయన మైతిని.

నేను పట్టణమునుండి గ్రీన్విచ్చికి పలాయనమైనపిమ్మట మరల నిచటికి వచ్చుటకిదియే ప్రప్రథమము. లారెన్సు సొరగుడులోనుండి యపహరించిన కవరును ప్రాణప్రదముగ నాభర్తవచ్చువరకుదాచి, పిమ్మట నతని కర్పించవలయునని తలంచితిని. అందువలన మొదటి యాలోచనయంతయు నటు ప్రవహించెను. కాని యిప్పుడంతకంటె నమూల్యతరమగు రహస్యపుఖజానా దొరకినదిగదా! ఇక నాపూర్వపు ప్రాచిశిరులెవరికి కావలయును ?

సంతసముతో శరీర మవశత్వమొంద నాయంతటి యదృష్టవంతు రాలింకెవ తైయైన యుండునాయని నాలో నేనే యాశ్చర్యమొందుచు యింటికరిగితిని.

నాన్నగారి ధనముకంటె నతని నూతనవైఖరికిని ఆయుపకార బుద్ధి కిని నేనెక్కువ సంతోషము బొందితిని. ఆధనసహాయము గూడ వేళకే లభించుటవలన సంతసమొందితిని కాని యతనికి నాయందు మరల దయగలుగుట ప్రస్తుతస్థితిలో చాలా అనుకూలముగ నుండగలదు. నా రహస్యమతనికి తెలియునెడల నతడు నా యపరాధమును పూర్తిగా క్షమించునేమో యని యనుకొంటిని. సంగతి సందర్భముల నన్నిటిని పూర్తిగ తెలుసుకున్నను నేనిప్పుడు నెద్దును క్షమింపలేదా? అటులనే నాన్నగారు కోపోపశాంతినొంది నన్ను క్షమింతురనుకొనుచుంటిని.

భేజునతి నివసించుచుండినపుడామెభర్త ఛాయాపటమున్న చోటు నని "ఎల్సుమీారునతి" యను కృత్రిమనామమున నేను నివసించుచుండి నపుడు గూడ ఆనెడ్డు భేజుపటమునె యచటనుంచుట మిగులసాహసము. నాభర్తపటము నాగదిలో నుండుట సామాన్య పరిస్థితులందు హర్షదా యకమే యగును. కాని పూర్వజీవితమును గప్పిపుచ్చనెంచి మారు

వేషమున మెలగునప్పు డట్టిపని సాహసము మాత్రమే గాక నా రహస్య మంతటిని బయలుపరచుటకు హేతుభూతమగును. అయిన నదియేలనో ఆపటమునచట నటులనే యుంచితిని. ఎందుకట్లుంచితివని నన్నెవరు నడుగలేదు. అంతకంటె నేనెవరికిని సమాధానము చెప్పలేదు. సరియె దాని కేమిగాని నేనిపుడు చెప్పవలసిన గాధ చాలగలదు. దానినెట్లు చెప్పవలయునో నాకే తెలియకున్నది. నాజీవితయాత్రలో నేనెక్కువ విశేషముగ నాలోచింపవలసిన ఘట్టములు పెద్ద వేవియోకొన్ని యున్న వని నా స్నేహితులనుచుండిరి. కాని చిల్లరసంగతులందు నాకభిరుచి మెండు. నాన్నగారి నప్పటిలో పోయిచూచుట మంచిదని వారనుచుం డిరి. కాని బట్టలనేవియో కుట్టుకొనుచు నింటియొద్దనే కూర్చుండ వలయునని నాకు బుద్ధిపుట్టుచుండెను. కాలక్రమమున చేతికుట్టుపను లలో మంచి దిట్టరినైతిని. ఎన్నియోపుస్తకములను, పటములను కొని వానిని జాగ్రత్తగా పరిశీలించుచుంటిని. ఆహారమందు పూర్వమువలె నసూయనొందక తృప్తికరముగ భుజించుచుంటిని. లేనిపోని యాలోచ నలు సంశయములు తగ్గుటవలన భారమును, అలజడియు నశించి శరీరము దృఢతరమగుచు దేహమున కెక్కువ బలముకలుగుచుండెను.

బ్యాంకున కరిగిననాడు నాకు చాల బడలిక కలిగినది. ఒడలు సొమ్మసిల్లినది. అందువలననో మరెందువలననోగాని మనస్సునకు పెద్దసంశయ మొకటి తోచెను. లవుజాయి చిన్నిగృహమున నయిదు వందల సవరనులనుంచుట ప్రమాదకరమని తోచెను. అందరును వచ్చుచు పోవుచునుండు కొంపయగుటవలన నా సంగతి యెవరికైనను తెలియవచ్చును. నేను బ్యాంకులోనుండి సొమ్ము పుచ్చుకొనుచుండగా నచటనన్ను చూచిన వారెవరైన నన్ను వెంబడించి యుండవచ్చును. అప్పటికి నాకట్టి యనుమానము గలుగనందున వారినితప్పించు కొను టకు నేనెట్టి ప్రయత్న మొనరించి యుండలేదు.

ఈ డబ్బు నెట్లు భద్రముగ దాచవచ్చునని యాలోచించుచుండగా ఫెర్ను ద్వీపపటము దాచినప్పటి కథయంతయు జ్ఞాపకమువచ్చెను. ఆపటము గ్రీన్విచ్చి వచ్చిననాటినుండియు నటులనే నా ట్రంకుపెట్టెయడుగున పడియుండెను.

అందువలన పాలచట్టివంటి భద్రప్రదేశమేది గన్పించునాయని యీ నూతనగృహమున రహస్యస్థలమునకై నెమకుచుంటిని. ఇచట నట్టికిటికీగాని గోడకు దూలములకు మధ్యసందులుగాని లేకుండెను. అంతియగాక నాడబ్బాలు, పాలచట్టీలు మొదలగువాటి నన్నిటిని లవుజాయియొద్దనే యుంచుచుంటిని.

ఏమియుతోచక నా గదిలో నటునిటు సంచారము చేయుచుండగా నంతరింద్రియము లూరకుండక నేమేమియో యాలోచించుచుంటిని. తలవని తలంపుగ నాగదియందొక మూలనుండిన యొక కర్రపలకమీద నా కాలుపడెను. దానిమీద నొక తివాసి పరచియుండుట వలన క్రిందనున్న కర్రపలక యెవరికిని గన్పించకుండెను. తివాసికిని బల్లకును కలిపి కొట్టినమేకులేలనో కదలుచుండుటవలన నాకు సంశయముగలిగి వెంటనే మేకులనూడబెరికి తివాసినెత్తితిని. దానిక్రిందనున్న కర్రపలక మాత్రము భూమట్టమునకు సమానముగ మేకులలో తాపియుండెను. తివాసిమేకులవలెగాక నీ మేకులు గట్టిగ నాటియుండెను. మేకులుమాత్రమేగాక దానికేదియో మీటగూడ నుండెను.

పనికిమాలిన పనులు జేయుటలో నా కెందులకింత పట్టుదలగయుండునోయని యప్పటికప్పుడూహించు చుంటినేగాని నాకా తత్వమెప్పటికిని బోధపడకుండెను. ఇదివరకెందుకట్లుచేయు చుండినను యీమారుగూడ చేయకతీరదనియు, ఇటువైనట్టి యవసరకుతూహలమును విడువవలెననియు నిశ్చయించుకొని ఆబల్లనెట్లులైనను నూడబెరుక నుద్దేశిం

చితిని. దానిక్రింద విలువగల వస్తువుల నుంచుకొనుట కనుకూలముగ నుండునని నా యాలోచన.

శిరోజముల పెంపొందించుకొనుటకు నుపయోగించు పెద్దరకం సూదులందొకదానిని బల్లసందులలో బెట్టి మీటగా మీటగా చివరకాబల్ల ఊడిపోయెను. దానియందేమి యుండునో చూడవలయునను యుత్సాహముతో నొక క్రొవ్వువత్తిని వెలిగించి దగ్గరనుంచుకొని నేలపై పద్మాసనము వేసికొని కూర్చుండి యా భూగృహమునందున్న వస్తువుల నొక్కటొకటిగ బయటికి దీయనారంభించితిని. దానిలోని వస్తువులను బట్టి చూడగా దానినిదివరకె యెవరో రహస్యస్థలముగ నుపయోగించు చుండెడివారని నేనప్పుడూహించితిని.

మొట్టమొదట నొక పురుషవ్యక్తి జన్మలేఖ నాకగుపడెను. అది చూచి నెడ్డుదకాదని తెలసికొని యావలపడవైచితిని. పిమ్మట సప్తవంకరలతో అల్లిబిల్లిగ వ్రాసిన పటమొకటి గాన్పించెను. దానిని పరికించగా ఫెర్ను ద్వీప పటమునకు సమూనాప్రతి వ్రాయవలయునని యెవరో యుద్దేశించి వ్రాసినట్లుండెను. దానికొక కార్డు గుండుసూదితో సతికి యుండెను. ఆ కార్డుమీద నీక్రింద విలాసముండెను.

“ మెల్లేలండుసన్సు కూరలవర్తకులు.
కవెంటుగార్డెను,
లండను ”

ఇవిగాక నింకేవేవియో దొంగతనపు పనిముట్టులుండెను. చిన్నగునపము, పార, బొరిగె, చీకటి లాంతరు, నల్లనిగుడ్డ, గుప్పెడు మారు తాళముల చెవులు యింకేమేమియో యుండెను. వాటినన్నిటిని బయట వేసితిని.

*  *  *  *  *

ఇంక నాగోతిలో మరేమియు నుండదనుకొని, అయినను దీపము పెట్టిచూచెదనుగాక యని క్రొవ్వువత్తిని దానిదగ్గరకు తీసికొనివచ్చితిని. అంతట నా యడుగు భాగమున నేవియో జిగజిగ మెఱయసాగెను. అదియే మని తీసిచూచునరికి అమూల్యములగు మూడు వజ్రములుగల బంగారు ఉంగరము !

దానినిబట్టుకొని యచటనే చతికిలబడి దీనితోనేమిచేయవచ్చునని యాలోచించితిని. మరల లేనిపోని యాలోచనములలోబడి విచారము నొందజనదని నిశ్చయించుకొంటిని. కాని మనసు కోతివలె నూరకయుం డదందురుగదా ! అందులోనావంటి చపలచిత్త సంగతినింక చెప్పుట కేమున్నది ? నేడు యెటువంటి జీవనవృత్తి నవలబించెనో ఇదివరకే పూర్తిగ తెలసినది. అందులకు నిదర్శనములిచట ఎన్నియో గన్పించి నవి. అయినను నేడు నా మాటలను త్రోసివేయుటవలన కొంతయను మానము కలిగెను. ఇప్పుడా యనుమాన మస్తమించిపోయెను! ఎంత మంచివారైనను దొంగలుతమతమ తప్పిదముల నూరకనొప్పుకొం దురా ? ఆ రత్నఖచితమైన యంగుళీయకము చూచినప్పటి నుండియు నాయొడలు గగుర్పాటు నొందుచుండెను. ఏ దొంగతనములోనో దొర కిన వస్తువులతోపాటు దీనినిందు పడవైచి పిమ్మట నతడుదీని సంగతి మరచిపోయియుండును. దొంగవస్తువు నాకేలయని దానినెచటినుండి తీసితినో యచటనే పడవైచితిని. తక్కినవస్తువు లన్నిటినిగూడ నటు లనేయుంచి మెడ్లీసన్నువారి కార్డుమాత్రము పైకితీసితిని.

ఈరహస్యస్థలము నింకెవరికిని తెలియనేరదని యోచించి నాయొద్ద నున్న డబ్బునుగూడ దానిలోనుంచితిని. లారెన్సు కవరుగూడ దాని లోనికే పోయెనని వేరుగ చెప్పవలయునా ?

రోజు మేరి కీరహాస్యము తెలియనట్లుండెను. నెడ్డు నిజముగ మరణించి యుండునెడల జీవకోటియందెవరికిగూడ దీనిసంగతి తెలసియుండదు. ఎవరికి తెలియుటకైన నవకాశమేమున్నది?

మెడ్లీఅందు నన్నువారి కార్డు నాకు క్రొత్తయాలోచనల గలిగించి అప్పటి యాలోచనలను తొలగించినది.

దురదృష్టవంతము, నాశాభంగకరమునగు ఆనాటకములో లారెన్సు నన్ను నాయికగ నియమించుటలో నెట్టిలోపమును గనిపించదు. ఎన్ని మారులెన్ని యిడుములు అనుభవించినను క్రొత్తపరిశోధన లొనరించుటకు నామన సెప్పుడును సాహసించుచునేయుండును. దానియందేదియో గూఢరహస్యముండిన నింకనేమి తరువాయి!

మెడ్లీ కుటుంబ వ్యాపారమునకు సంబంధించిన ఆకార్డు, ఫెర్న్ ద్వీపపటమునకేల నంత జాగ్రత్తగా నదికించియుండవలెను? కార్డు విలువగలదిగనుక నావర్తకులుగూడ గొప్పవారుగ నుండవలయును. దొంగతనమె జీవనోపాధిగ నేర్పరచుకొనినవాని చోరద్రవ్యముతో నొకమూలబడియున్నందులకు పాపమాకార్డునకు ప్రాణమే యున్నచో యెంత లజ్జించియుండునోగదా!

కార్డునుబట్టి మెడ్లీ గొప్ప మర్యాదస్తుడనియు, అతని కొడుకులు చురుకుగ పనిచేయువారనియు నేనూహించితిని. అట్టివారిలో నేనును నా వారును యిరికికొనిన ఈకుతంత్రమునకు నేమిసంబంధముండగలదు? ఆలోచించుకొలది నీయంశమును తప్పక కనుగొనవలయునను కుతూహలమతిశయింప జొచ్చెను.

ఆ బల్లను తివాసిని మరల గట్టిగ బిగియించి యా వలిగదిలోని కరిగితిని. అచట దీపము వెలుగుచుండెను. సగముకుట్టిన బట్టలు నా రాకకెదురు చూచుచుండెను. మరికొన్ని నూతనాంశముల నరయుటయు, మరికొన్నింకను తెలుసుకొనవలసి యుండుటయు సంభవించుట వలన నా పనిసాగకుండెను.

ప్రకాశవంతముగ వెలుగుచుండిన నా విద్యుద్దీపకాంతులలో నాకార్డును పరిశోధించి చూడగా దానిమీద పెన్సిలుతో నేమియో వ్రాసినట్లుండెను. కాని దానినెంతజదువ ప్రయత్నించినను జదువలేకుంటిని. అప్పుడు నాకదివరకేదియో నవలలోచదివిన "కనబడనిసిరా" సంగతి జ్ఞాపకమువచ్చెను. ఈ యక్షరముల నాసిరాతో వ్రాసియుందురనియు, కనబడనిసిరాలలో కొన్నిటికగ్ని వేడిమి తగిలిన నవి ప్రస్ఫుటములగు ననియు నేనెచ్చటనో జదివిన సంగతియుగూడ జ్ఞాపకమువచ్చెను.

వెంటనే దీపము వెలిగించి కార్డును వెచ్చగిలచేసితిని. రెండునిముషములట్లుంచి చూడగా నే నా నవలలో చదివిన సంగతి యదార్థమని ఋజువయ్యెను.

ఆ కనబడనిసిరాతో నా కార్డుమీద నీవిధముగ వ్రాసియుండెను. "మూడుగంటలవేళకు నీవీపటమును తీసికొని కవెంటుగార్డెనునందలి కూరగాయల వర్తకుడు జానుమెడ్లీగారి దగ్గరకరిగి యీ పటమునతని కిచ్చునెడల నీకు ఏబది సవరనుల నీయగలడు."

ఆ గుహాలో నెన్నిదినములనుండి యీ కార్డుపడియుండెనో నాకు తెలియదు. నేను చూచునప్పటికి మిగుల ధూళిధూసరిత మగుటవలన చాలకాలమయి యుండుననుటకు సందేహములేదు. ఇంతకాలమైన పిమ్మట నీ మాటలకేమి విలువయుండును! అయిన నూరకుండుటకు మనసంగీకరింపలేదు.

మరునాడు భోజనమైన వెంటనె కవెంటుగార్డెనునకు బయలుదేరితిని. జానుమెడ్లీయనునతని మూడుగంటలపుడు చూడవలసినదని కార్డుమీదనుండెను. అనగా కార్డుమీదనున్న విలాసముగల తావుననే చూడవలయునని యుద్దేశించివుండవచ్చును. మూడుగంటల వేళకు కవెంటుగార్డెనులో సాధారణముగ కొట్టులన్నిటిని కట్టివేయుదురట! నేను పోయినరోజున నచటి దుకాణములను మరింతముందుగనే కట్టివే

సిరి, తెఱచియున్న నచ్చుటచ్చుట రెండుమూడున్నను వాటివ్యాపారము గూడ పూర్తియైనట్లుండెను. ఒకదుకాణముదగ్గర తుడుచునప్పుడు దుమ్ము రేగకుండుటకై యొకబాలుఁడు ముందుగా నీరు జల్లుచుండెను. వానినడుగగా మెడ్లీవారి దుకాణమునకు దారిచూపించెను. నేనచటి కరుగునరికి తలుపులుమూసి యుండుటయెగాక వాటికడ్డముగ పెద్ద యినుపగజములుగూడ బిగియించి యుండెను. మెడ్లీలుతక్కిన వారందరి కంటె ముందుగనె దుకాణమునెత్తివేయుదురట!

ఇకనీరోజునకు కార్యములేదని నేనచటినుండి మరలుచుండగా నాత లుపునందు యిమిడ్చియుంచిన చిన్నతలుపు నొకదాని తెరచికొని యొకపురుషుడు తొందరగ బైటికివచ్చెను. వానిదుస్తులనుబట్టిచూడగా వర్తకునివలె గన్పించెను. చిన్నతలుపున కీవలకి తాళము వేసి యింటికరు గుట కతడుద్దేశించుచుండెను. నేనంతటధైర్యము వహించి యతని సమీపించితిని. నేనచట నేమియు తోచనిదానివలె తిరుగుచుండుటను గాంచి యతడిచటికేల వచ్చితివని యడుగునట్లు నాదెసచూచెను. నేనేమియు మాట్లాడకుండుటను గాంచి నాదగ్గరకువచ్చి నేనాశ్చర్య మొందుచుండగా టోపీనెత్తి గౌరవసూచకముగ పలుకరించి "అమ్మా! అడిగినందులకు క్షమింపవలయును? మీరిచట నెవరినైన జూడనెంచితి రాయేమి?" అని పల్కెను.

నేనింక నేదియో చెప్పక తీరదనుకొంటిని. ఇంతకును నేను వచ్చిన పని యేమంతముఖ్యమైనది? ఎవరేని ప్రశ్నించునెడల మన మీవిధ ముగ ప్రత్యుత్తరమీయవలయునని నేనిదివరకేమియు ననుకొనలేదు. అందువలన నానోటికప్పుడు తోచినదాని నిట్లు వచించితిని.

"అవును జానుమెడ్లీగారికొక జాబు తెచ్చితిని. ఆయన యెచట నుం దురు? మీరేనా?"

నా యందు దయతో మాట్లాడుటనుజూచి యితడే జానుమెడ్లీయని తలంచితిని. ఆతడేజానుమెడ్లీయగునెడల నా జేబులోని కార్డు నతనిచేతి కిచ్చి, ఆ వ్రాతకర్థమేమని మోమోటమువిడచి యడిగియుందును.

తాను జానుమెడ్లీకాదనుసట్లు అతడు తలనూచెను. కాని జానుమెడ్లీ కెవరోయుత్తరమును తెచ్చెదరని యెఱిగినట్లు అతనివైఖరి బోధించు చుండెను.

"మీరొకనెల దినములకు ముందుగ రావలసియుండెనమ్మా! ఏల నింత ఆలస్యమైనది? మీరు రారనుకొని జాను నిరాశచేసుకొనెను. ఇప్పుడు వారింటికేగిన నచటదొరకవచ్చును."

"వారిల్లెక్కడ?"

"లాకోర్టులకు వెనుక కింగుస్వే కావల నెడమప్రక్కనున్న చిన్న సత్రమువీధిలో నిరువది యవగృహమునందున్నాడు. ఇచటికెంతయో దూరముండదు. రెండుమూడుఫర్లాంగులుండునేమో!"

నాకీ సమాచారము తెలియబరచి నందులకతనికి కృతజ్ఞతావందనము లర్పించి యచటినుండి చిన్నసత్రమువీధికి బయలుదేరితిని. అతడొకదిశకును, నేనింకొక దిశకును వెడలితిమి.

ఇప్పటిస్థితిలో నీ నూతనసాహసమునకు పూనుకొనుట నాకెంత మాత్రము నిష్టములేకుండెను. త్రాగుబోతు మైకములోచేసిన దుర్మార్గముల నా వెనుక తల్లచుకొనిపరితపించునప్పుడు ఇటుపై మరియొకచుక్కనైన త్రాగనని యనుకొనునట! అట్లనుకొనుచుపోవునది మరల నా సారాయి దుకాణమునకే!

ఆ విధముగానున్నది నా ప్రవర్తనము. ఈ కుతూహలాన్వేషణ ప్రయత్నముల నింతటితో కట్టిపెట్టుదమనుకొనుచునయిన ఆ యిల్లు చూచిపోవుటయందేమి విపత్తున్నదనియెంచి మెల్లమెల్లన కింగుస్వే కావలకరిగి చిన్న సత్రమువీధిని చేరుకొంటిని. దానిదారి కనిపెట్టుటకెంత మందినో యడుగవలసివచ్చెను. అయినను విడచి పెట్టలేదు.

20 వ గృహముచటి పుస్తకాంగణములకు ప్రక్కనె యుండెను. దానికి రంగులు మొదలగునవి వేసి క్రొత్తగ నలంకరించినట్లుండెను. తలుపులమీదను కిటికీలమీదను క్రొత్తరంగులు వేసినట్లుండెను.

జానుమెడ్లీగారి దుకాణమున కేదియోతుంటరియాలోచనతో బోవ నెంచుటకును, అచ్చటి స్థితిగతు లనుకూలముగనుండిన నతనితో మాట్లా డుటకును, లేకున్న నచటినుండి వెంటనే గృహోన్ముఖ నగుటకును ఆతనియింటి కరిగి అతనితో నేపనియులేనిదే లోకాభిరామాయణము నేదియో మాట్లాడగోరుటకును చాల భేదమున్నది. అచట బహుశా మెడ్లీభార్య గూడ నుండునేమో ?

అయిన నేదియో కాగితములసంచి తెచ్చువారి కేబదిసవరనుల నీయ సిద్ధముగనున్న ఆ జానుమెడ్లీ నొకసారి చూడనిదే యింటికరుగు టకు బుద్ధిపుట్టకుండెను. వీలగునెడల నతనితో పరిచయముచేసికొని ఆతనికీ ఫెర్నుద్వీపవ్యవహారమేమైన తెలసియుండునేమో ప్రయత్నిం చిచూడవలెనని కుతూహలముగనుండెను.

కొంతసేపటికి నేనొక యుపాయము నాలోచించితిని. వీధిగుమ్మము నొద్దనుండు విద్యుద్యంత్రపుగంట ప్రమోగించుటయు, లోపలినుండి మెడ్లీగాని, అతనిభార్యగాని తలుపుతీయుటకు వచ్చునెడల వారికి తెలి యని వారిపేరుచెప్పి వారచట నున్నారాయని ప్రశ్నించుటయు లేరని చెప్పినపిమ్మట ఆవలికరుగుటయు వారిరువురిలో నెవరునురాక పని మనిషివచ్చి తలుపుతీయునెడల నామెనేవేవియో ప్రశ్నలనడిగి కొంత సమాచారమును తెలసికొని పిమ్మట నాదారిని నేను వచ్చుటయు చేయుదమని యెంచితిని.

ఇంకేమియు నాలోచింపక వెంటనే గుమ్మముసులోనికరిగి గంట మ్రోగించితిని. తక్షణమే సేవకురాలువచ్చి తలుపుతీసెను. ఆమె ముందరిచావడిలోనే యుండవలయును. లేకున్న నింతవేగమెట్లుతలుపు తీయగలిగెను ? ఆమె యెవరు ? గ్రీన్విచ్చిలో జూచిన భేజుసతియె ! నెడ్డు రెండవభార్య-ఆ బాలవితంతువె ! ఆమె విడచిపెట్టిన గదులనె నేనద్దెకు తీసికొంటిని. ఈమె యిచటి కెట్లువచ్చెనుచెప్పుమా ?

ఆమె వెంటనేనన్ను గుర్తించియుండవలయును. కాని గుర్తించినట్లు ప్రవర్తింపకయె స్నేహభావముతో నావైపుజూచుచు నావచ్చినపని నడిగెను.

నేనేమిచెప్ప నుద్దేశించితినో నాకపుడేమియు జ్ఞాపకములేకపోయెను. అయిననావేళకేదియో చెప్పితిని. చెప్పకూడనియంశము నే చెప్పియుంటి నని తరువాత సంశయించితిని. నా ప్రత్యుత్తరము వినినవెంటనే యా ప్రక్క గదిలోనున్న లారెన్సుడ్యూకు బయటికివచ్చి నావైపు చూచెను.

లారెన్సుచూపులును, ఆముఖమును నన్నాదరింప నెంచినవానివలె సంతోషముతో వికసించుచున్నటులుండెను. తలవనితలంపుగ నేనతని నచటజూచుటకెంతవిస్మయ మొందుచుంటినో యతడుగూడ నన్నచట నాస్థితిలో జూచుటకంతకంటె నెక్కువ విస్మయ మొందసాగెను. కాని నన్నుచూచి యతడు పరమానంద మొందినట్లెంతయో మర్యాద జేసెను.

"ఓసిలోర్నా ! నీవేనా ? ఇంకెవరోయనుకొంటిని. ఎక్కడను కను పించకుండుటవలన నీవు మరణించియుందువని నిరాశచేసికొంటిమి. ఆ డికెన్సుగాడిప్పటిలో బ్రదికియుండునెడల నీపునస్సృష్టిగురించి మరి యొక నవలవ్రాసియుండును. రోజా ! నీవు లోపలికిపోయి మాచెల్లెలు భేజుసతివచ్చినదని అమ్మగారితోచెప్పుము. వెంటనే రమ్మంటిననుము."

ఆ మాటలను వినినపిమ్మట నాకు మరియూపిరాడలేదు. లారెన్సు నన్నెంతదయతో నాదరించుచున్నను నేనునాయంతనె మృత్యుగృహము ప్రవేశించితినని యెరుగుదును. ప్రపంచమందలి జనులందరిలో నితని నొక్కనినె నమ్మవలెనని నేనిప్పుడు డాగియుంటిని.

అట్లయిన లారెన్సే "జానుమెడ్లీ" పేరునవ్యవహరించుచున్నాడా యేమి? నా "మెల్బిమారు" పేరువలె?

ఆ యింటివైఖరినిజూచి ఆ సంగతి నేనిదివరకె గ్రహింపవలసియుండెను. ఆ రంగులు, అలంకారములు, చిత్రములు అన్నియు లారెన్సు అభీష్టప్రకారము జరిగించినవే కాని లారెన్సు వేషభాషలుమాత్రము చాలవరకు మారినట్లుండెను. ప్రాగ్దేశీయవైభవప్రకటనావాంఛ యతని నిపుడు పూర్తిగవిడచినట్లుండెను. అంతధనము నంతకొల్లగ వెచ్చించిన నాటకము నెట్లు పరిత్యజించెనో యటులనే తదితర వాంఛలనుగూడ కొంతవరకు విడచిపెట్టినట్లుండెను.

ఇప్పు డతడీనాటి —అనగా అయిదవ జార్జిచక్రవర్తి కాలము నాటి—తగుమనుష్యులందొకనివలె కన్పించుచుండెను. ఆ వేషము, ఆ బట్టలకట్టు, ఆ హావభావచేష్టలు అన్నియుగూడ నత్యంతాధునిక నవనాగరికతను సూచించుచుండెను. ఆ చేతివ్రేళ్లయందొక దానికి బరువైన యుంగరమొకటి యుండెను.

బహురమ్యముగ నలంకరించియున్న ఆ యింటినిగాని, లారెన్సు వేషవైఖరులనుగాని, జూచి యానందించుట కిప్పుడు తగినంత విశ్రాంతి గాని, మనోనిశ్చలతగాని లేకుండెను. పైకి గంభీరముగ నటించుచున్నను లోపలమాత్ర మతివిపరీతమగు భయము గలుగుచుండెను. నేనచటినుండి యావలికరుగగనె వారి పనిమనిషి నాయాపద్వృత్తాంతమును వారికెఱింగించును. అందువలన నేనిపుడింటికరుగగనే యిప్పటి బసను మార్చి మరియొక యింటిని జూచుకొనవలయును. నాకింక

నెచటయింత యిమ్మగుబస దొరకగలదు ? లవుజాయివంటి యుత్తమ యిల్లాలు నాకింకెచట లభింపగలదు ? ప్రస్తుతమామె సహాయము గూడ చాల అవసరముగనుండెను. ఆమె యందిప్పడు నా కపరిమితముగు ప్రేమకుదిరెను. ఆమె యింటిని మానాన్నగారి యింటికంటె నధికముగ ప్రేమించుచుంటిని. నాహృదయమందంత నిగూఢముగ దాచుకొనిన రహస్య మామెయొక్కర్తెకె తెలియును. ఆ సంగతి నోరుజెరుంగరాదు. ఎవరికేమి బుద్ధిపుట్టునో ? ఇంతకును ఫ్రరిటిరోజులలో నామేలు గోరు వారి సహాయము నాకతియవసరము. ఇంతవేగమింకొకరు నాయభి మానము కావలసినవారెచట దొరకెదరు ? కోరి కొంపితో తలగోకి కొనినట్లు నేనిప్పుడూరక నీ పిచ్చిపనినేల జేసితినని విచారింపసాగితిని. ఏమాత్రము జ్ఞానముండి యాలోచించినను యీరోజుమేరీకిని లారెన్సు నకునుగల బంధుత్వము నేనిదివరకె యూహించి యుండవలయును.

ఒక యరగంట నేపచట గూర్చుండిన పిమ్మట లారెన్సు నన్ను కచేరీగదిలోనికి తీసికొని పోయెను. మొదట నేననుకొనినంతకంటె నాగృహము యెక్కువ విశాలముగ నుండెను. ఆతెల్లనిగోడల చిత్ర విచిత్రములగు రంగుపటములును, వెండి స్టాండులును, తెల్లని చీనా గిన్నెలు, వాటియందందముగ నమర్చిన కానితప్పు పూగుత్తులు, ఆసోఫాలు, కుర్చీలు మొదలగు వస్తువులన్నియు చాల అందముగ నుండెను. రంగు అద్దముల బీరువాలు రెండింటిలో నతడు తన పుస్తక ముల నన్నిటి నమర్చుకొని యుండెను. పిమ్మట మేమాగదిలో సుఖా సీనులమైన వెనుక బంగారు 'పెట్టె'లోనుండి సిగరెట్టుదీసి తాబేలు చర్మముతో చేసిన గొట్టమునబెట్టి కాల్చుచు నతడిట్లు పలికెను.

"లోర్నా నీవిచటి కెట్లు వచ్చితివి? మంచిపనినే చేసితివి. కాని నేనిచట నున్నట్లు నీకెవరు చెప్పిరి?" అని కొంచెము వెనుక తిరిగి "ఇప్పుడు గూడ నిట్టిబట్టలనే వేసికొనుచున్నావేమి? నాభార్యను

జూడుము; ఆమె యెంతచక్కగ ముస్తాబుకాగలదో చూచి యానందించగలవు!" అని హెచ్చరికగ పలికెను.

అట్లయిన లారెన్సునకు వివాహమైనదా? ఇదివర కొకసారి యతడేమియో బలికెను. అప్పుడేదియో యాలోచనలసందడిని నేనామాటను బాగుగ వినిపించుకోలేదు. మరల నిప్పుడుగూడ నామె వస్త్రధారణము గురించి యేమేమియో చెప్పుచున్నాడు.

ఎవరా భార్య అనునట్లు నేనతనివైపు చూచితిని. "మరియెవరు ఘర్చిసనుకన్యయె! నేనామెను "అబిగేయి"లని పిలచుచుందును. ఆపేరామె కెంతయో తగియున్నది. కాని—" అని యతడు మూలుగుచునూరకుండెను. ఆమెయందు గూడ కొన్నిలోపము లున్నవని యతడు చెప్ప నుద్దేశించినట్లు నేను గ్రహించితిని.

"సరియె. దానికేమిగాని నేనిచట నున్నసంగతి నెట్లు తెలసికొంటివి?" అని యతడు మరల నడిగెను.

"కవెంటుగార్డెనులో పళ్లను, కాయగూరలను విక్రయించుచున్న మెడ్లీయను నతనివలన తెలసికొంటిని."

అందుపై లోరెన్సేదియో యోచనచేయ నారంభించెను. ఇంతలో పనిమనిషి వచ్చెను.

"అమ్మగారిప్పుడె వచ్చెదరు?"

"అవును. వాడా? వాడు కూరగాయల నమ్ముచున్నా డనుకొనియెదను."

"మెడ్లీగాడా అండి? మనకు కూరగాయల నిచ్చుచున్నది వారే నండి" యని యామె పలికెను.

"అవును నిశ్చయమె! ఫ్రెండిలు బావమరిది. చూడుము. ఫ్రెండిలుతో గలసి యాడాబాగదిలో నివసించుచున్నది వాడేనా?"

" అవునండి"

ఇంక నామె నడుగవలసినది మరి యేమియు లేనందున నామె యావలి కరిగెను. లారెన్సు మరల నావైపు తిరిగెను.

"మెడ్లీ అరగంట క్రిందట ఇంటికి వచ్చినాడు. వాడు నావిలాసమును నీకు చెప్పినాడనుమాట యబద్ధము. వాడట్లు చెప్పజాలడు."

ముందేమి జరుగునోయని జాగ్రత్తగ నాలోచించుకొని వారి దుకాణములోనున్న యతడు నాకీ విలాసమునిచ్చెను. ఇచటికి వచ్చిచూడ నిది నీయిల్లుగ పరిణమించెను. ఆదుకాణము ముందర మెడ్లీవారి పేరుతో నొక బల్లకట్టియుండెను. నిజముగ నీవిచట నుందువని నేననుకొనలేదు. జానుమెడ్లీని జూడదలచి వచ్చితిని "అని పలికితిని."

ఈమాటలను విని లారెన్సు తనకీవి నించుకమార్చి నే చెప్పుమాటల నాతురతతో విననారంభించెను.

"వానితో నీకేమిపని ?"

"వానితో నాకిపుడెట్టి పనియులేదు." అని తప్పించుకొంటిని.

నేను మాట్లాడుచుంటినే గాని నాదృష్టియంతయు రోజుమేరీమీా దనే యుండెను. ఇప్పుడీమె లారెన్సు ఇంటియందేమిచేయుచున్నది చెప్పుమాయనియు, ఆమె యెవరో లారెన్సునకు తెలియునాయనియు నేనూహించుచుంటిని. ఆయనకు తెలియకున్నను మర్చిసనునకైనను తెలియకపోదు. ఇంతవరకు నేనతని మోసగించిన విషయమునుగూర్చి లారెన్సేమియు మాట్లాడలేదు. ఫెర్ను ద్వీప పటమును మరల సంపాదించుకొనుటకు తానుచేసిన ప్రయత్నములను గూర్చియైన నతడేమియు మాట్లాడలేదు. మేమా గొడవలో ఒడులోపల నతనిభార్య వచ్చెను. ఆమె నిప్పుడు యే పేరుతో పిలువవలయునో నాకు తెలియకుండెను. ఆమె నింతవరకు ఫ్లోరెన్సు మర్చిసను అను పేరుననే నేను సంబోధించుచుంటిని. కాని లారెన్సామెకు "అబ్గేయి" లని పేరు పెట్టెనట.

"అబిగేయిలూ! మనల సంతోషపెట్టుటకు లోర్నా యిటువచ్చి నది. చూచితివా?" అని దర్జాగా చెప్పుచు "వెంచి, ఇప్పుడే తేనీరు తెచ్చియిచ్చునా?" లేదా? అని యడిగెను.

"తప్పకుండ తెచ్చును. ఏమండీ భేజుసతిగారూ! చాలారోజులకు దర్శనము. మాయందెంతయో దయతలచి——"

"మీశరీరమండిప్పుడు స్వస్థతగానుండుట నాకెంతయో సంతోష ముగనున్నది. నాకీసమాచారము ఆశ్చర్యము కలిగించుచున్నది. మీ కుభయులకు వివాహమైనట్లు నాకింతవరకు తెలియలేదు."

"మీ నాన్నగారికీ వివాహము ఇష్టములేదు. మీకు గూడ నిష్ట ముండదేమో?"

లారెన్సు వ్రేళ్లనాడించుచు మాసంభాషణ కంతరాయము గలిగిం చెను.

మొత్తముపై నీ సమావేశము మిగుల నాశ్చర్యకరముగ నుండెను.

మొట్టమొదట లారెన్సు ఫ్లోరెన్సును పెండ్లియాడుటయె వింతగ నుండెను. మెడ్లీ గూఢవ్యాపారము మరింత ఆశ్చర్యకరముగ నుండెను. రోజుమేరీ లారెన్సు గృహమున పనిమనిషిగ నుండుట దానికంటె నాశ్చర్యముగ నుండెను. ఈవిధముగ నే నత్యంత ఆశ్చర్యకరమగు గూఢవ్యూహమున నిరికికొంటిని. లారెన్సునకు ఆతని భార్యకు రోజు మేరీకి గూడ నా రాక అగమ్యగోచరముగ నుండెను.

మనోహరముగ నలంకృతమైన ఆ గదిలో మేము కూర్చుండి యుండగా రోజుమేరీ తేనీరు తెచ్చెను.

తరువాత లారెన్సు నాన్నగారికిని తనకును సంభవించిన కలహమును గూర్చి కొంత ముచ్చటించెను. తరువాత కలహ మెట్లు సంభవించెనో, నాన్నగారి నిరంకుశ వ్యాపారము తన కెట్లు కష్టతరముగ నుండెనో ఆ సంగతు లన్నిటి నతడు పూసగ్రుచ్చిన ట్లంతయు చెప్పెను. "లోర్నా! నీవు నమ్మెదవో నమ్మవో గాని ముసలాయనకు రోజురోజునకు పిచ్చి ముదిరిపోవుచున్నది. నా వివాహము సంగతి వినినంతనె యతడు మండి పడెను. అందువలన నతని నింకొకసారి చూచుటకైన నా మనస్సంగీకరించినది గాదు."

"అట్లయిన డ్యూకు కంపెనీ వ్యాపారము సంగతి యేమైనది?" అని నే నడిగితిని. ఆ వ్యాపార మంతయు పూర్తిగ చెడిపోవుచున్నదని లారెన్సు నన్ను మోసముచేయ నెంచి యొకప్పుడు నాతో చెప్పిన మాట నా కప్పుడు జ్ఞాపకము వచ్చెను.

"ఏమి? మన వ్యాపారమున కేమి?" అని యత డనాలోచితముగ పూర్వము తాను చెప్పిన మాటలనే తిరిగి పలికెను.

"ఆ వ్యవహార మంతయు నిపుడెవరు చూచుచున్నారు?" లారెన్సు అపు డేదియో సంగతిని జ్ఞాపకము తెచ్చుకొన ప్రయత్నించుచుండి నట్లు నా కతని ముఖము చెప్పక చెప్పుచుండెను.

"ఇంకెవరు చూచెదరు? మీ నాన్నగారే, లారెన్సు నావలకు తరిమివేసి యాయాస్తి నంతటి నపహరించినారు. సంవత్సరమునకు రెండువేల సవరనులను మాత్రము మాకు ముష్టిభరణము నిచ్చుచున్నారు. అందువలననే మేమీసందులలో నెట్లనో కాలము వెళ్లబుచ్చుకొనవలసి వచ్చినది."

"ఈమాటల కేమిగాని లారెన్సు నీవిదివర కేదియో చెప్పియుంటివే?" అనుచు నాశ్చర్యముతో లారెన్సుదెస జూచుచు మరి మాట్లాడ కూరకుంటిని.

"మీ రేమి చెప్పితి రేమిటి?" అని ఫ్లోరెన్సాతని నతి తీవ్రముగ ప్రశ్నించెను.

అప్పటి వైఖరినిబట్టి చూడగ ఫ్లోరెన్సున కతనిపై నపరిమితమగు అధికారము ప్రబలెననియు, ఆమె మాట కెదురాడుట కతడు భయపడుచుండెననియు నేను గ్రహించితిని.

"అవునవును. ఇప్పుడు వవ్యహారములన్నియు చక్కబడినవి. స్థితిగతులు నేననుకొనినంత విశేషముగ చెడలేదు. ఇప్పుడా వ్యవహార మంతయు జక్కగనే జరుగుచున్నది."

"ఆవ్యాపారమున కెప్పుడునుగూడ తొందర కలుగలేదనుకొనియెదను. నాన్నగారు దానిపై నెప్పుడుగూడ నధికారము తగ్గించుకొనలేదనుకొనియెదను." అని మోమోటము వీడి పలికితిని.

లారెన్సు నామాటల కెదురాడజాలక తన యసత్యప్రలాపము నంగీకరించువాని బోలె గ్రుడ్లను మిటకరించి యూరకుండెను. అంత

నతనిభార్య కటువుగ "లేకున్న మరియెప్పుడైన నెవరికమ్మా ఆకం పెనీపై నధికారము నాకు తెలియ కడుగుచున్నాను?" అని పలికెను.

అంత ప్రశ_స్తముగ సాగుచున్న మా వ్యాపారము చెడిపోయినదని చెప్పునెడల నేను తన మాయోపాయములకు సులభముగ జిక్కుదునని యెంచి లారెన్సునాతో నప్పుడట్లు చెప్పియుండెనని గ్రహించి యూరకుంటిని.

ఫ్లోరెన్సునకును, ఫ్రాస్టునకునుగల సంబంధ బాంధవ్యములను పూర్తిగ నెరిగియుండియు, నేమియు నెరుగని దానివలె "నాన్నగారి యింటి యజమానురాలి సంగతియెట్లున్నది? ఆమె యధికారమేమైన తగ్గినదా? లేకమరింత ప్రబలమైనదా?" యని సాహసించి యడిగితిని.

అంతట నొకనిముష మెవరును మాట్లాడలేదు. వారుభయులలో నెవరునుగూడ నేనట్టి ప్రశ్న నడిగెదననుకొనినట్లులేదు. అంతట లారెన్సు కొంచె మాకులపాటుతో "ఫ్రాస్టుసతినతడు పనిలోనుండి తప్పించినట్లున్నదే!" యనెను.

"ఆఁహా!" యని గొప్పమార్పేదియో జరిగియుండుననియు, అందు వలననె అన్ని పరిస్థితులు గూడ నొక్కసారిగనిట్లు మారినవనియు నేనప్పుడూహించుకొంటిని.

ఫ్రాస్టుసతి తనకు మాత్రమెగాక నాకుగూడ నత్తగారగునను సంగతి లారెన్సున కింకను తెలియకుండునాయని నేను సంశయించితిని. తనకును, తనదాసి రోజుమేరీకి గూడ నామెయె యత్తగారను సంగతి నతడు గ్రహింపకుండునా? ఆయన కాసంగతులన్నియు తెలియునో, తెలియవో, భగవంతునకెఱుకగాని తన పన్నాగమంతయు తనశక్తిని మించి పోయినదని మాత్ర మతడు తప్పకుండ గ్రహించి యుండవలయును.

నేనచట నేమేమియో మాట్లాడుచుంటినే గాని ధ్యానమంతయు నింకొకవంకనుండెను. నేను జూడవచ్చిన జానుమెడ్లీ యెచటనున్నాడు?

రోజుమేరీ యిచటి కేలవచ్చినది? నారహస్యము నామె వీరిలో నెవరి కైన చెప్పినదా? అను ప్రశ్నలు నాతలలో నిరంతరము తిరుగులాడు చుండెను. ఫ్లోరెన్సు టక్కరిచూపులను గాంచునపుడెల్ల, నాకామెయం దనుమాన మధికమగుచుండెను. ఆమె యిదివరకు నారహస్యములన్నిటి నెటులనో గ్రహించెను. ఇప్పుడు మాత్రము గ్రహించి యుండదాయేమి? ఇప్పటికి గ్రహింపకున్న నికమీదనైన తప్పకుండ గ్రహింపగలదను భయము నాకపరిమితముగ నుండెను.

ఎట్లయిన నచ్చటనుండి త్వరగా తప్పించుకొని పోవలయునని నాకుం డెను. కాని యెట్లు పోవచ్చునను తెరవు నూహింప నారంభించితిని.

కాని నేనచటినుండి యప్పటి కేవిధముననో తప్పించుకొని పోయి నను రోజుమేరీయున్నది. ఆమె నా ప్రస్తుత నివాసస్థలము నెఱుగును, నేనచటినుండి యావలికరుగగనె, తానునన్ను గ్రీన్విచ్చిలో చూచిన సంగతిని, తాను విడచిపెట్టిన గదులనె నే సద్దెకు తీసికొనిన సంగతిని రోజుమేరీ వారి కెక్కడ చెప్పివేయునో యని నాకు భయమగుచుండెను. ఇంతవరకు లారెన్సు నాయునికినిగూర్చి నన్నేమియు ప్రశ్నింపలేదు.

కాని నేనింటికి ప్రయాణమగులోపల నా ప్రశ్న సతము విడచిపెట్టి నను ఆజిత్తులమారి భార్య మాత్రము విడువలేదు.

“నేను మీయింటికి రెండుమూడుసారులు పోయియుంటిని. మీరా యిల్లు విడచిపెట్టి యెక్కడికోవెళ్లినట్లచటివారు చెప్పిరి. ఎక్కడి కేగిరో, ఏట్లుంటిరో ఏమయితిరో యని లారెన్సును నేనునుచాల బెంగపెట్టుకొంటిమి. ఎక్కడ వెదకినను గన్పించకుంటిరి. ఎవరినడిగినను యెవరును చెప్పజాలకుండిరి. ఏమిచేయను? చివరకేదియో భగవంతుని దయవలన కండ్లబడితిరి. అదియె పదివేలు”

కొన్నిరోజులనుండి నేనొక మిత్రురాలి యింటికరిగితిని. మరల నింతలోనే మాయింటికరిగెదను. ఆయింటికరిగినవెంటనే మీకు జాబు

ప్రాసెదనులెమ్ము! నాయందభిమానమున్నది గనుక నట్లు బెంగపెట్టు కొంటిరి. ఈకాలములో నెవరిసంగతి నెవరెందులకు విచారింతురు? పోయివచ్చెదను. "

అనుచు నంతటితో సంభాషణ ముగించి గృహోన్ముఖునైతిని. లారెన్సు ఒంట్రొాతు ఫ్రెండిలె గాబోలును, నాకు వీధిలోనికి దారిజూపించి తలుపు తెరచి వందనము లర్పించి సెలవు తీసికొనిపోయెను.

కాని జానుమెడ్లీసంగతియె వింతగనున్నది. వృధాయాసమైనదే గాని యతని జాడలేమియు పొడసూపలేదు. నిజముగ నాపేరుగలవాడె వడైన నున్నాడా లేక లారెన్సు క్రొత్తపేరొకదానిగల్పించి దానితో నింకొక నాటకమేదైన నాడుచున్నాడా? యని నాకు సంశయము తోచెను. ఇంతలో నొక యువకుడు ప్రక్కగదిలోనుండి నాదెస తొంగి చూచి తొందరగ నీవలకే తెంచి, ఈలగొట్టుకొనుచు నేనరుగుత్రోవనె నాలుగడుగులు ముందుగ నడువనారంభించెను. మనిషిలావుగనున్నను భుజములతీరుమాత్ర మందముగనుండెను. వెనుకనుండి యతని జాడల నిరీక్షించి చూడగ నతడేదియో కార్యాంతరవ్యాప్తియె యరుగుచున్న ట్లుండెను. కాని నాసంగతి సందర్భముల నరయుటకై లారెన్సు దంపతు లంపినగూఢచారుడేమోయని నాకనుమానముకలిగెను. ఆయనుమానము క్రమక్రమముగ హెచ్చి భయముగలుగనారంభ మయ్యెను.

కాని లారెన్సు పంపుటయె నిజమగునెడల నతడునాదెస నొకసారి యైన జూడకుండగనె యంతత్వరితగతి నరుగునా? ఎవరియనుమాన ములువారికిటులనే మతి భ్రమగలిగించుచుండునేగాని యతడేల గూఢ చారుడై యుండునని మరల ధైర్యము తెచ్చుకొని తొందరగ నడువ సాగించితిని.

ఏది యెట్లున్నను నేనీవీధిని తప్పించుకొని మరియొక దారినేల పోగూడదు? అందువలన నెట్టి నష్టము గలుగదుగదా యతడు గూఢ చారుడేయగునెడల కొంతలాభకరముగ గూడ నుండునని యోచించితిని. కాని ప్రక్కరోడ్డున కరుగుటకు మనసంగీకరింపకుండెను. ఇప్పుడు తప్పించుకొనినంతమాత్రమున నేమిలాభము? రోజుమేరీనడగి లారెన్సు నానివాసస్థలమును దెలసికొనును. అదితప్పదు. అంతియగాక జానుమెడ్లీ యెవరో తెలుసుకొనప్రయత్నించి, ఇంతశ్రమనొంది చివరకతని జూడ కుండబోవుట మనస్సునకేమి నిష్టములేకుండెను. అందువలననే నాదారిని మరివిడువలేదు. తిన్నగా చిన్నసత్రమువీధి చివరకుబోయి అచట క్లెమెంటుసత్రమున కరుగు అడ్డురోడ్డు ననుసరించి స్ట్రాండురోడ్డు చేరు కుంటిని.

గ్రీష్మర్తు దినమగుటవలన ప్రొద్దెప్పటికి నస్తమింపకుండెను. మరల వర్షమారంభమయ్యెను. కాని యెక్కువకాలము కురియలేదు. జల్లుగా కొట్టి యూరకుండెను. గొడుగు తెరచుటకు రెండు నిముషములాగి తిరిగి చూచునప్పటికి జానుమెడ్లీయని నేననుకొనుచుండిన పురుషుడంతర్థాన మయ్యెను.

అందువలన ఆపురుషుడెవరో తెలిసికొనవలయునను ఉద్దేశము చెడి పోయినందులకు విచారింపవలయునో, గూఢచారుని బాధ తప్పినదని సంతోషింపవలయునో తెలియకుండెను. ఇంతలో నారాకకెదురు చూచుచు నొకగుమ్మములో నిలచుండిన రోజుమేరీ నాకంటబడియెను. అందువలన నెక్కువకాలము విచారించుటకుగాని, సంతోషించుటకు గాని నాకవకాశము లేకుండెను. లారెన్సు గృహమునందున్నప్పుడు దాల్చిన ఎఱ్ఱటోపీ దీసివైచి యిప్పుడామె తెల్లటోపీ ధరించెను. ఆదుస్తులను విప్పి కొత్తవాటిని ధరించుటకు వేళచాలక గాబోలు నామె పెద్ద "ఓవరుకోటు" వేసికొని యచట నిలచియుండెను. దారి

నడచువారి నందఱి నామె యతిజాగ్రత్తగ పరిశీలించుచుండెను. నన్నామె జూచినవెంటనే నేనాకారణమును గుర్తించితిని. నాతో మాట్లాడదలచి యామె నాకొఱకచట నిరీక్షించుచుండెను.

ఆపిల్లనుజూచినంతనె నాకసహ్యము కలుగుటయెగాక మనస్సు విశేషముగ సంకటపడజొచ్చెను. లారెన్సు కుట్రదారులలో నీమెగూడ చేరిపోయినదని నాకట్టి యసూయగలిగి యుండవచ్చును. నెడ్డు ప్రేమించి పెండ్లియాడినదీయువతి. అట్టిది నెడ్డు శత్రుబృందమున చేరకూడదు. సాధ్యమగునంతత్వరలో వారితంత్రములలో పడకుండ తప్పించుకొనుట మంచిది. లేకున్నది యామెకె యపాయకరముగ పరిణమించును.

ఆమెనిలచియుండినగృహము సమీపించుకొలదిని నానడక మందగింపసాగెను. ఇంక నయిదారడుగుల దూరమున్నదనగ నామెయె నాకెదురువచ్చెను.

“ నేను మీతో మాట్లాడవలసిన పనియున్నది. మీతో గలసి నాలుగడుగులురానా ? తిరిగి గ్రీన్విచ్చికే బోవుచున్నారా ?” యని సంకోచించుచు నడిగెను.

“ నాతోనీకేమిపని యున్నది?” అని నేనడిగితిని. నన్ను దారిలోనిలపి లేనిపోని యాలస్య మొనరించుటకు వారేదియో పన్నుగడ పన్నియుండవచ్చుననియు మెడ్లీమీాద నిష్కారణముగ ననుమానమొందితినిగాని యీామెయె గూఢచారిణిగ నుండవచ్చుననియు నాకపుడనుమానము కలిగెను.

“నేనిచట మాట్లాడజాలను. మీతో గలసియుండగా వారు నన్ను చూడరాదు. మనమిద్దఱముగలసి కొంతసేపుమాట్లాడుకొనుటకు తగిన స్థలమేదియులేదా ? సంగతిసందర్భములను వేగమాలోచించుకొనవలయును. నేనొకవేళ గ్రీన్విచ్చి కరుగుటయె శ్రేయస్కరమని తోచిన యెడల నొకగంటలోనే రావలయును. తిరిగి వారింటికరుగుటకు నాకిష్టములేదు. వారిని వారిమాటలను జూచుకొలది నాకుభయమగు

చున్నది." అనుచు దీనముగ చేతుల నులిమికొనుచు నిలచుండెను. ఆమెవైఖరి నాటకములోని యభినయమువలె గన్పించి నాకామెపై మరింత యసూయగలిగెను. నాటకమె యైయుండిన నామెనటన చాలప్రశస్తముగనున్నదని చెప్పియుందును.

"నీయుద్దేశ్యమేమియో స్పష్టముగ తెలుపుము." ఆమెముఖమున దీనభావము తాండవమాడుచుండెను. ఆపెకన్నుల నశ్రుబిందువులు చిందులాడుచుండెను. హృదయము కనికరముతో కరగిపోవుచుండెను. అయిన మొదట నామెపై జనించిన యీర్ష్యాభావము తగ్గకుండెను. అందువలననే నామెనింకను నేవగింపజూచితినే గాని యామె మనసునందలి భావమును గ్రహించుటకు ప్రయత్నింపకుంటిని. మేముభయులమొకరితో నొకరము సంభాషించుకొనదగినంత రాచకార్యములేమున్నవి? ఉన్నను మనస్పర్ధలులేకుండ మేమునిష్కపటముగ నెట్లుమాట్లాడుకొనగలము? అది స్వభావ విరుద్ధము. అని నేనేమేమియోనాలోచించుచుంటిని. అప్పటి నాభావోద్రేకమును వర్ణించుటకు మాటలుచాలవు. ఆమె దీనస్వభావమును జూచి నామనసెంత మెత్తగిల్లినను, నాభర్తనె వరించిన నాసవతి యీమెయె యనుసంగతి జ్ఞాపకము వచ్చునప్పుడెల్ల నాచిత్తముగడ్డకట్టుకొనిపోవుచుండెను.

"మీరెవ్వరో నేనించుకయు నూహింపజాలకుంటిని. మీరానాడు లవుజాయిగారింటి కద్దెకువచ్చిననాడు మీనిజస్థితిని నేనేమాత్రము గ్రహింపజాలకుంటిని. కాని డ్యూకుగారింటికివచ్చినప్పటికి మీసంగతి సందర్భముల గ్రహించుటకు నాకు కొంతయవకాశము చిక్కినది."

"డ్యూకు గారింటనేమివిశేషములను తెలసికొంటివి? మనమీనడివీధిలో నిలచి యిటులనే మాట్లాడుకొనవలయునా" అని యామె విసువుదలతో పలికెను.

"అవును" అనునట్లు నేను మరేమియు మాట్లాడకూరకుంటిని.

అయ్యో! అమ్మా! మీకాయనసంగతి యేమియు తెలియనట్లున్నది. ఆతడు నీవెంటనే బయలుదేరి రావలసియుండెను. ఏలరాలేదో తెలియకున్నది. నేనిప్పుడేలవారియొద్ద సెలవుపుచ్చుకొంటినో ఆసంగతిని వారూహించునెడల—ఊహించునెడల యని యేలసంశయము?—వారీసరికి నాయుద్దేశమును గ్రహించియేయుందురు. వారికాసంశయము కలుగునెడల మనకిప్పుడు ముప్పువాటిల్లును. డ్యూకుగారికి పిచ్చిపట్టినదని మీకు తెలయదు కాబోలును! వారాడిన దేయాట...

అయ్యో! దైవమా. నేననుకొనినంతేయున్నైనది. లారెన్సునకు నిజముగా పిచ్చిపట్టినది. గంటక్రిందటనే నతని జూచునప్పుడతని చేష్టలన్నియు పిచ్చివాని కృత్యములవలె గన్పించినవి. అయినను రోజు మేరీ చెప్పువరకు నేనాసంగతిని గ్రహింపజాలకుంటిని. నాటకమారంభించినప్పటినుండియు నాతడు కొన్ని పిచ్చిచేష్టల కలవాటుపడినమాట వాస్తవము. అట్టిచేష్టలు నిదానించిచూచినగాని పిచ్చిచేష్టలని తెలియవు. కానీ అదిగూడ నున్మాదరోగలక్షణమేయని చెప్పుదురు. అది యొకవిధమగు యున్మాదమట. లారెన్సునకట్టి పిచ్చిపట్టినది. కాని యీలక్షణములు ఉన్మాదరోగలక్షణములనియు, లారెన్సునకు పూర్తిగామతిచెడిపోయినదనియు నేనింతవరకూ గుర్తించలేదు. గ్రీన్విచ్చి వ్యాపారము నీచిన్నదానియొద్దనే నెంతకప్పిపుచ్చినను కార్యములేదు. నేనెంతకాల మెచటమసలినను చివరకు చేరుకొనవలయుస్థలము నామె పూర్తిగా నెరుగును.

ఇంతలో పడవసంగతినాకు జ్ఞాపకమువచ్చెను. అచటికి రేవెంతయో దూరములేదు.

"అట్లయిన గ్రీన్విచ్చి కేరమ్మ పోదము. కాని జానుమెడ్లీవ్యవహారమేమిటి?"

ఆ మాటల నుచ్చరించుసరికామె నాదెసనొక వింతచూడ్కి బరపి యిట్లుపలికెను.

"నేనిప్పుడు మీతో మాట్లాడదలచిన విషయములలో నదియొకటి. మెడ్లీ గూఢచారుడు. చనిపోయిన మనిషికొరకు పెనగులాడుచున్నాడు."

"అనగా మరణించిన నాభర్త జీవించియున్నట్లు పోలీసువారనుమానించుచున్నారనియు తదన్వేషణార్థము గూఢచారుల నంపగనియాసీయుద్దేశ్యము ?" అనుమాటలు నానోటనుండి జారిపోయినవి. అంతలో తెలివి తెచ్చుకొని యూరకొంటిని.

"కాదుకాదు. మీభర్తగాదు. నాభర్తచనిపోయిన సంగతి వారికి తెలియదు" అనియామె బదులుపలికెను.

నాగుండెలప్పుడతి త్వరితముగా గొట్టుకొనసాగెను. కాని నాకవి కొంతసంతసమునుగూడా కలిగించినవి. మాయిద్దఱభర్తయు నొక్కడే యనుసంగతి పాపమా పిల్లదానికింకను తెలియదు. అయిన నామెయింత స్పష్టముగ చెప్పుచున్నప్పుడు నెడ్డింకను జీవించుచున్నాడనుకొనుట రిత్తమాట.

"అయ్యో ! అప్పుడేపడవ వచ్చినది. మరియొక నావవచ్చువరకును మీరు వేచియుండవలయును. లేకున్న మీతో నన్నుగూడ తీసికొనిపోవలయును. మీకు సంగతి సందర్భములన్నిటిని వివరించి చెప్పుటకింకను చాల వేళపట్టును." అని యొకనిముసమాగి "నేనేదియో పనిపాటుచేసుకొని నాపొట్టపోషించుకొనగలను. నా వలన మీకెట్టి యిబ్బందియు గలుగనీయను. లవుజాయికి మరియొక గదిగలదు. దాని యందుందును." అని పలికెను.

ఆమె చెప్పవలసినది చాలగలదు. నేనుగూడ సంగతులన్నిటిని తెలసికొననిదె యామెను విడచిపెట్టుట నాకిష్టములేదు. అంతియగాక నామెమాటల నాలకించుకొలది నాయసూయ తొలగ నారంభించెను. ఆమె నిర్మలస్వభావమును నిష్కపటవాక్యములును నాకామెయం దనురాగము నంకురింపజేసినవి. అంత నేమైననాగాకయని సాహసించి

యామెతో "నీకంత యిష్టముగ నున్నయెడల తప్పకుండ రావచ్చును. నాకుగూడ సంతోషమే" యని పలికితిని.

పడవప్రయాణికులతో క్రిక్కిరిసియుండెను. అందువలన మేముసావకాశముగ మాట్లాడుకొనుటకు వీలులేకపోయెను. అత్తవారింటికివచ్చిన క్రొత్తపెండ్లికూతురు పుట్టింటికరుగునపుడు పొందుసంతసోత్సాహములు రోజుమేరీకన్నులలో తాండవించుచుండెను. పడవనెక్కునపుడు చేయూతకొరకామె చేతినిపట్టుకొనగా నామె మరింతగట్టిగా చేయిపట్టుకొనినవిధమునుబట్టి యామెభావములుకొంతవరకు విదితమగుచుండెను. తానునాచేతిని పట్టుకొనియున్న సంగతినేమరచి యామెయేమేమియో యాలోచించుకొనుచుండెను.

మొగమోటము విడచి యొకరితో నొకరము మాట్లాడుకొనుట మా కుభయులకుగూడ సిగ్గుగా నుండెను. దానికితోడు యిసుక వేసిన నేలరాలనట్లు జనము క్రిక్కిరిసి యుండుటవలన బొత్తుగా మాట్లాడుకొనుటకు వీలు లేకపోయెను. అందువలన మాదీర్ఘసంభాషణ మింటికిబోవువర కాగిపోయెను. ఆచిన్నది చక్కగా నలంకరించిన నాచిన్నగదులలో నర్థరాత్రి సమయమున నిద్దరమేకతముగ గూర్చుండినగాని మానిజస్వభావముల నొకరికొకరము తెలుపుకొనుటకు వీలు లేదని నేను గ్రహించితిని. అందువలన పడవలో నామె నావిషయమైనేమియు ప్రశ్నింపలేదు. మాకిరువురకికముందెట్టి రహస్యములుండగూడదని నేననుకొంటిని. ఇంతవరకామె యెచట నెట్లు జీవించినను నాకు తెలియకుండెను గాని యికముందు నాజీవితనాటకమున నామె గూడ ముఖ్యపాత్ర ధరించవలసి యున్నప్పుడు నేనెట్లామె నుపేక్షింపగలను?

ఆబాధ్యతను గుర్తించి తదనుగుణ్యముగ నడచుకొనుట చాలాకష్టమనినాకు విదితమగుచుండెను. ఆమెను మరల విడిచిపెట్టరాదను సంగతిని తలచునపుడు నాకు భయముకలుగుచుండెను. అందులకు

తగినంతధైర్యమును సాహసమును అవకాశము నొసంగుటకు దైవము ననేకవిధములుగ ప్రార్థించుచుంటిని. దీనికంటె యెక్కువ బాధ్యత యింకొకదాని నేనిపుడు వహింపవలసి యున్నది. ఆసంతోషము ముంగట నీసవతులయీర్ష్యాభావము, నీచముగా గన్పించును.

ఆమెయెవరు? నేనెవరు? నాహృదయ కుహరమందు సంతోష జ్యోతినంకురింపజేసిన నాపరమప్రేమాస్పదానందమయమూర్తి బయట నడుగిడినపిమ్మట నీస్వల్ప మలినభావములెంతకాలముండును. ఆమె భర్తయే ప్రసాదించిన యీచిన్నపాపని నుభయులము గాఢానురాగమున పెంచుకొనుచు నాతనువున్నంతకాలమేగాక శాశ్వతబ్రహ్మకల్పముగ మాయుభయులస్నేహ లతాజ్యోత్స్న మవిచ్ఛిన్నముగ పెరుగ వలసినదేగదా!

కాని యామెకిట్టి యుదార భావములుండునా? నాప్రేమ కనుకూలముగ మెలగనేర్చునా? ఆమె చంటిబిడ్డడప్పుడే స్వర్గస్థుడయ్యెను. తన యౌవనప్రాయమంతటిని నిరర్థకముజేసెను. అట్టిస్థితిలో తానింకొకరి బిడ్డను—కాదు. తనసవతిబిడ్డను—జూచి యోర్వగలదా?

ఏమో! ఏసంగతులెట్లుండునో యెవరు చెప్పగలరు? ఏదియెట్లున్నను దేహసుఖమును గోరుచుండుట లోకస్వభావముగదా!

ఇంతలో పడవ యాగిపోయెను. నాయూహా ప్రవాహమునకంతరాయముగలిగెను. ఈభావస్వప్నమునుండి మేల్కాంచి నేనుపడవ దిగునప్పటికి రోజుమేరీ ముఖము తెల్లబారియుండెను. ఆమె యిప్పుడు నాచేయిపట్టుకొనియుండలేదు. ఎప్పుడు విడచిపెట్టెనో నాకు తెలియదు. అంతియగాక దారిలోనామె మునుపటి యుత్సాహమును గన్పరుపలేదు. ఇద్దరమేమియు మాట్లాడకుండగనే యిల్లుచేరుకొంటిమి.

మేముభయులము గలసివచ్చుట జూచిలవ్రుజాయి యపరిమితా మోదము నొందెను.

చాలకాలముక్రిందట నెచటనో తప్పిపోయి కనబడకున్న కన్నకు మార్తెవలె నామె రోజుమేరీ నమూంతముగ కౌగలించుకొనుట జూడ నాకు కొంచెమీర్ష్యకలిగెను.

"మాచిన్నపిల్ల! మాచిట్టిపిల్ల! మరలనెన్ని దినములకు చూచితి నమ్మా? మరిచూడనేమో యనుకొంటిని. కాని నాయదృష్టము మంచిదగుటవలన మరల నాకంటబడితివి. నీవెప్పుడువచ్చినను నాయింటనేదియో గది సిద్ధముగనుండకమానదు."

"ఒకవేళ ఖాళీలేనపుడు లండను మేయరున్నప్పటికి నాగది ఖాళీ చేయించి నీకిచ్చెదను. ఇప్పుడొకగది ఖాళీగానున్నదిలెమ్మ. మన మెట్టిబ్బందియు పడనవసరములేదు. కాని అది చాలచిన్నది."

"చిన్నదయిననేమి? పెద్దదైన నేమమ్మా? మీయింటికి వచ్చిన పిమ్మట నాకేమిలోపము?"

రోజుమేరీ భర్తను నేనెరుంగుదునని లవ్రుజాయితో నిదివరకు చెప్పి యుంటిని. ఆసంగతిని గూర్చి యామె రోజుమేరీయెదుటనె నన్నేమైన ప్రశ్నించునేమోయని నేను భయపడుచుంటినిగాని పాపమా ముదుసలి నాకెట్టిబాధను కలిగింపనేలేదు. ఆడువారి యందింత అధికప్రసంగ విముఖిని నేనిదివరకెచ్చటను జూచియుండలేదు. అక్కరయున్నను లేకున్నను అనవసర ప్రసంగముచేయుట సామాన్యముగ నాడువారి కలవాటు. కాని యిట్టి ముగ్ధ స్త్రీలు గూడ కొందఱు లోకములో నుండక పోరని నేనప్పుడనుకొంటిని.

ఆపిల్లదాని కెట్టిసామగ్రియు లేకుండెను. తలదువ్వుకొనుట కొక దువ్వెనగాని, పళ్లు తోముకొనుటకొక కుంచెగాని మరియే పరికరములు గాని లేకుండెను. చేతిలో డబ్బుమాత్రము కొంచెమున్నట్లుండెను. ఇంటికివచ్చిన వెంటనే యామెతనకు వలయు వస్తువులను దెచ్చుకొనుటకు బజారునకరిగెను. ఆమె వీధిలోని కిరుగుటనుగాంచి గోడను వ్రేలాడుచుండిన నెద్దు ఛాయాపటమునుదీసి పెట్టెలో దాచితిని. ఆఛాయాపటము ముఖమున కెదురుగనుండగనె యాగదియం దామెతో గలసి ముమెలగుట నాకు కష్టముగ తోచెను.

మ మాదీర్ఘ సంభాషణ నారంభించుటకు తగినసమయము కుదురకుండెను. ఆమె బజారునుండి వచ్చినవెంటనే భోజనమున కరుగవలసివచ్చెను. భోజనానంతరము మాతో మాట్లాడనెంచి తరుచుగ లవుజాయి గదిలో పలికివచ్చుచు బోవుచు నుండెను.

చివరకెట్లనో మే మనుకూల సమయమును కుదుర్చుకుంటిమి. నాటి రాత్రి మాకుభయులకు జరిగిన యాసంభాషణమును వేయి సంవత్సరములకైన మరువజాలను.

సంభాషణారంభములో నుభయులకు గూడ బిడియ మెక్కువగ నుండెను.

నాటి సాయంకాలము దీపము వెలిగించినను గూడ సాంధ్యరాగారుణకాంతులు కిటికీలోనుండి లోపలికి ప్రసరించుచుండెను. మధ్యాహ్నము రెండుమూడు సారులు వర్షపుజల్లులు కొట్టినను గూడ సాయంకాల మగునప్పటికిని నుక్క యధికముగనుండెను. ఆకస మంతయు మేఘావృత మగుటవలన గాలి వీవకుండెను. దిఙ్మండల మంతయు తఱుచుక విద్యుల్లతాలంకృత మగుచుండినను ఉఱుములచప్పుడంత యెక్కువగ లేకుండెను.

వంటయైన వెంటనే లవుజాయి సాయంకాలపు భోజనపదార్థము లన్నిటిని పళ్లెరములందును, గిన్నెలయందును వడ్డించిపోయెను. ఆమె తిరిగి వచ్చులోపల వీధిముంగట నొక గుఱ్ఱపుబండి యాగిన చప్పుడయ్యెను.

ఎవరువచ్చిరో చూతమను భ్రాంతినటు తిరుగగా దానిలోనుండి దిగుచుండిన పురుషుడు నాకు పూర్వపరిచితుడుగ కన్పించెను. ఎవరు చెప్పుమాయని యాలోచించుసరికి అనతికాలముక్రిందట లారెన్సు యింటి లోజూచిన మెడ్లీయని నేననుమానించిన పురుషుడేయని జ్ఞప్తికి వచ్చెను.

వానిని జూచిన యంతనె నాగుండెలు గుభిల్లున వణకజొచ్చెను. ఇంక నేమనుకొనిన నేమికార్యము ? నాగుట్టు నెరిగినవారు నన్ను తమ వలలో జిక్కించుకొనిరి. రోజుమేరీ నమ్మలేక నమ్మలేక నమ్మినందులకు చివరకామె నాకు తగిన పరాభవ మొనరించినది.

జానుమెడ్లీ బండి దిగి బిగ్గరగ తలుపు తట్టెను. లవుజాయి పరుగెత్తు కొనిపోయి తలుపు తీసెను. నాకపు డేమేమి భావము లంకురించినవో అది యేయేభావములక్రింద నెట్లు పరిణమించినదో చెప్ప నలవికాదు. రోజుమేరీ నన్ను మోసగించినది గదాయని కోపమును, మెడ్లీ నా రహస్యము నెరింగి లారెన్సునకు చెప్పివేయునను భయమును నన్ను విశేషముగ కారియబెట్టుచుండెను.

రిత్తగ గూర్చుండిన నేమి ప్రయోజనమని యెంచి వారేమి మాట్లాడుకొనెదరో వినవలెనని కిటికీ తలుపులు తెరచితిని. "భేజు" సతి యున్నదా యని యత డపుడే యడిగిన ప్రశ్న చెవులబడి నాకు కంపము పుట్టెను. నా పేరు నెట్లనో తెలసికొనిన నన్ను ద్దేశించియె యత డడిగెనని నే ననుకొంటిని. కాని వాని మాటలను విని రోజుమేరి వాని కేదియో ప్రత్యుత్తర మిచ్చుచు తొందరతొందరగ మేడమెట్లు దిగి యతనియొద్ద కరిగెను.

"ఓహో! మెక్లీగారా? చాల సామగ్రి తెచ్చినారే? మీ మేలెన్నటికిని మరువజాలను. అంత సామగ్రియు వచ్చినదా? ఇంకేమైన నుండిపోయినదా?"

ఆమె యిట్లడుగుచుండగా నతడొకసారి నాదెస చూచి మరల నాతో నేమియు నిమిత్తములేనివానివలె నూరకుండెను.

నేనప్పు డతని నిదానముగ జూచుట కవకాశము కలిగినది. అందగాడని చెప్పజాలను గాని అందవికారి మాత్రము గాడు. ఆ ముఖము నందు దయాహాస్యరసములు తొలుకాడుచుండెను. రోజుమేరీని జూచినంతనె యతని ముఖకాంతి మరింత యతిశయించెను.

లారెన్సు అన్యాయపు టాలోచనలకు యిట్టివాడు సహాయ మొనరించునా? నిజముగ సహాయ మొనర్చునని నేను నమ్మజాలకుంటిని.

"సామగ్రి నంతటిని తీసుకొని వచ్చితిని. వారింట నేల నుంచవలయును? నీ కింక వారి భయ మేమియును లేదు." అని యతడు సంతోషముతో బదులు చెప్పెను.

"మీరీ సామగ్రి తీసికొని వచ్చిన సంగతి వారి కేమైన తెలిసినదా?"

"ఎవ్వరికిని తెలియదు. ఫ్రెండిలునకు గూడ తెలియదు. కాని ఒక్కరికి మాత్రము తెలియును."

"ఎవరికి!" అని రోజుమేరీ యాతురతతో ప్రశ్నించెను.

అతడు నవ్వుచు "నా కొక్కడికి మాత్రమే తెలియును." అని మెల్లగ నన్నెను. అంత రోజుమేరీయును, లవుజాయియు పకపక నవ్వసాగిరి. నే నూరకుంటినని చెప్పజాలను. ఇట్లతడు చమత్కారముగ మాట్లాడునపు డతని కన్నులు మిణుకుమిణుకున మెఱయుచుండెను. రోజుమేరీ ముఖబింబము పూర్తిగ వికసించెను.

"సామగ్రి యింటిలో పడవేయనా?" అని యత డడిగెను.

* * * *

అప్పుడు రోజుమేరీ లవుజాయి దెస తిరిగి "యితడు నా మేలు గోరు ప్రియమిత్రుడు. పాపము శ్రమయనక నా సామగ్రి సంతటిని తీసికొని వచ్చెను." అని యామె చెప్పుచుండగా మెడ్లీ బండిదగ్గరకు బోయి పెట్టెలు మొదలగువాటి నింటిలో బెట్టుచుండెను. లవుజాయితో నావిధముగ బల్కిన పిమ్మట రోజుమేరీ పైకి నాదెస నొకమారు చూచి యేదియో పొరపాటు చేసినదానివలె ముక్కుమీద వ్రేలిడుకొని యూరకుండెను.

బండిలోని ట్రంకుపెట్టెలు రెండు మూడింటి నరుగుమీద బెట్టిన పిమ్మట రోజుమేరీకి సంతోషము హెచ్చి, ఆతని నా పెట్టెలను మేడ మీది చిన్నగదిలో బెట్ట నాజ్ఞాపించెను. వానిని బండివాని తాను జూచుచున్నట్లు నే ననుకొనవలెనని యామె నాప్రక్క జూచినప్పటి నుండియు తన వైఖరి నంతటని మార్చెను. భయముచే శరీర మంతయు గంపించుచుండగా పడకగదిలోని కరిగితిని. కాని క్రమక్రమమున రోజు మేరీయందు పరిపూర్ణవిశ్వాసము కుదురసాగెను.

ట్రంకుపెట్టెల సందడియు, బండిచప్పుడంతయు నంతరించిన పిమ్మట నట్టింటిలో చాల సేపటివరకును మాటలసందడి వినిపించుచుండెను. రోజుమేరీ రెండుమూడు సారులు నాపేరుపెట్టి పిలచుటగూడ జరిగెను. చివరకామె నాగదియొద్దకువచ్చి "ఎల్సిస్మరు సఖీ! నామిత్రు నొక్క మారు జూడవచ్చెదవా?" అని యడిగెను.

ఇంక నేనేమియనుట కవకాశ మున్నది? మాట్లాడకుండ తప్పించుకొనుటకు నాకుపాయాంతరమేదియు గన్పించలేదు. సరియె వచ్చెదనని యామెను పంపితిని. నేనచటికరిగి చూచుసరికి ఆగాంధ చారుడు, ఆకూరగాయల వర్తకుడు, నాకుర్చీలయందతి యమూల్యమగు దానిపై కూర్చుండియుండగా రోజుమేరీవానికి తేనీరు యిచ్చుచుండెను.

నేనచటి కరిగినంతనె యతడు కొంచెము తొందరపాటుతో లేచి నిలచుండెను. అంతనామె మాకుభయులకును పరిచయము గలిగించెను.

"నేనాయింటియం దుండుటకు మెడ్లీగారెంత మాత్రము నిష్టపడ లేదు. నేనెప్పుడాయిల్లు విడచి బయటకరిగినను నాపెట్టెలను తీసుకొని వచ్చి యీాయింటియం దొప్పగింపవలయునని యతని నిదివరకు కోరి యుంటిని. నేనిపు డింటనుండకుండుటను గాంచి యతడే పెట్టెల నిచటికి తీసుకొనివచ్చెను. పాపము! ఉపకారబుద్ధులు శ్రమయని యాలోచింపక నెవరికెంతకష్టపడియైన సహాయమొనరించుచుందురు. ఈతనిఋణము నేనెట్లు తీర్పగలను?" అని పల్కెను.

"అవును. నిజమే!" అని నేనంటిని.

అంత నతడు నావైపుచూచుచు, భేజునతికి మీవంటి మిత్రము లభించినందులకు నాకెంతేనియు సంతోషముగ నున్నది. ఎల్లప్పుడు నేవేవియో నీచపుకుట్రలను బన్ను పిచ్చియజమాని యింటియందిట్టి సాధుశీలలుండుట మంచిదికాదు. తనయన్నకుమారుని మంచిచెడ్డల నించుక కనిపెట్టి చూచుచుండవలసినదనియు, పిచ్చివాడగుటవలన నతడుచేయరానిపనులు వేటిని చేయకుండ జూడవలసినదనియు సర్ మార్టినుడ్యూకుగారు నన్ను నియోగించిరి. బహుశా, మీకు డ్యూకు అండు డ్యూకుకంపెనీవారి సంగతి తెలిసియే యుండవచ్చును. ఆకంపెనీ రాబడి కంతములేదు. అట్లయ్యు నాపిచ్చియువకునకు తృప్తిలేక నేవేవియో పిచ్చియాలోచనలు జేయుచుండును." అనిపలికెను.

ఈమెడ్లీకి నేనెవరో తెలియకుండునా? లేక నాయంతట నేనే బయలుపడవలయునని యిటులారంభించినాడా?

"అవునని తలనూపి" నేనాకంపెనీ గురించి యిదివరకె వినియుంటి" నంటిని.

"అట్లయిన మీకింక చెప్పుట కేమున్నది? ఆకుటుంబము మంచి వసతులున్నదేగాని ఛేజుసతివంటి వారుండుటకు తగినది కాదు."

రోజుమేరీ సిగ్గుతో తలవంచుకొని చేతులు రెండింటిని జోడించుకొని యొడియం దిడుకొని వాటిదెస చూచుచుండెను.

"లోకాచారము ననుసరించి యజమానులకు నెలదినములకు ముందుగా నోటీసు నిచ్చి రోజుమేరీ పని మానుకొనిన బాగుగనుండును. కాని ముందుగ నోటీసునిచ్చుట కీమె భయపడినట్లున్నది. డ్యూకు గారికి తరచుగ కోపము వచ్చుచుండును. ఆసమయములం దతడు ఒడలెరుంగని పిచ్చిపనులు చేయుచుండును. ఈవిషయములో మీకు చెప్పవలసిన చిన్న చిత్ర మొకటి కలదు. మీకిష్టమున్నయెడల చెప్పెదను. మాబావ ఫ్రెండిలు నాకాసంగతి చెప్పెను. ఫ్రెండిలు డ్యూకుగారి మనిషియని యందరికిని తెలియును. చాలకాలమునుండి వారి కొలువులో నుండుటవలన నతనికి వారియం దభిమానము మెండు. అతడే సర్. మార్టినుగారి దగ్గరకరిగి లారెన్సు సంరక్షణార్థ మొకమనిషి యుండుట యవసరమని చెప్పి అతని యనుమతిమీద నాకీయుద్యోగ మిప్పించెను. లారెన్సు డ్యూకుగార్ల ప్రస్తుతస్థితి ఫ్రెండిలునకుగూడ దుస్సాధ్యముగ నున్నదని మీకిందువలన తెలియగలదు."

ఈ మాటలను వినిన పిమ్మట యితడే గూఢచారుడై యుండునెడల అతి యమాయకుడును, అధిక సంభాషణప్రియుడు నయి యుండవలయునని నే నసుకొంటిని.

కాని యెవ రెట్టి యధికప్రసంగ మొనరించినను నేను మాత్ర మిప్పుడు నోరు కట్టుకొనవలయుననియు, అంతయు తెలిసినదానివలె తల నూపుచు నూరకుండవలెననియు నిశ్చయించుకొంటిని. కాని చివరకు నేను గూడ మాటలధోరణిలో పడకతీరినది కాదు.

"డ్యూకుగారి కిటీవలనె వివాహమైనట్లున్న దే?" అని పలికి యూరకొంటిని.

* * * *

వాని ప్రత్యుత్తరము నా కమితమగు నాశ్చర్యము గలిగించెను.

"అవును. అతని చెల్లెలినే పెండ్లిచేసికొనియెను. వితంతువయ్యెను, చిన్నదగుటవలన మరల వెంటనే పెండ్లిచేసికొనియెను. ఆమె పేరు గూడ భేజుసతియె నట."

ముప్పిరిగొని వచ్చుచున్న కోపమును పట్టజాలక "నీకీ మాట నెవరు చెప్పిరి?" అని నే నతి తొందరగ గద్దరించి యడిగితిని. నా గద్దరింపు జూచి రోజుమేరీ నాపై కోపగించుకొనెను.

కాని ఆ కులాసాపురుషుని ముఖమునందు మాత్రము యెట్టి మార్పును గన్పించకుండెను. నా రూక్షస్వరమును గుర్తింపనటు లతడు "ఏమో యెవరు చెప్పిరో నా కంతగ జ్ఞాపకములేదు. బహుశా ఫ్రెంచి డిలు చెప్పియుండవలయును. అతడు చాల మితభాషి. అనవసరముగ నొక్కమాట నైన వెచ్చించడు............ఇంక మీ రుభయులును నాకు సెలవు దయచేయవలయును. ఇప్పటికె చాల ఆలస్యమైనది. కాని నేను మరల——?" అనుచు నతడు రోజుమేరీ దెస జూచెను.

వాని కోరిక కతితొందరగ తన యంగీకారమును సూచించుచు నామె "ఆహా తప్పకుండ మీ రిచటికి తరచు దయచేయుచుండవలయును. అనగా అవకాశము కలిగినపుడే సుమండి!"

"అవకాశమున కేమున్నది. మనము చేసికొను యేర్పాటులలో నున్నది. రాబోవు ఆదివారమునాడు సాధ్యమైనంత త్వరలో వచ్చెదను."

ఆతడు గడపదాటిన తక్షణమె రోజుమేరీ తలుపులు గడియబెట్టు కొని వచ్చి ఆశ్చర్యముతో నావైపు జూచుచు—

"చాల తెలివైనపని చేసితివి. వానికెట్టిసమాచారమును చెప్పకుం డుట మిక్కిలి మంచిపని. ఒక మాటుమాత్రమెటులనో మాటజారి పోయినది" అని యామెపలికెను.

"ఎవడాయువకుడు?" అని నేను తీవ్రస్వరమున ప్రశ్నించితిని. మరల నామె కేమికోపమువచ్చునో యని ఆవెంటనే "ఎవడైననుకావ చ్చునుగాని గూఢచారుడు మాత్రము కాడని చెప్పవచ్చును. అంతవరకు నిశ్చయము." అని యామెకు కొంచెము హెచ్చరికగలుగునట్లు పలికితివి.

"ఇది నిశ్చయము. ఇది నిశ్చయముకాదు. అని యెందులకాసంశ యము? నేనిదివరకు చెప్పినమాట యటుండగా నతడుగూడ ఇప్పు డిప్పుడు చెప్పియుండెనే తనసంగతినిగూర్చి!

"అతడుగూఢచారుడనియు, మరణించిన మనిషికై వెదకులాడు చున్నాడనియు, చెప్పితివి. అంతియెకదా నీవుచెప్పితివి?"

"అతడుచెప్పినట్లు అతనిముఖ్యకర్తవ్యము లారెన్సు సంరక్షణము. అనగా లారెన్సు డ్యూకు సాధారణపు పిచ్చిచేష్టలనుతప్ప హానికరము లగు పనులనెట్టివానిని జేయకుండ జూచుట. అంతమాత్రమున నతని గూఢచారుడనుటకు వీలులేదు కాని ఆయనను జూచినంతనె యదియేల నో నాకట్టి యనుమానము కలుగుచుండును. చివరకేదియెట్లున్నను, నీవెవరో అతడు గ్రహింపలేదు. అదె మనకుపదివేలు."

"నీవుమాత్రము గ్రహించితివా యేమి?"

"అయ్యో! నాకు తెలియకేమి? నీపేరు లోర్నా భేజుగదా? ఇంతియెకాదు. నీకు తెలియని విశేషములునాకు మరికొన్ని తెలియును. మనమిద్దరము తోడికోడండ్రము. నీవు జార్జి భేజును పెండ్లియాడితివి. నేను ఎడ్వర్డు భేజును పెండ్లియాడితిని."

"కాదు నేను పెండ్లియాడినది గూడ ఎడ్వర్డు భేజునే?"

"అతడా పేరుతో తిరుగుచుండెను. కాని అతని అసలుపేరు జార్జి. ఇప్పుడు "గ్రాంటు" అను మరియొక పేరుతో వ్యవహరింపబడుచున్నాడు. అయ్యో లోర్నా! బాంధవ్యపు చనువున నట్లు పిలచినందులకు మన్నింప వలయును. నీ పెనిమిటి మంచివాడుకాడు. అతడెచటికి బోయెనోగాని మరల నింటికి రాకుండిననె నీకుమరింత సుఖముగ నుండగలదు."

ఆమెకు తగిన జవాబులు చెప్పుట కదియె యదనని యెంచి ప్రక్క గదిలో నున్న నెడ్డు ఛాయాపటము దెచ్చి ఆమె చేతి కిచ్చి—

'ఇత డెవరో చెప్పగలవా?' అని యడిగితిని.

ఆమె పటమువంక జూచి మరల నా ముఖముదెస చూచెను. ఆ చూపులలో నన్నేమియో తిరిగి ప్రశ్నించుచున్నట్లుండెను. నేను వాటి యర్థమును గ్రహించులోపల నామెయె 'చెప్పలేకేమి? చెప్ప గలను' అనెను.

"ఎవరో చెప్పుకో చూతము." అని నే నాశ్చర్యముతో నామె వైపు జూచుచు వేచియుంటిని. ఆమె ప్రత్యుత్తరము నాకు మరింత విస్మయము గలిగించెను. మెల్లని కంఠస్వరమున నామె యిట్లు పలికెను.

"ఇతడే నా భర్తయని నే నెపుడును నమ్ముచుంటిని. అనగా యీ ఛాయాపటము నా భర్తదే యని యనుకొనుచుంటిని."

"అట్లయిన నిజముగ నిది యెవరిదో నీకు తెలియదా?"

"ఏమో! ఎవరిదో నిజము నాకు తెలియదు. కాని ఆతనిదని యనుకొంటిని. ఆతని ఛాయాపటమును నే నెన్నడును చూచియుండ లేదు. ఆతని మరణానంతర మీ పట మొక ప్రాతట్రంకు పెట్టెయడుగున పడియుండెను. దానిని బైటకి తీసి అద్దము కట్టించితిని."

పిమ్మట మేము చాలసంగతులను మాట్లాడుకొంటిమి. నాకు తెలియని సంగతులు అనేకము బయలుపడినవి. నాటి సంభాషణయంతయు నాకు జ్ఞాపకములేదు. జ్ఞాపకమున్నను దానినంతటిని వ్రాయనెంచిన మరియొక గ్రంథమగును. అందువలన దాని సారాంశమును మాత్రము నాలుగుమాటలలో చెప్పెదను.

"స్కేటింగు ఆటలలో నొకనాడామె తన భర్తను గలసికొనెను. ఆతడీ యాట ననేకమందికి నేర్పుచుండెను. తానుగూడ దానిని నేర్చుకొనుచుండెను. ఈయాట నెడ్డున కెంతమాత్రము యిష్టములేదని నే నెరుగుదును. ఇట్లు కొంతకాల మరిగినపిమ్మట వారిరువురకును స్నేహము పెరిగి చివరకు వివాహముక్రింద పరిణమించెను. ముసలి మేనత్త యొకర్తె తప్ప ఆమె మంచిచెడ్డల నాలోచించువారింకెవరును లేకుండిరి. ఆముదుసలి యీ యామెకెప్పుడు వివాహమగును, యెప్పుడు తన బాధ్యత తొలగును అని యాలోచించుచుండెను. ఆమె భర్తకెట్టి భూవసతియు లేకుండెను. ఖండాంతర మందేదియో యా స్త్రీయున్నదనియు దాని నెటులనో సంపాదింపవలయుననియు నతడు లేనిపోని పన్నాగములు పన్నుచుండెను. అపన్నాగములలో నాతనితల్లి ఫ్రాస్టుసతి అతని నెంతయో ప్రోత్సహించుచుండెడిది. ఆ ఫ్రాస్టుసతి కదియేలనో మొదటి కుమారునిపై నంతగా యిష్టములేకుండెను. ఇష్టములేకుండుటయెగాక నతడెచట నివశించుచుండినదియుగూడ నామెగుర్తింపజాలకుండెను. మర్చిసను పేరుతో నాటకములందు దిరుగుచుండు ఫ్లోరెన్సుకన్య ఫ్రాస్టుసతికి మరియొకభర్తవలన గలిగినకూతురు.

వివాహానంతరము వారుభయులెంతయో బాధపడుచు కాలక్షే పము చేయుచుండగా నొకనాడు ఫ్రాస్టుసతి తనబసకువచ్చి తనభర్త మాంచెస్టరునందు మరణించెనని చెప్పెను. అంతట వారుభయులును మాంచెస్టరునకరిగి యతనికచట నంత్యక్రియలొనర్చిరి.

పిమ్మట ఫ్రాస్టుసతి రోజుమేరీ బాకీలనన్నిటిని దీర్చి చోటుమార్చ వలయునను నెపమున లారెన్సు బసకు తీసికొనివచ్చి యచట పనిమని షిగ కుదిర్చెను. తనకాపని యెంతయిష్టములేకున్నను ఆమె విడచిపెట్ట లేదు. తనవదినగారిక్రిందనే బానిసగనుండుటకెంతమాత్రము నిష్టము లేక యెప్పుడు సమయమువచ్చునా, యెప్పుడుతప్పించుకొనిపోవుదునా యని రోజుమేరీ తొందరపడుచుండెను.

వారింట నడుగిడినదాదిగ వారు తన ననేకవిధముల వేధించుచుండిరి. ఆమరణించిన భర్త కాగితములు' తన జన్మమధ్యమున నెప్పుడును జూడనివి, ఎచ్చట నున్నవో తెచ్చియిమ్మని వారామెను బాధించు చుండిరి. తనకు తెలియదని యెంతచెప్పినను నూరకుండెడివారు కారు. వారికేదియో ద్వీపకల్పము యొకపటము కావలసియుండెను. ఆపటము తనభర్తయొద్ద నుండెడిదట. తనకాపటముసంగతియె కాదుగద ఆద్వీప కల్పముసంగతిగూడ నేమియు తెలియదు.

ఫ్రాస్టుసతియు, లారెన్సుదంపతులును, నిరంతర మామె నీసమా చారము చెప్పవలసినదని వేధించుచుండిరి. ఆముగ్గురిలో నాముసలి యామె బాధ కడుదుర్భరముగ నుండెను. ఇప్పుడు వారిబాధ తప్పుట యమబాధ తప్పినదానికంటె నధికముగనున్నది. ఇకనెన్నడును వారి కంటబడకుండ చేయుమని యామె వేయివిధముల దేవుని ధ్యానించు చుండెను.

ఆ కథ మొదటనాకు చాల ఆకర్షణీయముగనుండెను. కాని గంటల కొలదిగ నామె చెప్పుచున్నందులకు విసువెత్తి నిద్రవచ్చువరకు నటులనే యూకొట్టుచుంటిని. కాని నా ముఖ్యసందేహములు మూడింటికి ప్రాస్టుసతి సమాధానము కుదురలేదు. ఆమె ననేక విధముల ప్రశ్నించి చూచితినిగాని లాభములేకపోయెను.

రోజుమేరీయును నేనును సవతులమా, తోడికోడండ్రమా ?

జానుమెడ్లీకీవ్యవహారము నందెంతవరకు ప్రమేయమున్నది ?

జాను మెడ్లీ యీ కాగితముల నిచ్చువారి కేబదిసవరనులనేల యిచ్చును ? ఆ విషయము దొంగసిరాతో నేలవ్రాసియుండెను ? ఎవరట్లువ్రాసిరి ? ఈ వివరములన్నియు విినవిమ్మట రోజుమేరీయందు నాకుమరల పరిపూర్ణమగు విశ్వాసముకుదిరెను. అంతట నేనామెకు మెడ్లీకార్డును జూపించి కొన్నిప్రశ్నల నడిగితిని.

మెడ్లీవిలాసమును, ఆకనబడని సిరాయక్షరములను జూచిన వెనుక నామె నాకంటె నెక్కువగ నాశ్చర్యపడ జొచ్చెనేగాని నాకెట్టివివరములను తెలుపజాలకపోయెను. ఆయక్షరములు వ్రాసినదెవరో ఆసంగతి నైన చెప్పగలదేమో యని ప్రయత్నించి చూచితినిగాని కార్యము లేకపోయెను. మీదుమిక్కిలి నాకాకార్డు లభించిన వివరములను తెలుపవలసినదని బలవంతము చేయసాగెను. నాకు తోచినంతవరకు జరిగిన సంగతులలో కొన్నిటినిచెప్పి యూరకుంటిని. ఆకార్డు ఆగదిలోనే దొరికినదను మాటవిని యామె నిట్టూర్పు విడిచి—

"చాల ఆశ్చర్యముగ నున్నదే? నేనిన్ని దినములబట్టి యిచటనుండగా కనబడని కార్డు నీకీనాలుగైదు దినములలో నెట్లు కనబడినది!" అని యామె ప్రశ్నించెను. ఆమె హావభావచేష్టలనుబట్టి చూడగా నిజముగ నామె కీవిషయములేవియు తెలియవనుమాట స్పష్టమయ్యెను. సంగతి సందర్భముల నెఱిగియు నాకు తెలుపుట కిష్టములేక నేమియు తెలియనట్లు నటించుచున్నదేమోయని యనుమానించితిని గాని చివరకట్టి యనుమానమున కాధారమేమియు గన్పించలేదు.

నేను కవెంటుతోట కరుగుటను గూర్చియు అచటి పురుషుడు లారెన్సు నివసించుచున్న యింటిలో మెడ్లీయున్నాడని చెప్పుటను గూర్చియు నామెతో చెప్పితిని. అంతనామె "అట్లయిన మేడ్లీనే యేల నడుగరాదు? మనసంశయములన్నిటి నతడు వెంటనే తీర్చివేయును." అని పల్కెను.

"నిజమే గాని యతడు వదరుబోతువలె నాకు గన్పించుచున్నాడు. కావలయునదియు, అక్కరలేనిదియు నన్నిచోట్ల నిష్టానుసారము వాగుచుండును. అందువలన మనరహస్యప్రవృత్తి చాలమందికి తెలసిపోవును."

నామాటలకు రోజుమేరీ చిన్ననవ్వు నవ్వెను. "ఎంతసేపు మాట్లాడి నను ఒకరికపకారము గలిగించు రహస్యముల నతడనవసరముగ నింకొక రికి చెప్పడు. ఆసంగతిని కనిపెట్టితిరో లేదో ?"

"చెప్పకేమి ! నేనెవరనో యెరుగనిదే నాయొద్ద తనకుద్యోగమిచ్చి పోషించుచున్నవారిని గూర్చి చెప్పగూడని విషయముల నెన్నిటినో చెప్పెను."

నామాట కాదనునటులామె తలనడ్డముగ త్రిప్పుచు" చెప్పగూడని యంశముల నతడేమియు చెప్పలేదే? అంతియెగాక నతడు చెప్పినదానిలో కొంతతప్పున్నది. లారెన్సు డ్యూకుగారికి పిచ్చిపట్టినదని చిన్నసత్రము వీధివారికందరకును దెలియును. అతడేవియో మందులను ద్రాకులను తినునట ! ఆ సంగతినతడేమైన చెప్పినాడా ?"

రోజుమేరీ మెడ్లీతరపున నీ విధముగ వాదించుటనుజూచి నేను చాల దూరమాలోచించితిని. లారెన్సు పిచ్చిధోరణిలో మాట్లాడుచుండునట్లు నేనుగూడ రెండుమూడు సారులనుమానించితిని. ఎడ్వర్డు భేజుసతిని తానువివాహమాడినట్లు లారెన్సు లోకమంతటితో చెప్పుచుండుటయె గాక తానుగూడ నట్లేవిశ్వసించుచున్నాడు. ఆ చెప్పుటలోనొక దురు ద్దేశమున్నట్లుగూడ తోచుచున్నది. నెడ్డుమరణించెననిగదా లోకులం దరును తలంచుచున్నారు. నిజముగనతడు మరణించునెడల నతనియావ దాస్తి యతనిభార్యకు చెందవలయును. నన్ను తాను పరిణయమగుట వలన ఫెర్నుద్వీపము తనదేయగును. ఈ యుద్దేశమున నతడిట్లు చెప్పు చున్నాడేమో ?

ఫెర్నుద్వీప వ్యవహారమును గూర్చియు, లారెన్సు పిచ్చితనమును గూర్చియు, ఫ్రాన్సునకును ఆమె కూతురు ఫ్లోరెన్సునకును యావద్వృ త్తాంతమును తెలియనట్లున్నది. అందువలన వీలయినంత యెక్కువ యాస్తిని లారెన్సునకు అనగా తమకు లభించుటకు వారెన్ని మాయో పాయములనైన బన్నెదరు.

నాస్థితిగతులు వేరొక విధముగనుండినయెడల నాన్నగారికి గూడ ఫెర్నుద్వీప వ్యవహారము కొంత తెలియునుగనుక అతనికీ సమాచార మంతటిని తెలియబరచి నాకుతగినసలహా నీయవలెనని యడిగియుం దును. కాని నేనిప్పటిలో నలుగురికంటను బడరాదు. అనతికాలమున నె న్డ్వు ముద్దుబిడ్డడు యీ ప్రపంచమునందుదయించును. ఆసంగతి యంద రికిని తెలియునెడల నాతనిపుట్టుక సహేతుకమైనదనియు, న్యాయసమ్మ తమైనదనియు వారి యందరికిని ఋజువుపరచుట చాలకష్టము. నాభర్త లండనునగరము—కాదు యీ ప్రపంచమును విడచిపెట్టినటులందరును విశ్వసించుచుండిన రోజులలో, అనగా గ్రాంటుగారు లండనునగరమునం దున్న రోజులలో నాకీమహాభాగ్యము కలిగినది. అప్పటికప్పుడే నెడ్డు అదృశ్యుడై యెన్నియో మాసములయ్యెను. అందువలన నేనీ సమా చారమును సాధ్యమగునంత గుప్తముగ నుంచవలయును.

నాటి వేసవిరేయి మాచరిత్రల కలయబోసికొనినప్పటి నుండియు రోజుమేరికిని నాకును స్నేహము మిక్కుటముగ పెరుగనారంభించెను. మాయిద్దరి భర్తయు నొక్కడేయని నేనెన్నివిధముల నొక్కిచెప్పినను ఆమె యంగీకరింపకుండెను. చివరకామె భర్తలక్షణములను కొన్నిటి నామెయు, నాభర్త లక్షణములను కొన్నింటిని నేనును చెప్పుకొని సంగతిసందర్భముల నన్నిటిని సవిమర్శముగ కలియబలుకుకొనగ వారిద్ద రొకటికాదని నాకుగూడ రూఢియయ్యెను. ఇంక మాయిరువురి భర్తలలో ఎవరిభర్త ఎడ్వర్డు, ఎవరిభర్త జార్జి అను సంగతిని నిశ్చయము కావలసియుండెను. మాలో నొకరము యీ పేరులవలన మోసము నొందినమాట వాస్తవము. ఇద్దఱముగూడ ఎడ్వర్డు భార్యలమేయని చెప్పుకొనవలసి వచ్చుచున్నది. కాని ఒక్కపురుషుని భార్యలముకామని యిప్పుడిప్పుడే నిశ్చయించుకొంటిమి. అందువలన వారుభయులు నొక్క పేరుననె వ్యవహరించుచు లోకులను మమ్ములను మోసముచేయుచుం

డిరి. అట్టిమోసమున కొడిగట్టుకొనినవారు బందిపోటు దొంగలుమాత్ర మెగాక నంతకంటెను నీచప్రవర్తనము గలిగినవారుగ నుండవలయునని స్పష్టమగుచున్నది.

మెడ్లీకి తనపై నెంతయొ కూర్మిగలదని రోజుమేరీనాకు తరచుగ చెప్పుచుండెను. ఆమెకుగూడ నతనిపై నభిమానముగలదు. సంగతి సందర్భములనుబట్టిచూడ మెడ్లీ రోజుమేరీని పెండ్లిచేసుకొన నెంచుచున్నట్లుండెను. రోజుమేరీ తనభర్త మరణించెనని యూహిగ చెప్పుచున్నది. నాకథవిన్నపిమ్మట గూడ నామె కెట్టిసంశయమును గలుగలేదు. అందువలన నామె పునర్వివాహ మొనరించుకొనుటకు నిశ్చయించినట్లున్నది.

మరుసటి యాదివారమునాడు మెడ్లీ మాబసకు వచ్చినపుడు మేమ తనికి మెడ్లీ కంపెనీవారికార్డు జూపించితిమి. దానిని జూడగనె యతడు మావలెనె విస్మయమునొందెను. ఆ విస్మయము స్వాభావికమైనదా కాదాయని నాకుమాత్ర మనుమానముగనుండెను. ఇతరులకు తెలియకుండ నేవియోకొన్ని గూఢ వ్యవహారముల నొనరించుటకతడు తెలసిన విషయములుగూడ తెలియనట్లు నటించుచున్నాడని నాకనుమానము కలుగుచుండెను.

ఆకార్డునుచూచి తానేమియు నెఱుగనట్లు చెప్పినపిమ్మట నతడా కార్డును తనకిమ్మనికోరెను. దానితో నాకెట్టి ప్రయోజనమును గన్పించ నందున వెంటనే నేనతని కిచ్చివేసితిని. అంతమాత్రమున నూరకుండక మెడ్లీ కంపెనీవారి మనిషి ఆకార్డును జూచినపిమ్మట నాకు లారెన్సు యింటికేల దారి చూపించెనో ఆవివరమును తెలుపగోరితిని. తనకా వివరము లేవియు నర్థముకాలేదనియు సంగతి సందర్భములన్నిటి నరసి తగిన సమాధానము నిచ్చెదననియు నతడు చెప్పెను.

ఆమరుచటివారములో నతడు రోజుమేరీ కొకజాబు వ్రాసెను. ఆయుత్తరములో నేనడిగిన ప్రశ్నలకు కొంతసమాధానము వ్రాసెను.

తనతండ్రి కొకషరాబు కావలసివచ్చెననియు, తగినవానికై యతడు పత్రికలందు ప్రకటించెననియు, ఆప్రకటనజూచి షరాబువుద్యోగము నకు నేనుగూడ వచ్చిన ట్లాదుకాణములోని పురుషు డుంచెననియు అందువలన తనయింటికి దారి చూపెననియు నతడు వ్రాసెను.

ఈసమాధానము సరియైనది కాదనియు, కొంతవరకు కల్పితకథ వలె నున్నదనియు నెవరికైన విదితముకాగలదు. అంతకంటె మంచి సమాధానము నాకు తోచకపోలేదు గాని, యీవిషయములగూర్చి రోజుమేరీతో నెక్కువగ ప్రస్తావించుట మంచిదికాదని యూర కుంటిని. నాకు మెడ్లీపై ననుమాన మెంతయధికముగనున్నను రోజు మేరీ యతని గాఢముగ వలచియుండుటవలన నేను తగినకట్టుదిట్టము లను జేసికొనుటకు వీలులేకుండెను. మెడ్లీకిగూడ నామెయందధికాను రాగముండుటవలన తరచుగ నిచటికి వచ్చుచుండెను.

రోజుమేరీ మెడ్లీకుటుంబము వారివివరములను కొన్నిటిని నాకు తెలి యబరచెను. జానుమెడ్లీవలన మరికొన్ని తెలియవచ్చెను. జానుమెడ్లీ రోజుమేరీని జూచుట లారెన్సు గృహముననె. అంతకుపూర్వము వారొకరినొకరెరుగరు.

జానుమెడ్లీతండ్రి యౌవనదశలో నావికుడుగనుండి యనేక సముద్ర ములలో గ్రుమ్మరుచుండెను. వయసు ముదిరినపిమ్మటగూడ నతడా వ్యాపకమును విడువలేదు. ఒకనాడతడు తనకు పరిచయములేని క్రొత్తదీవి నొకదాని చేరుకొనియెను. తనప్రయాణసమయములందార్జిం చిన డబ్బుతో నతడు కవెంటుతోట యందొక వర్తకశాలను కొనెను. పిమ్మట నతడుకుమారులు ముగ్గురుతో గలసి యావర్తకశాలలో కూరగాయలవ్యాపారము చేయనారంభించెను. తక్కినఅన్నదమ్ములిరు వురును సత్రీలో తమయింటియొద్ద అంగడికికావలయు సామగ్రినంతటిని కాపించుచుండగా తండ్రియు, జానును వాటినంగడిలో విక్రయించు చుందురు.

స్వేచ్ఛగను, లాభప్రదముగను వుండిన ఆవృత్తిని విడచి ముసలి తండ్రికాపని నొప్పగించి తానేల లారెన్సుకొలువునందీ స్వల్పజీతమునకు కుదురుకొనెనో ఆసంగతి నతడు చెప్పకుండెను. ఆతని బావమరిది ఫ్రెండిలు బలవంతముపై తానట్లుచేయవలసి వచ్చినదని మాత్రము చెప్పుచుండును కాని ఆసమాధానమంత తృప్తికరముగ లేకుండెను. లారెన్సు వారమునకు ముప్పదియైదు షిల్లింగుల నిచ్చుచుండెను.

జానుమెడ్లీ కప్పుడు షుమారు 30 వత్సరములుండెను. ముఖము చూచుట కందముగనేయుండి మనిషి నిర్మలస్వభావుడని దోపింప జేయుచుండెను. పెదవులందెల్లప్పుడును చిరునగవు తొలుకులాడుచు ముఖమునకొక వింతకాంతి నొదవుచుండెను. ఆకన్నుల వినీలనీలకాంతు లాతని సౌందర్యమునకు వన్నెనొనగూర్చుచుండెను. ఆతని గడ్డమునం దొక చిన్నగుంటయుండెను. అది చూచుటకెంతయో మనోహరముగ నున్నదని రోజుమేరి పొగడిపొగడి చెప్పుచుండును. ఆతనికి హస్త లాఘవవిద్యయందు మెక్కువ నైపుణ్యము గలదు.

నేనతని విశ్వసింపజాలకుంటినినిదివర కేచటనో చెప్పియుంటిని కాబోలును! నేను చెప్పదలచిన దదికాదు. నన్నతడు విశ్వసించి మరింత సరళ స్వభావమున మాట్లాడిన బాగుండునని నే ననుకొను చుంటిని. అట్లుచేయకుండినను తనమాయ మాటలను నమ్మి మోస పోవునంత యవివేకిని కానని గ్రహించినను బాగుగనుండును. లారెన్సు కొలువులో ప్రవేశించుట కతనికి వేరొక కారణము ప్రబలమైనది యుండవలయును. దాని నతడు గప్పిపుచ్చుచున్నాడనియు, నింకేమి యడిగినను లాభము లేదనియు నూరకుంటిని.

ఆదుర్భర నిగూఢాజ్ఞాతవాస సమయమున జాను పరిచయము రోజు మేరీకివలె నాకుగూడ పరమానందకరముగ నుండెను. లవుజాయి యిది వరలో చెప్పిన కరుణాస్పద విచారకరవిగ్రహముగు భేజుసతికిని జానుతో సరససల్లాపములాడుచు హాయిగ కాలక్షేపము చేయుచుండిన ఇప్పటి రోజుమేరీకిని చాల వ్యత్యాసముండెను.

నేను సగము కుట్టియుంచిన దుస్తులను తాను పూర్తిచేయుచు, నేను తడిపియుంచిన బట్టల నారవేయుచు, ఇటులనే ప్రతిపనియందును నాకు చేదోడువాడుగానుండి రోజుమేరీ యపరమిత సహాయకారిగనుండెను. నాకు కావలయు పరికరముల సమకూర్చి నాపనులన్నిట సహాయ మొనరించి నన్ను సంతసింపజేయుటయె తనజీవిత పరమావధిగ నామె భావించుచున్నట్లు నాకుతోచెను. ఆమె మరొకరియింట పనికికుదురు కొనుటకు ప్రయత్నించుచుండగా నేను వలదని వారించితిని. నాయొద్ద నున్న డబ్బు ప్రస్తుత మిద్దరికిని చాలునుగద, అది పూర్తియైనపిమ్మట భగవత్కటాక్ష మెట్లున్న నట్లగునని నాయూహ. ఆడబ్బు యిద్దరికిని చాలక నేనెకూడ బాధపడుదునో యని యామెకు విచారముగ నున్నను నామాట మన్నించి యూరకుండెను.

ఇంతటితో తంత్రయంత్రము లన్నియు నంతరించినవనియు, యిటుపై నిర్మలాంతః కరణముతో నిర్విచారముగ జీవించు దినములు వచ్చిన వనియు నేను సంతసించుచుంటిని.

మే ముభయులము గలసి పుస్తకములను జదువుకొనుటయు, బట్టలను కుట్టుకొనుటయు, యింటిని శుభ్రపరచుకొనుటయు, పార్కులలో విహరించుటయు వింత ప్రదర్శనముల కరుగుటయు మొదలుగాగల వేడుకలతో కాలక్షేపము చేయుచుంటిమి. మనోల్లాసమున కంతరా

యము గలిగించు ఆనల్లని దుస్తుల సంతతితో విసర్జించి స్వాయముగ కుట్టుకొనిన క్రొత్తబట్టల గట్టుకొనుచు హాయిగ నుంటిమి.

నా పడకగదియందలి రహస్యస్థలమును గూర్చి నేను రోజుమేరీ కేమియు చెప్పలేదు. దాని సంగతి నెవరికిని జెప్పకుండుటయె మంచి దని యూహించుకుంటిని. నాడబ్బంతయు, ఫెర్నుద్వీపపటములతో గలపి దానియందుంచితినని యిదివరకు చెప్పియుంటిని.

శిశిరఋతువు నందలి యొకానొక యాదివారమునాటి సాయింకాలమున రోజుమేరీయును నేనును గలసి విహారార్థము హైడుపార్కున కరిగితిమి. దారిలో మాడాక్టరు చెప్పిన దాదినొకదానిని చూచి యామెను కుదుర్చుకొనుట కుద్దేశించితిమి.

లవుజాయి స్నేహితులయింటికి విందునకరిగెను. నాటిరాత్రి మెడ్లీ విందునకు వచ్చెదనని చెప్పియుండెను. ఆయన వచ్చుసరికి మేమింటి యొద్దనుండకుండిన నతడెక్కడ మరలిపోవునోయని యామెకు బాధగ నుండెను. అందువలన నామె సన్నెన్నియో మారులింటికరుగుదమని తొందరపెట్టుచుండును.

సాయంసమయమగుటవలన తామావహించిన వాటినెల్ల నరుణకిరణములు హిరణ్మయములుగ జేయుచుండెను. పవమాననందనుడు మనోహరమృదు వీచికలను పుంజపుంజములుగ నంపుచు వింతధ్వనుల నీనుచుండెను. నీలాంబరతలమునందచ్చటచ్చట కారుమబ్బులలముకొనుచుండెను. ఆపరమోల్లాసపరిస్థితులందు నామనఃశరీరములు రెండును హాయినొందుచుండెను. పిడుగుపడినట్లానాడువచ్చిన రక్షకభటుని జూచిన దాదిగ నాజన్మమధ్యమున నిట్టి యానందకరమగు సాయంతనమొకదానినైన గడపగలనని నేననుకొనలేదు. ఆపవనస్పర్శ సుఖపారవశ్యముననచటనే జీవితశేషమంతయు నట్లుగడచిపోయిన బాగుగనుండునని యాలోచించుకొనుచుండగా రోజుమేరీ యనేకపర్యాయములు

యింటికరుగుదమని తొందరపెట్టుచుండెను. నేనటులనే వెళ్లుద మొక నిముషమాగుమనుచు కాలక్షేపము చేయుచుంటిని.

చీకటి పడునప్పటికి మెల్లగ మేమిల్లుచేరుకొంటిమి. ఇంటికివచ్చు సరికి మెడ్లీచుట్టకాల్చుకొనుచు నింటిముందర పచారుచేయుచుండెను. అప్పుడె చలిగాలి యారంభమగుటవలన నతడేమిచేయుటకును తోచక నేమియోయాలోచించుచుండెను. ఇంతలో మారాకజూచి యతడెంతయో సంతోషించెను. తానచ్చటికివచ్చి పదినిముషములు మాత్రమె యైనదనిచెప్పెను.

మేము లోపలికరిగి తాళములనుతీసి తలుపులను తెరచితిమి. రోజు మేరీ అగ్గిపుల్లవెలిగించి గుమ్మములోని దీపమును ముట్టించెను. పిమ్మట నతడును లవుజాయి రోజుమేరీలును వంటయింటికరిగిరి. దుస్తులను మార్చుకొని భోజనము చేయవచ్చునను వుద్దేశ్యముతో నేను మేడమీదకరిగితిని. గదిలోనడుగిడునంతనె యేలనో చెప్పజాలను గాని యెవరో లోపల ప్రవేశించినట్లు నాకనుమానముకలిగెను. క్రొత్తవారెవరో లోపలప్రవేశించినట్లు అనుమానముగనున్నను, లోపల నేనుంచినవస్తువులన్నియు యథాస్థానములందుండెను. పడకకుర్చీమాత్రము నేనుంచినతావునగాక మఱియొక మూలనుండెను. బట్టలనలంకరించుట కుపయోగించు "డ్రెస్సింగు" బల్ల కొంచెము అడ్డముగ త్రిప్పినట్లుండెను. ఇంతకుతప్ప మరేమార్పులును నాకుగోచరింపలేదు. తాళమువేయుటకు ముందు నేనొక్కర్తెనుమాత్రము లోపలినుండి వస్తువులన్నిటిని సవరించుకొని యీవలకువచ్చి తాళమువైచినట్లు జ్ఞాపకము. రోజు మేరీ ప్రొద్దున పరుపు నెత్తిపెట్టి యిల్లూడ్చుటకుతప్ప మరిరాలేదు. లవుజాయి గురువారమునాడుతప్ప తక్కినరోజులలో గదిలోనికి రానేరాదు. అంతియగాక మేము బయటికరుగుటకొక గంట ముందుగనే యామె బయటికరిగెను. ఇంకనీయింటికివచ్చువారెవరున్నారు?

సరియె యెవరువచ్చిననేమి? నారహస్యస్థలము నెవరును శోధింప కుండిన నంతియెచాలును. భోజనమునకరుగుటకు ముందుగ నాసంగతి నిశ్చయించుకొనిన ధైర్యముగ నుండునని యెంచితిని. అంతియగాక నామరుచటిదినమునందేదియో కొనను ద్దేశించితిని. అందులకు కొంత పైకమును తీసికొనవలసి యుండెను.

ఆ తివాసియు, బల్లయు నెప్పటివలె కన్పించెను. నేనెట్లుంచినవట్లే యుండెను. కాని బల్లయెత్తిచూచునప్పటికి లోపలనొక చిల్లిగవ్వయైన గన్పించకుండెను. దానియందుంచినవన్నియు నంతరించెను.

ఫెర్ను ద్వీపపటము—లారెన్సువద్ద నపహరించినది—దాని నమూనాపటము, సాంకేతికపద వివరణములపట్టిక, వజ్రపుటుంగరము, నానోటులన్నియు నామకార్థమైన నొకటియు మిగులకుండ నన్నియు మటుమాయమయ్యెను.

ఇంతద్రవ్యమొక్కసారిపోవుటకు గలిగినసంతాపమట్లుండ నికమీద చేతచిల్లిగవ్వయైనలేకుండ నీఖర్చుదినములనెట్లు గడుపవచ్చునను బెంగతో నేను కొయ్యగట్టిపోతిని. ఒడలు తెలియక కొంపమునిగినట్లొక వెర్రికేకను వేసితిని. ఏమైపోతినోయను భయమున రోజుమేరీ వెంటనే పరుగెత్తుకొనివచ్చెను.

ఆమె వచ్చినవెంటనే నేనేల కేకవేసినదియు తెలుపగోరెను. జరిగిన సమాచారమంతయు నే నేకరుపెట్టితిని. ఇంకనాస్థలమును గోప్యముగ నుంచిన నేమిలాభమని యెంచి యామెకాగోతిని జూపించితిని. ఆమె వెంటనే క్రిందికరిగి మెడ్లీని తీసికొనివచ్చెను. ఆయనయడిగిన ప్రశ్నలన్నిటికి మరల జవాబులు చెప్పుచు జరిగిన కథనంతటిని చెప్పితిని.

నేజెప్పిన సమాచారమంతటి నతిజాగ్రత్తగ విని అంత వదరుబోతునుగూడ నోటబెడ్డకొట్టినట్లొకమాటనైన బలుకలేదు.

"నాయొద్దనా యుండిపోయినవీపటములు ?—అని యితడేదియో హక్కుండి తనకు రావలసినసొత్తును నేనపహరించినట్లు ప్రశ్నించెను.

"అవును. నాభర్తకొరకు వానిని దాచియుంచితిని. అతడు తిరిగి యెప్పటికైనా వచ్చునేమోయనియు, ఆవచ్చునప్పుడు వానినుపయోగించునేమోయనియు దాచియుంచితిని.

"నాతో చెప్పిన బాగుగనుండెడిదే!"

"ఎవరికి చెప్పుటకును యిష్టములేకనే యూరకుంటిని. నీవెవరవో తెలియనిది నీతో చెప్పినమాత్రమేమి ప్రయోజనము?"

"ఎవరనో తెలియకున్నను చాలప్రయోజనము గలిగియుండును. ఆపటములనెట్లుసంపాదించితివి ?"

"దొంగతనమువలన మాయన్న లారెన్సుడ్యూకు దగ్గర నపహరించితిని. ఈవివరములన్నియు నీకేమి ?"

"అబ్బా చాలాకష్టపడి సంపాదించితివే!"

ఈప్రశ్నలన్నిటి నితడేలనడుగుచున్నాడని నాకు విస్మయమును అనుమానమును గలుగుచుండెను. కాని తనకేదియో యధికారముండియె యడుగుచున్నట్లు వానిధోరణినిబట్టి తెలియుచుండెను. పిమ్మట నావలిగదిలోనికరిగితిమి. అచట నతడు రోజుమేరీనిగూడ నేవేవియో ప్రశ్నలనడిగెను. ఈలోపల తనగదిలోని వస్తువులేవైన పోయినవేమో చూచుకొనుటకామె తన గదిలోని కరిగెను. కాని ఆమారుమూల భద్రముగ నుండవలయునని యుంచిన వస్తువులుతప్ప మరియొక పూతికపుల్లయైనను పోలేదు. ఏకిటికీనైనను తలుపునైనను బలవంతముగనూడ బెరికిరేమోయని యనుమానించుటకైన కారణముకన్పించకుండెను. కాని మొదటిగదికి వేసినతాళముమాత్రము పూర్వకాలమునాటిది. దాని నేచెవితోనైన తీయవచ్చును.

ఎవరులోపల ప్రవేశించినను రెండుగంటలసేపు నిరాటంకముగ నేపనిచేయుటకైన నవకాశముండెను. కాని యీరహస్యస్థలమును గుర్తించుటకు మాత్రము క్రొత్తవారికెవరికిని వీలుండదు. ఆయీచోరీ నేమాత్రమైన నెఱింగి యుండవలయును.

ఈచోరీ మెడ్లీవలననె జరిగెనని నాకు చాలా అనుమానముగనుండెను. మేము బయటికరిగినపుడు ఫ్రాస్టునతివచ్చి వాటినపహరించినదేమోయని రోజుమేరీ కనుమానముగనుండెను. రోజుమేరీభర్తనిజముగ మరణించియుండడనియు, అతడేవచ్చి వాటినపహరించియుండవలయుననియు, ఇంకొకరికంత గోప్యముగనున్న ప్రదేశమును కనిపెట్టుటకు సాధ్యముకాదనియు మెడ్లీచెప్పుచుండెను.

రోజుమేరీ భర్తకుతప్ప వేరొకగదిలోని కిదివరకెపుడైన వచ్చిరా ? వచ్చినను అప్పుడువచ్చి యప్పుడు పోవువారికి గదిలోని గుట్టుమట్టులేమి తెలియును ? తప్పకుండ రోజుమేరీ భర్తయె వచ్చియుండవలయును. ఇంకొకరికా పటములతో నేమి ప్రయోజనముండును ? అతనికెంతయో యుపయోగమున్నదని అతడంత జాగ్రత్తగ దాచుకొనిన నమూనాపటమువలన తెలియగలదు. అతడు మరణించినట్లు ప్రకటించుటవలన రోజుమేరి కేదైన లాభముండవచ్చును. అందువలన నామె యతడు మరణించినాడని చెప్పుచున్నది. అతడే మరణించియుండునెడల నింకొకడీపనిని చేయజాలడు. గనుక నతడెచటనో సజీవిగనే యుండి యిప్పుడీపని నొనరించెనని మెడ్లీ వాదింప నారంభించెను. అతడు మరణించుట వాస్తవమని రోజుమేరీ వాదింపసాగెను. ఎట్లయినను చివరకు మెడ్లీ మాత్రమామె మాటలను నమ్మలేదు.

ఇంక నాసంగతియు, నాయాలోచనల సంగతియు మరి వ్రాయు నవసరము లేదు. ఆపటము లేయేట బడినను నాకపుడు బాధ లేకపోయెడిది. పురిటిదినములు సమీపించుచున్నవి. డబ్బు అవసరము

చాల హెచ్చుగ నున్నది. జేబులోనుండిన యే రెంపుమూడు షిల్లింగులో తప్ప తక్కిన డబ్బంతయు పోయినది. ఇంక నేనెట్లు జీవయాత్ర చేయుట ?

వింతవింత దొంగతనము లెచట నెట్లు జరిగినవో చెప్పుకొనుట సామ్ము గోల్పోవనివారికి యుత్సాహకరముగనే యుండును. సొమ్ము పోయిన వారు సొమ్మున కేడ్చుచుండగా వారి సహాయార్థమును, ఉబుసుపోకకును, తదితరకారణముల వలనను నచటచేరినవారు అట్టి సమయములందూరకుండజాలరు. వారి వారికి తెలసిన విశేషములను చెప్పుచుండుట లోకస్వభావము. అట్లే రోజుమేరీ మెడ్లీలు చెప్పుకొనసాగిరి. నాకపుడా కబురులను వినుటకుగాని, ఎవరీ దొంగతనము చేసియుందురని చర్చించుటకుగాని తీరికలేకుండెను. ఈజరిగినదంతయు నేదియో దురుద్దేశముతో జరిగియుండవలయుననియు లారెన్సు పన్నాగము లాగిపోయినవని సంతసించితినేగాని యవి యాగిపోలేదనియు, నేను దిగులుపడుచుంటిని. పటములు కావలసినవారెవరో యీపనిని చేసియుందురనియు అట్టివారికే డబ్బుతో నంతగ ప్రయోజనముండదు గావున వారొకవేళ నాడబ్బు నిచ్చివేసినను నిచ్చివేయవచ్చుననియు, కాని పటములు తిరిగి లభించుట మాత్రము దుర్లభమనియు మెడ్లీ నన్నోదార్ప నారంభించెను.

లవుజాయివచ్చినవెంటనే యామెకీ వృత్తాంతమంతటిని వినిపించితిని. మేము బయటికరిగినపుడు యీ దొంగతనము జరిగియుండుననుమాట కామె యంగీకరించెను. కాని దొంగలెవ్వరైన లోపలికి వచ్చిరాయని యామెకు సందేహముకలిగెను. దొంగలేవచ్చియుండిన నింటినిండ నెచటికచట పడియున్న గిన్నెలు పళ్లెరములు మొదలుగాగల వస్తువుల నన్నిటిని విడచిపెట్టి యేదియో చీకటిగదియందొకమూల గోప్యముగ దాచియుంచిన వస్తువులనే దొంగలించుకొనిపోవుట పొసగదనియు,

గనుక యెవరోయెరిగియున్న వారీపనిని చేసియుండ నలయుననియు లవుజాయి పలికెను.

"ఇంతకు నామూరుమూాలనేమి పడవైచెనో యదితప్ప మరేగియు వానికిదక్కలేదు పోనిమ్ము." అని లవుజాయి యూరడింపసాగెను.

"అయ్యో నాడబ్బంతయు నచటనేయుంచితిని. ఐదువందల నవరను లకు తక్కువయుండ దాపోయినసొమ్ము!" అని నేను గోలపెట్టితిని.

ఆమె యెంతయో జాలితో నాప్రక్కజూచుచు "అయ్యో, పిల్లమ్మా చంటిదానవుగనుక బేలతనమున నట్లు పలుకుచున్నావు. కాని అంత సొమ్ము పోయినదని మాత్రము నన్ను విశ్వసింపమనకుము. ఏదియో ఏళ్లుగడపిన దాననగుటవలన నామాత్రము నిజానిజములు తెలియక పోవు. నీయొద్ద నేపదినవరనులున్నను నాచేతికిచ్చిన బాగుండెడిదే! పురిటియిబ్బందులు తీరునరకైనను దాచియుందునుగదా!" అనిపలికెను.

ఆమాటలను విన్నపిమ్మట నాకు బిగ్గరగ నేడువవలయునని బుద్ధి పుట్టెను. కాని యేడువబోవునప్పటికి లవుజాయి ముఖముజూచి పట్ట లేనంత నవ్వువచ్చినది. ఇట్టిదానికే కాబోలును ఏడువలేక నవ్వినట్లు అని సామెతచెప్పుచుందురు. ముసలివారు తమవిశ్వాసము లందెంత పట్టుదలగనుందురో నాకపుడు బోధపడెను. నేను సహజముగ పేద దానిననియు, ఆనెల బాడుగ నిచ్చుటకు దగ్గరడబ్బులేక నీకథనంతటిని గల్పించితిననియు నాముసలిదాని నమ్మకము. కాని తొందరపడి యామెనాకు మనస్సునొచ్చెడిమాట నొక్కటియైన బలుకలేదు.

"సరియె, అయినదేదియో నైనది. మరిలేనిపోని బెంగబెట్టుకొని విచారింపకుము నాచేతనైనంతవర కావ్యవహారమును చక్కబెట్టెదను లెమ్ము. నీవేమియు నలజడిబొందకుము. ఇప్పటిలో నీవేమియు బెంగ పెట్టుకొనవలదు."

"నాకిట్లు చెప్పుచుండెనేగాని యామె మనస్సులోగూడ నేదియో యలజడిగలిగినట్లు నాకు వ్యక్తమగుచుండెను."

10

పోయినసొమ్ము పోనేపోయినది. దానిని పట్టుకొనుటకై లండను నగరమంతయు తిరుగులాడుటకు నాకిప్పుడు వేళగాని, ఓపికగాని లేదు. యీసంగతినిగూర్చి నాన్నగారికి వ్రాసిన నతడేమైన శ్రద్ధవహించు నేమోయని యూహించుటకైన వీలులేదు. ఆయన లేనిపోనిప్రశ్నల నడుగుట కిక్కడికివచ్చినను రావచ్చును. అప్పుడు నారవహాస్యము నెరింగి పుట్టుపూర్వోత్తరముల నన్నిటి నెత్తిపెట్టును. అందువలన నిపుడేమి చేయుటకు నేమియు తోచకుండెను.

మరునా డుదయము రోజుమేరీ మిక్కిలి తొందరబాటుతో నాదగ్గరకువచ్చెను. ఆమెచేతియందొక వార్తాపత్రిక యుండెను. నేను చూడకుండ దానిగప్పిపుచ్చుట కామె యత్నించుచుండెను గాని యెంత దాచినను నాకది కన్పించుచునే యుండెను. నాకేదియో యాశ్చర్యకరమగు సంగతిని తెలుపుట కామె వచ్చినదని నే నూహించితిని.

మరియెందుల కాలస్యము? అదిగూడ విచారకరమైన సంగతియె. నిదురబోవుచుండగా నాన్నగా రాకస్మికముగ మరణించిరని దానియందుండెను. హృద్రోగమువలన నట్టి యాకస్మికమరణము గలిగెనని దానిలో వ్రాసియుండెను. ఆవార్త నాకమితమగు భయవిషాదములు గొలిపెను. నాన్నగారు నాయందెంత క్రూరముగ ప్రవర్తించినను ఆతనిపై గల ప్రేమగాని, గౌరవముగాని, నాకించుకయు తగ్గలేదు. చివరదశలో నతడు నాయందుమరల పుత్రవాత్సల్యము గనుబరచెను. అందువలన మాకుభయులకు మరల రాజీకుదురవచ్చు నని నేననుకొనుచుంటిని. నాడు బ్యాంకిలో డబ్బుకట్టినట్లు తెలిసినప్పటినుండియు నతని జూడవలయునని నేను ప్రతిదినము తలంచుచుంటిని. కాని మరల నెట్లో యూరకొనుచుంటిని. ఇప్పు డతడు కాలగతినొందెను. ఇంక నెవరితో రాజీచేసుకొనుట? ఎవరితో మాట్లాడుట?

పొంగిపొంగివచ్చుచున్న దుఃఖము నాపుకొనజాలక గోడప్రక్కకు తిరిగి వెక్కివెక్కి యేడువ నారంభించితిని. సంతతాశ్రుధారలతో పట్టెడన్నమునైన దినజాలక మూడురాత్రిందివములు గడచెను. శరీరమునం దాయాసమధికముగ నుండెను. నాల్గవదినమున కడుపులో పట్టరానంతటి నొప్పులువచ్చి కొంతసేపటికి నొక మగశిశు వుద్భవించెను. సహజస్థితిలో పురుడువచ్చునెడల మరి పదునైదుదినములకు వచ్చియుండుననియు, విచారమువలన నతడు ముందుగనే పుట్టెననియు వైద్యుడు చెప్పెను. కష్టముపై కన్నకాన్పగుటవలన కొన్నివారముల వరకుగూడ పిల్లవానియవస్థ చావుబ్రదుకులలో నుండెను. చివర కతడీప్రపంచము నేననుకొనుచున్నంత చెడ్డది కాదని యెంచెనుకాబోలును! కొన్నిదినము లిచటనుండి దీనిని పరీక్షింప నిశ్చయించుకొనినట్లు తోచెను. కాని నేనుగూడ మరికొన్ని దినము లీలోకములోనుండ బ్రయత్నించిననె తానందుల కంగీకరించినట్లును లేకుండిన తానుగూడ నావెంటనే లోకాంతరయాత్రచేయ సిద్ధముగనున్నట్లును నతని నడవడివలన బోధపడెను. అందువలన కడుపారకన్న పసిపాపని నింతవేగమె విడువనొల్లని అపరిమితానురాగగాఢప్రేమవల్లరుల దగుల్కొని విడిపించుకొనజాలక, యమపాశములనుమాత్రము దప్పించుకొని, మేమిరువుర మన్యోన్యశ్రేయోభివృద్ధుల గోరుకొనుచు నానాటి కారోగ్యవంతులమై కొన్నివారములకు మరల మనుష్యులలో బడితిమి.

ప్రాతవస్త్రములను నగలను అమ్ముకొని యెటులనో జీవయాత్ర చేయుచుంటిని. లవుజాయి నామాట నమ్మలేదుగదా యను యలుకతో నామెపై కోపగించుకొనుటకు నామన స్సంగీకరింపలేదు. నేను కొంచెము తేరుకొని నాపనిని పిల్లవానిపనిని కొంచెముకొంచెముగ జేసికొనగలిగి నప్పటినుండియు రోజుమేరీ యాచెంతనే యెవరియింటనో పనికి కుదురుకొని తనపొట్ట తాను పోషించుకొనుచుండెను.

# 33

కొంతకాలమునుండియు జానుమెడ్లీ మమ్ముజూచుటకు రాలేదు సరికదా యొక జాబైనను వ్రాయకుండెను. రోజుమేరీ కీవింత వైఖరి యేమియు బోధపడకుండెను. ఇందువలన నాయనుమానము మరింత బలపడుచుండెను. నాగదిలో జరిగిన దొంగతనమునుగూర్చి తన కేమియు తెలియదని యతడెంత నటించినను నతనికి తప్పకుండ కొంతప్రవేశ ముండునని నేననుకొంటిని. నాయందెంత స్నేహమున్నట్లు నటించు చుండినను లారెన్సు కొలువునందుండి యతడు లారెన్సు డబ్బుతినుచు జీవించుచుండెను. అందువలన లారెన్సున కుపకారము చేయుతలంపుతో నన్ను మోసగించియుండవచ్చును. అంతియగాక నన్నోదార్చుటలో నతడు "తిరిగిడబ్బు లభించినను లభింపవచ్చునుగాని పటములుమాత్రము లభించుట కష్టమని రెండుమూడుసారులు చెప్పియుండెను. అందువలన నీపని తప్పకుండ నాతనివలననే జరిగియుండునని నాకు నమ్మకము కలిగెను. అయినను నాకెంత నమ్మకము హెచ్చినను యీయాలోచన లనుమాత్రము రోజుమేరీకి చెప్పలేదు.

నేనుగూడ మానవమాత్రురాలనే యగుటవలన నాన్నగారంతపెద్ద యాస్తి నేమిచేసిరో యని యాలోచింప కూరకుండజాలకపోతిని. నాకొక్క పిల్లింగుకంటె నెక్కువ లభింపదని యతడు చెప్పినదానికిని తరువాత జరిగిన సంగతులకును చాలతారతమ్య ముండెను. ఆతని కడపటిరోజులలో చాల మార్పులు వచ్చినట్లున్నది. అందులో ముఖ్య మైనది లారెన్సునకును అతనికిని అభిప్రాయభేధములువలన కలిగిన కలహము. నాకాస్తి యివ్వనని యావలకు సాగనంపినది యభిప్రాయ భేధమువలననే గదా!

అట్టి అభిప్రాయభేధము లారెన్నుతోఁగూడ వచ్చినప్పుడు నిశ్చయముగ నతని వైఖరి మారియుండవలయును. బ్యాంకులో నాపేరను డబ్బుకట్టుటయె యిందులకు ప్రబలనిదర్శనము. అందువలన నతడేదైన మరణశాసనము వ్రాసియుండునని నాకు తోఁచెను.

ధర్మార్థ మేర్పరచు సంస్థలయం దతని కెక్కువ నమ్మకములేదు. మీఁదుమిక్కిలి వాటియం దసూయగూడ ప్రబలముగనుండెను. పేదసాదల కెట్టిసహాయము చేయవలసియున్నను, పాలకులే యట్టి ప్రయత్నములను జేయవలయునని యతని యుద్దేశ్యము. ధర్మసంస్థల నేర్పరచుటవలన నాదురదృష్టవంతులకు ధర్మదాత లుద్దేశించునట్టి సహాయము జరుగకుండుట యటుండ వాటి నేర్పరచువారిలో కొందరి కనవసరముగ నెక్కువ జీతములు ముట్టుచుండునని యతని నమ్మకము. ఇట్టి స్వలాభాయత్తచిత్తులు తయారుచేసిన దరిద్రులసంఖ్య దినదినమభివృద్ధినొందుచున్నదని యత డనేకవేదికలపై నుపన్యసించియుండెను. ఇట్టి బూటకపు ధర్మసంస్థలకు పెద్దవిరాళములనిచ్చి పేదవారి కపరిమిత సహాయ మొసర్చితి మనుకొను ధనవంతులు తమ విధ్యుక్తధర్మమును తెలిసికొనజాలక సులభముగ దాని విదలించుకొనుట కిట్లుచేయుచున్నారని యత డనుచుండెను.

సాంఘికసమస్యలందు నాన్నగారి యభిప్రాయములు సరియైనవగునో కావో నిర్ణయించుటకు నేను సమర్థురాలను కాకున్నను మఱి కొంద రీయభిప్రాయములం దతనితో నేకీభవించుచుండుట నిజము. అటులని అతడు దయదాక్షిణ్యములులేని కఠినహృదయు డనుకొనుటకు వీలులేదు.

ప్రజలతనితో వాదించునపు డతడు తరచుగ నిట్లు పలుకుచుండెను. పిల్లవాడు స్వయముగ నిలచుండుటకును, నడచుటకును తగినయవకాశము నీయక నాతని నెల్లప్పుడును ఎత్తుకొనియె త్రిప్పుచు నాకస్మికముగ

వానిని క్రిందదింపి నడువుమనిన నతడెట్లు నడువజాలడో యదియె విధమున నీసంస్థలు, పురుషుల కాత్మసంరక్షణోపాయముల నరయుట కెట్టి యవకాశముల నీయక వారి శరీరమానసికవికాసముల ముకుళింపజేయును.

ఇట్టి యభిప్రాయములు గలవా డింత పెద్దయాస్తి లనవసరముగ దానధర్మములక్రింద నిచ్చునని నేను నమ్మజాలకుంటిని. ఏవియో షరతులను బెట్టకుండ నతడు లారెన్సునకుగూడ నీయడని నాసంశయము.

మరణాత్పూర్వము చాలదినములనుండియు నతనికి నావృత్తాంత మేమియు తెలియకపోయెననియు, ఆయాస్తినంతటి నేమిచేసెనో యనియు నే ననేకవిధముల నాలోచించుచుంటిని. ఆయన మరణశాసనమును గురించి పత్రికలం దింతవర కేమియు ప్రకటితము కాలేదు.

మాచిన్నిపూర్ణినుస కారువారముల యీడు ప్రాప్తించునరికి నాయొద్దనున్న డబ్బంతయు పూర్తిగ వెచ్చమయ్యెను. చేతనొక పెన్నియైన లేకుండెను. కట్టుకొనుటకే బట్టలుచాలక యిబ్బందిపడుచున్న సమయ మందింకను బట్టలనెట్లు లమ్మగలను. చలి చాలవిశేషముగ నుండెను. అందువలన పడవలోబోజాలక రైలునెక్కి చిన్న సత్రమువీధికి బయలుదేరితిని. లారెన్సుయింటికరిగిచూడగా తలుపు తాళమువేసి యుండెను, ఇంటిముంగట కనబడియు కనబడని యక్షరములతో " బాడుగ కీయబడును" అని వ్రాసినబల్ల వ్రేలాడుచుండెను.

లారెన్సు కుటుంబమును దీసికొని యెచటికరిగెనో ఇరుగుపొరుగుల వారు చెప్పజాలకుండిరి. ఇంతలో నావీధియందున్న తపాలాపెట్టెలోని యుత్తరములనుతీసి తపాలాఫీసునకు గొనిపోవుట కొక తపాలాబంట్రోతు వచ్చియుండెను. అతని నడుగునెడల లారెన్సు యెచటికరిగినదియు నతడు చెప్పగలుగునని యెంచి యతని సమీపించి " ఈవిధ

యందుండిన లారెన్సుడ్యూకుగా రెచటికరిగి" రని ప్రశ్నించితిని. ఇతరుల విలాసమునడుగునపు డెవరికీ నావివరములను తెలుపవలదని తపాలావారి కందరికిని యుత్తరువు లుండునుగాబోలు. నేనెన్నిమారు లడిగినను అతడు నాకెట్టి ప్రత్యుత్తరము నీయకుండెను. చివరకు విసువెత్తి యింటికి బోవలయునని బుద్ధిపుట్టెను. అయిన నింకొకసారి యడిగి చూడనెంచి నేనతని పినతండ్రి కుమార్తెననియు అతనితో చాలతొందరపని యున్నదనియు శరీరమునం దాయాసముగ నున్నందున నెక్కువ కాల మాయెండలో నిలువజాలకున్నాననియు చెప్పి బ్రతిమాల నారంభించితిని.

అంత నతడు నాస్థితికి జాలినొంది లారెన్సుకుటుంబ సహితముగ బెల్లేరుస్క్వేరు సమీపమున కెచటికో బోయిరనియు ఆప్రాంతములందు విచారించినయెడల వివరములు తెలియగలవనియు చెప్పెను.

నే నదివరకూహించినట్లు నాన్నగారు మరణించిన వెంటనే లారెన్సు మాయింటి నాక్రమించుకొని యుండునని నే నపుడు గ్రహించితిని.

లారెన్సు నాన్నగారియింటి యందుండుటకు నా కెట్టి యభ్యంతరములేదు గాని నాకు గర్భశత్రువువలె పరిణమించుచున్న యీామర్చిసనుగూడ నచటనుండుటకు నా మనస్సంగీకరింపకుండెను.

నాన్నగారి యిల్లు చిన్నసత్రము వీధికి ఎంతోదూరము లేదని యచటి వారు చెప్పినను అప్పటికప్పుడె యెండపడి చాలయలసిపోయి యుండుటవలన నొక రిక్షాబండి కట్టించుకొని యచటి కరుగవలసివచ్చెను. చేతిలోనున్న ఆ నాలుగుడబ్బులు రిక్షావానికిచ్చిన నింక నొక చిల్లిగవ్వయైన నుండదని తెలసినను బండి కట్టించుకొనక తీరినది కాదు.

చిన్నతనమున నాగర్భశ్రీమంతురాలివలె సకల భోగములతో పెరిగిన యింటికిప్పుడు నిర్భాగ్యురాలివలె నింత నీచస్థితి నరుగుట నా

కెంతయో బాధగనుండెను. డ్యూకు అందు డ్యూకుకంపెనీవారి అయిదారు లక్షల నవరసుల యాస్తికంతటికిని యజమానురాలనని చుట్టుప్రక్కలవా రతిగౌరవముతో భాగ్యదేవతవలె భావించుచుండగ మెలగిన ప్రదేశమున కిప్పుడు చింపిరిగుడ్డలతో నింతహీనదశలో బోవలసివచ్చినందులకు తలకొట్టివేసి నట్లున్నను విధిచెయిదములకు రిచ్చబోవుచు మెల్లగ నరిగితిని.

లారెన్సు నన్నీస్థితియందు చూచి యేమనునోయనియు యిప్పుడు సర్వస్వాతంత్ర్య స్వతంత్రుడగుటవలన నింకే పిచ్చితలంపును పెట్టుకొనకుండునా యనియు నాలో నాలోచించుకొనుచు బోవుచుంటిని. నేనిట్లు భావించుకొనుచుండగా ప్రాతగిలి సగముజీర్ణించిపోయిన యీ బండిలో నొకమూల నట్టి శిథిలావస్థయందున్న యద్దములో నా ముఖప్రతిబింబము నాకు కన్పించెను. ముఖము చాల తెల్లబారి యుండెను. డబ్బు యిబ్బందియు, పురిటి యలసటయు నా శరీరమందలి రక్తమాంసములను పూర్తిగ నపహరించినవని నే నపుడు తెలిసికొంటిని. ఆ రోజున నదియేమి పాపమో పుష్టిగ లేకున్న పోయెను, ముఖముచూచుటకైన బాగులేకుండెను. ముఖమందలి వెల్లదనము చాలకాలమునుండి యచట వేళ్ళు దన్నుకొనియుండుటను గాబోలును దాని వాసన పెదవులను గూడ నలముకొనియెను. జుట్టంతయు కలసిపోయి కాంతి విహీనమై యందవికారముగ నుండెను. ఎక్కువ డబ్బువచ్చునను యుద్దేశముతో మంచిదుస్తులన్నిటి నమ్ముకొనుటవలన కట్టుకొనుట కింపైన బట్టయొకటియు లేకుండెను. నా టోపీయును, వేషమును మూర్తీభవించిన దరిద్రదేవతవలె నామట్టునకు నాకే యసహ్యముగ గన్పించెను.

గుమ్మములోని కరిగి గంటమ్రోయించి నంతనె యెవడో బిళ్ళబంట్రౌతువచ్చి తలుపు తెరచెను. నా పేరు చెప్పసరికి వాడసందర్భముగ నా ముఖమువంక జూడనారంభించెను, "వచ్చినదారినే యింటికరుగు"

మనునంతటి కలకుదనములేకున్నను ఆ చూపులలో "ఇచటికేల వచ్చితి" వను భావముమాత్రము స్పష్టముగ గన్పించుచుండెను. వాడెవడో దేశమర్యాద లెఱుగని విదేశీయునివలె గన్పించెను. వాడుధరించిన యుడుపులును, బిళ్లయును క్రొత్తవైయైనను వానియుపేక్షవలన చాల ప్రాతగిలినట్లుండెను. వానిజుట్టంతయు వాసననూనెల సౌరభము నెంతయు వెదజల్లుచుండెను.

"అమ్మోర్మ రొచ్చార్రేంటి ? అయ్యోరులో నుండారో లేదో చూసొత్తా. నీలాం డక్కడ. లోనికదు గెడ్తారేంటో భద్రము!" అనుచు వాడు తెలిసియు తెలియనిమాటల నేవియో నుచ్చరించుచు లోనికరిగెను.

నాన్నగారు నన్నుచూడ నంగీకరింతురో లేదో కనుగొనుటకై నాడు ప్రాస్టుసతిలోని కరిగినప్పుడు నన్ను నిలువనియమించిన దాచోటనే. పూర్వపురంగులు, గచ్చులుమొదలగునవి చాలవరకు మారిపోయినవి. ఇంటిలోని యేర్పాటులుగూడ విశేషముగ మారిపోయినట్లుండెను. మనిషియో ప్రమానో తెలియని విచిత్రవిగ్రహ మొకటి మధ్యహాలు నలంకరించెను. ఇంటిరూపమును, అందమును చాలవరకు చెడిపోయెను. ఈ మార్పులేమి, యీ యసందర్భపు పెత్తనము లేమియని నా కపుడు పట్టలేనంత దుఃఖమును అసూయయు గలిగినవి.

నేనిట్లాలోచించు కొనుచుండగా మొదట లోనికరిగిన కురూపవన్య రూపము మరల బైటికివచ్చి నన్ను తన వెంట రమ్మని యాజ్ఞాపించి ముందునకు నడువ నారంభించెను. పోతపోసిన యసూయ దేవతావతారమువలె దోచుచున్న యీ వింతమానుషాకారము కంటె ఫ్రెండిలె చాల మంచివాడని నేనపుడు భావించుచుంటిని. ఆ ఫ్రెండిలుబోయి వీడు వచ్చుటకు కారణమేమి ? అందముగనున్నను లేకున్నను వాడు ఆంగ్లదేశమున బుట్టినవాడనియైన కొంతసంతృప్తియుండెడిది. కాలము గడచుకొలది నితరదేశీయులందరికంటె నా దేశస్థులె నాకెక్కువ నమ్మకస్థులుగదోచిరి. వారికే సుగుణమున్నను లేకున్నను, దేశాభిమానమైన నపరిమితముగనుండును.

వారిలో లారెన్సు "తలవనితలంపుగ మాయందేల నింతకటాక్షము గలిగిన"దని వెగటుగ ప్రశ్నించెను.

"నాన్నగారెట్లు మరణించిరో యేమిచెప్పిరో ఆ సంగతులను తెలిసికొనవలయునని" ఫ్రాస్టుసతియు, కుమార్తెయు నొకరిముఖము నొకరు చూచుకొని వికటముగ నవ్వుకొనజొచ్చిరి. నాకందువలన పట్టరాని కోపము వచ్చుచుండెను.

"ముసలివాని దశాహమునకు వచ్చుటకైన తీరికలేకపోయినదా? "అని లారెన్సు కోపముతో బలికెను.

"నాకుజబ్బుగా నుండుటవలన రాజాలకుంటిని."

"ఎంతసేపు యీ నిలువుజీతము ? కూర్చుండిన బాగుగనుండునేమో ? "అని ఫ్లోరెన్సు మహాదైశ్వర్య సూచకపుటెక్కుతో బలికెను.

పిమ్మట తలయొక కుర్చీమీదను గూరుచుంటిమి. వాటినెవరో నర్ధ చంద్రాకారమున నమర్చియుండిరి. నాకీయేర్పాటు గూడ వ్యగ్రతగ గన్పించెనుగాని వారికిమాత్ర మెంతయో వినోదముగ నున్నట్లుండెను.

"ఇల్లిపుడెట్లున్నదని నీ యుద్దేశ్యము? మునుపటి యిల్లిదియేయని గుర్తింపగలిగితివా?" యని లారెన్సు ప్రశ్నించెను.

"ఎంతయో కష్టముపైని గుర్తింపగలిగితిని. కాని నాకీమార్పు లన్నియు నతియందవికారముగ గన్పించుచున్నవి." అని ప్రతిమాట యందును నా యసూయ స్ఫురించునట్లు పలికితిని.

నామాటలవలన వారిముగ్గురికి గూడ కోపమువచ్చెను. ఒకరి ముఖము నొకరు చూచుకొనసాగిరి. ఫ్రాస్టుపతి యేమియో మాట్లాడ బోయి మరల నేలనో నాతో మాట్లాడకూడదని భీష్మించుకొనినట్లు పెదవులను బిగియించుకొని కూర్చుండెను. ఫ్లోరెన్సు నామూఢత్వము నకు కనికరించినట్లు పకపకినవ్వసాగెను. వారివైఖరి నాకు పరమ అసహ్యాకరముగనుండెను. ఇట్లుండుటకేదియో ప్రబలతరమగు కారణ ముండవలయునని నేనూహించితిని."

వారికెంత యిష్టము లేకపోయినను లారెన్సునకు తెలసినంతవరకు నాన్నగారి మరణమును గూర్చి కొన్ని వివరములను చెప్పించితిని. కాని లారెన్సునకు తెలసిన సమాచారము చాల తక్కువ. కూలికి పనిచేయు నౌకరులు తప్ప "నా" యను యభిమానము గలవారు యొక్కరు నాతని మరణకాలమునకు దగ్గరలేకుండిరని లారెన్సు చెప్పెను. ఆమాటలను వినునప్పుడంత గొప్పగ బ్రతికిన ధీరపురుషుడింత దీనముగ మరణింపవలసివచ్చెనుగదా యని పట్టలేనంత దుఃఖమువచ్చి యశ్రువు లేకధారగా నాచెక్కిళ్లపైనుండి క్రిందకు జారజొచ్చెను.

"తండ్రి తనకేమి యిచ్చెనో తెలుసుకొనవలయునని వచ్చినది కాబోలు నింతదూరము పాపము! అంతేనాలోర్నా? నిజముప్పు

కొనుము." అని యెకసక్కెములాడుచు ఫ్లోరెన్సు "మరణశాసనము జూచుటకేనా నీవు వచ్చినది?" అని ప్రశ్నించెను.

క్రూరనిశితఖడ్గఘాతమున హృదయకుహరమందొక పోటుపొడచి నట్లీ మాటలు దుర్భరమగు వేదనను గలిగించెను. అట్టి మాటలకు తగియుంటినని యెకాబోలును భగవంతుడు నాకిట్టిస్థితి దెచ్చిపెట్టెను! నిజముగ నేనిచటికివచ్చినది తండ్రి యేమిచ్చెనో కనుగొనుటకేగాని తండ్రి మరణించెనను విచారముచేత కాదు. వారిపుడా మరణశాసనము గురించి యేమిచెప్పినను, చెప్పకున్నను లారెన్సును యాచించి యైన కొంతసొమ్ము పుచ్చుకొనవలయునని నేనుద్దేశించితిని. ఎచటనైన సేవకావృత్తిలో ప్రవేశించి శరీరపోషణము చేసికొనుట కింకను తగినంత బలము చిక్కలేదు. పిల్లడి సంరక్షణమునకైన కొంతడబ్బు అవసర ముగ నుండెను.

"నే నెందుకు లేనిపోని యాశలను పెట్టుకొందును? మరణశాసన మందలి సంగతులన్నియు స్పష్టముగ గన్పించుచునె యున్నవి. ఇల్లు వాకిళ్లునన్నిటి నతడు నీకొప్పగించి యుండవలయును." అనుచు నేను ఫ్లోరెన్సు ముఖమునైన జూడనొల్లక లారెన్సుదెస జూచితిని.

నామాటలను, నావేషమును జూచి లారెన్సు జాలినొంది "మీ నాన్నగారటులనే చేసిరిగాని లోర్నా! నిన్నంత బాధపెట్టుట నాకిష్ట ములేదు. నీయందు దయగలిగియె ప్రవర్తించెదను. కాని నాకు కావ లయు ముఖ్యమైన వస్తువొకటి నీయొద్దనున్నది. దానిని నీవు దొంగి లించితివి. దాని నపహరించుటకు నీవొనరించిన తంత్రము వలన నా ప్రియురాలి ప్రాణము లంతరించునంతటి ఘోరస్థితి సంభవించెను. ఆ పటమును మరల నాకిచ్చివేయునెడల నీకు ప్రతిసంవత్సరము వేయి సవ రనులభరణమిచ్చుటయె గాక ప్రస్తుత మైదువందల సవరనులను బహు మానముగ గూడ నిచ్చెదను.

"అనగా ఫెర్ను ద్వీపపటము నిమ్మనియా నీయుద్దేశ్యము ?"

"ఆ, అదిగో నివెఱుగుదువు. దొంగా ! నాకు నీవ్యవహారమంతయు తెలిసిపోయెను."

ఆపటము నెట్లయిన సంపాదించి ఫెర్ను ద్వీపమునందలి బంగారు గను లెట్లయిన మరల సంపాదింపవలయునను అపూర్వపు జిగుప్సంతయు నతని ముఖమున మరల గన్పించుచుండెను. ఫ్రాస్టుసతియు నామె కుమార్తెయు గూడ నాతురతతో నాప్రత్యుత్తరమున కెదురుచూచు చుండిరి. దానినిబట్టి చూడగా నాయొద్దనుండి యాపటము నపహరించి నది యింకెవరోయై యుండవలయుననియు, వీరిలో నెవ్వరికవి పోయిన సంగతియె తెలియదనియు స్పష్టమగుచుండెను. లారెన్సు ప్రోత్సాహమున మెడ్లీ వాటి నపహరించెనని నేనింతవరకు నమ్ముచుంటిని. కాని వారింత యాతురత నొందుచున్నపుడాపటము నాయొద్ద లేదని చెప్పుట నాకిష్టము లేకపోయెను.

"నీదయకును, యుదారబుద్ధికిని కడుసంతోషము. అందుల కెంతే నియు కృతజ్ఞురాలను. కాని నేనాపటము నిచ్చుటమాత్రముకల్ల." అని దృఢముగ పలికితిని.

ఆమాటల కెంతయో కోపగించుకొని లారెన్సు తటాలునలేచి నిల చుండెను. అంతలో నతని భార్య యతనివారించి, చేయిపట్టుకొని, "ఆమెనటులనే విడువుడు. ఆడదానిని కొట్టిరను అపవాదు మనకేల ? త్వరలోనే బుద్ధికుదురునులెండి ! ఆబట్టలు—ఆ వేషముచూడండి ! ఆకాలి జోడు చూడండి ! — మరియొక నాలుగురోజు లూరకుండిన నామెయె "దేహీ" యని మన కాళ్లకడకు వచ్చును. అప్పుడు మనము చెప్పి నట్లెల్ల చేసితీరును ! తొందరపడకండి !! అని పలికెను.

కూటికిలేక నాటకములలో వేషములను వేసికొనుచు చివరకు నాయిల్లుచేరిన యీతుచ్ఛురాలు తోణకు, బెణకులేక నాదుర్భరదారి

ద్రవ్యస్థితినిగూర్చి యింత క్రూరముగ, నింతనిర్దాక్షిణ్యముగ బలికినందు లకు నాకు పట్టజాలని కోపమువచ్చెను. అప్పుడు ముప్పిరిగ నాహృదయ మాక్రోశించిన యీర్ష్య కోపాశోకములందేది యధికముగ నుండెనో చెప్పుటకష్టము.

ఈనటకురాలు కట్టిన ఆచీని చీనాంబర దుకూలములు మాయనాన్న గారి డబ్బుపెట్టికొనినవి. ఆమె మెడచుట్టు నలంకరించుకొనిన మూడు పేటల మంచిముత్యపుసరుల పేరు మాయమ్మది. ఈవేషకర్త్రి, యీ సాహసజీవి, పిచ్చిపట్టి తనస్వజ్ఞానము తానెఱుగని యనాధపురుషుని వంచించి తనవలల నిరికించుకొని యిచట మహారాణివలె సామ్రాజ్య మేలుచున్నది. ఈయాస్తికంతటికిని హక్కుదారాలనగు నాకిడుపుపుట్టిన పసికూన పాలులేక పరాయియింట మాడిపోవుచున్నది. ఇంతటిపాపిష్టి పరిస్థితు లెచటనైననుండునా? నేనేల నీసంగతుల నన్నిటిని న్యాయ వాదులతో చెప్పి తగిన ప్రతిక్రియ చేయరాదను అహంకారము బయలు దేరి నామనమును కలవరపెట్టసాగెను.

అంతట నాపూర్వపు మూర్ఖసాహసమంతయు మరల నాయందావే శింపగా నేనిట్లుపలికితిని. "ఏది! ఆమరణశాసనము నొక్కసారి చూపెట్టుడు. నాన్నగారేమి వ్రాసిరో చూచెదను" అని పలికితిని.

"అమ్మో! తప్పకుండ జూపించెదను. ప్రస్తుతమది న్యాయవాదుల యొద్దనున్నది. నాయొద్దనొక నమూనానైన నుంచుకొనలేదు. సాధ్య మైనంత త్వరలో నొకటి వ్రాయించి పంపెదనులెమ్ము." అని లారెన్సు చెప్పెను.

"పాపమామెకా మరుతులేమో కొంచెము చెప్పండి. వినవలెనని చాలా తొందరపడుచున్నట్లున్నది" అని ప్రాస్టుసతి నవ్వుచు నెకసక్క ములాడెను.

ఆమెమాటలకు లారెన్సుగూడా నవ్వెను. ఇంక ఫ్లోరెన్సు నవ్వన కంతమేలేదని వేరుగ చెప్పవలయునా? ఏదియొనాకు తెలియని మహా రహస్యము నొకదాని నెఱిగియుండుటవలన వారు నన్నిట్లు గేలిచేయు చున్నారని నేను గ్రహించితిని.

"సరియె. నీవుకోరినది చెప్పెదనువినుము లోర్నా! మీనాన్నగారు నీవివాహదినమం దారంభించిన నవ్వులాటలు చివరవరకుకూడ విడవ లేదు. ఇంక మూడువారములకు మరణించెదరనగా నతడొక మరణ శాసనమును వ్రాసెను. దానిలో తనయావదాస్తియు నీకువచ్చునట్లు వ్రాసిరి. తనసర్వస్వమును నీకిచ్చివేసిరి."

అట్లయిన నన్నీరీతిని వీరేల సక్కెములాడరనియు, నిజమేమియో తెలియకున్నదనియు, నేమియు నూహింపజాలక నివ్వెరపాటున నేను లారెన్సువైపు జూచుచుంటిని.

"కాని దానియందొక షరతును మాత్రమతడు విధించెను. సాధ్య ముకాని షరతులు పెట్టుటలో నతడు చాలా గట్టివాడని నీవెరుగుదువు గదా? అట్టి షరతులలో నొకదాని ననుసరించక పోవుటవల్లనే నీకీయాస్తినంతటిని చెందనీయకుండ చేసినసంగతి జ్ఞాపకమున్నదనుకొం యెదను! ఇప్పుడుగూడ నట్టిషరతునే విధించెను."

"అయ్యో, దైవమా! మరల లారెన్సును పెండ్లియాడమనెనా యేమి?" అని లోపలతలంచుకొని "సరియె జరిగినదాని కేమిచేసెదము ఇప్పుడతడు విధించిన షరతునుచెప్పుము. ఒకవేళ దానిని చెల్లింపగ నేమో?"

ఆమె మాటకు పెద్దనవ్వునవ్వి "నీవట్లు చేయలేవేమోయని నాకు సం యము. నేనిదివరకు చెప్పినట్లతడు యావదాస్తిని నీకిచ్చుచు మరణ శాసనము వ్రాసెను. కాని ఆయనమరణించిన ఆరుమాసములలోగ నీవొకబిడ్డను కనవలయునట. నీవట్లుచేయునెడల నాస్తి నిచ్చివేయుట నాకెట్టి యభ్యంతరమును లేదు.

వారు ముగ్గురది యొకవిధమైన వెకసక్కెపు చూపులతో నన్ను నీచముగ చూచుచుండిరి. ఎప్పుడుజూచినను పుట్టెడాముదము లుడుకుచున్నట్లు జూపట్టు ప్రాస్టుసతి ముఖముగూడ నెన్నియో ముడుతలు బడుచు, చిరునగవుతో వికసించుచుండెను. నాకు పూర్తిగా పరాభవము గలిగినదని భావించి వారతిక్రూరముగ నవ్వసాగిరి.

మానవమాత్రులెవ్వరు నట్టిపరిహాసమును భరింపజాలరు. నేనుగూడ అందులోనిదానినే యగుటవలన నాకుగూడ వారి దయావిహీనపు వికృతపరిహాసమును భరించుట కష్టమయ్యెను.

"అట్లు నవ్వెదరేమి? ఆపరతంత దుస్సాధ్యమైనది కాదే?" యని నేను నెమ్మదిగ నెట్టికోపభావమును గనబడనట్లు పలికితిని. "నాన్నగారు మరణించిన మూడవరోజుననె నాచంటికుఱ్ఱడు జననమొందెను. అందువలననె నేను నాన్నగారి దశాహమునకు రాజాలకపోతిని."

అంతట వారందరతియాశ్చర్యముతో ముఖములు తెల్లబోవుచుండ నేమియు మాట్లాడనేర కూరకుండిరి. కొన్ని నిముషములవరకు నేల సూదిపడినను వినిపించునంత నిశ్శబ్దముగ నుండెను.

కొంతసేపటికి ప్రాస్టుసతి కఠినస్వరముతో "అది కేవలమసత్యము. ఆ స్త్రీరావలెనని యామె ఎంతటియబద్ధములునైన నాడగలదు. ఎవరి పిల్లనైన నిపుడు తెచ్చి తనపిల్లయెయని నటించును........" అని యేమియో బలుకుచుండగా నే నడ్డమువచ్చి,

"నేనంత బాధపడవలసిన యవసరములేదు. ఆపిల్లడు నాకడుపున బుట్టినవాడే యని చెప్పుటకు చాలమంది సాక్షులు, నిదర్శనములు గలవు. నాన్నగారికి గూడ నిట్లు జరుగునని తెలిసియె యుండును."

"సంవత్సర మీలోపున నీభర్త యీనగరమున లేడే?" అని ఫ్రాస్టు నన్నీసడించి పలికెను.

"లేకేమి! నీకు తెలియదనిన నమ్మజాలను కాని నాభర్త నెనిమిది మాసములక్రిందట మేమీయూర జూచినట్లు నీకుమార్తెయె ఋజువు పలుకగలదు. నీకీసరికి చెప్పియె యుండును."

"అట్లయిన నాడు స్మశానవాటికలో నీవు చూచినది యెవరిశవము?"

"అది నాభర్త సోదరునిదిగాని నాభర్త దెంతమాత్రము కాదు. నాభర్తపేరు ఎడ్వర్డుగ్రాంటు. ఆసంగతి లారెన్సు నడుగుము."

"పాపము! లారెన్సు యుత్సాహమంతయు నెచట నింకిపోయెనో తెలియదు. అతని బిక్కమొగము జూచి నాకు చాల జాలికలిగినది. నన్ను పరాభవింపబోయి తామే పరాభవమొందిన సంగతి నతడు గ్రహించినట్లుండెను. అయిన పరాభవము నంగీకరించుటకు మానవుని దురహంకారము వేగము సమ్మతింపజాలదు గావున నతడు "అసందర్భము—తెలివి తక్కువ—ఒకవేళ నీకొకశిశు వుద్భవించినను అది గ్రాంటునకు జన్మించినదే గాని—"

"నెడ్డుగ్రాంటు నిజముగ నాభర్తయె యని నీవు నమ్మకపోవచ్చును. తనకు నష్టము వచ్చునేమోయని ఫ్లోరెన్సు నిజముచెప్పక పోవచ్చును. ఇప్పటిస్థితిలో నేనాసంగతి ఋజువుచేయగలనో లేనో చెప్పజాలను. అయినను నీచాతినీచతరములగు నీయనుమానములు నిజమే యనుకొని నను నాకు పుట్టినశిశువు నెడ్డుభేజునకు జన్మించి యుండవలెనని నాన్నగారు వీలులో వ్రాసియుండిరా యేమి?"

ఇంతవరకు మాసంభాషణ నతిజాగ్రత్తగ వినుచు మర్చినను ఒక్కమాటనైన నాడకూరకుండెను. కొంతసేపటివరకామె తల్లిమాటలతో నేకీభవించి నేనబద్ధమాడుచున్నానని యెంచెను. ఇంతసులభముగ నింత యాస్తి వచ్చుచున్నపుడీమాత్రపు కృత్రిమమునకు సాహసింపకపోనని

12

యామె భావించెను. కాని నేను నిజమునే పల్కుచున్నటు లామె గ్రహించెను కాబోలును నాతోనేమియు మాట్లాడక లారెన్సువైపు తిరిగి శిరోపార్శ్వము లదరునట్లు ప్రచండకోపమున నిట్లు గద్దరించెను.

అంతయు నైన వెనుక—యీ ద్రాగుబోతు రాక్షసికింతవరకు సహాయము చేసినపిమ్మట వీని దైరితంత్రము లన్నిటి కంగీకరించి యీ నీచుని వివాహము గూడ చేసికొనిన పిమ్మట యిప్పుడు నన్ను బురద గుంటలో పడవైతురా ? నేనిది భరింపజాలను. భరింపనొల్లనుగాక భరింపనొల్లను."

ఆమెకోప మతిదారుణముగ నుండెను. చూచువారి కామెముఖము భయోద్రేకము గలిగించుచుండెను. పెదవుల నప్పళించి కొఱకుచు మాట్లాడుటలో నదియెట్లు వచ్చెనోగాని యామె గడ్డముక్రింద నొక రక్తబిందువు జారెను. ఆనల్లనికంటిగ్రుడ్లలో అగ్నికణములు ప్రవేశించి ప్రక్కనున్న తెల్లపాపలలోపలికి వ్యాపించుచుండెను. ఆమె పిడికెళ్ల నతి తీవ్రముగ బిగియబట్టి నాముఖముదెస చూపింప నారంభించెను.

ఏస్త్రీ హృదయమునందైన దారుణ నరహత్యాసంకల్ప మాక్రోశించుటను నేనెప్పుడైన జూచియుండిన దాదినమట్టి సంకల్పము ఘోరెన్సు హృదయమందు చూచితిననియె చెప్పవలయును.

ఆభయంకర విగ్రహమును గాంచిన పిమ్మట నీరాక్షసిబారినుండి నాపిల్లవానిని నన్ను నేరీతిని సంరక్షించుకొనవచ్చునను భయ మాక్రోశించి శరీరమాపాదమస్తకము కంపింపసాగెను.

భార్యయాడిన నిష్ఠురోక్తుల నాలకించియు నాపైగినియనేరక లారెన్సు వారితో నేకీభవించి నన్నుమరింత వేధింపసాగెను. వారందరు నపుడదియొపనిగ మారుమాటాడని నామస్తకమంతటిని నిష్ఠురోక్త బాణాఘాత ప్రపూరితముజేసిరి. వీరిబారినెట్లు తప్పించుకొననగునో తోచక ప్రాణములను బిడికిటబట్టి కూర్చుంటిని.

కొంత సేపటికి ఫ్రాస్టుసతి మెల్లనలేచి యావలకు జారిపోయెను. మరి రెండు నిముషములలోనే యామెనవ్వుకొనుచు మరలలోపల ప్రవేశించెను.

ఒడలు తెలియని కోపమున నింకను కలుషవాక్య పరంపరనాపై గురుపించుచుండిన ఆదంపతుల నామెవారించి "సరియె మీరిద్దరిల్లల కుతుకలు చెడగొట్టుకొనియెదరు? తనవాదన బుజువైనపిమ్మటగదా ఫేజునకీయాస్తి చెందవలసియున్నది! అంతవరకామె మనయింటనె యుండనిండు. యీలోపల నెవరిచేతనైన నామె యాశిశువునిచటికి దెప్పించి మనకు చూపించగలదు. అప్పుడు మాట్లాడుకొనవచ్చును. ఇప్పుడెందుకీయల్లరి?" యనుచు నాదెసతిరిగి "ఎక్కడనున్నాడమ్మా! నీపిల్లవాడు?" అని శాంతముగ బలికెను.

"పిల్లవానిని తెప్పించువరకు నన్నిచట బంధింపవలయుననియా నీయుద్దేశము?" అని బెంగచే నోటమాట రాకున్నను ఎటులనో సాహసించి వారి నదలింపజూచితిని.

"నీయిష్టము. నీవెట్లు భావించినను భావింపవచ్చును."

లారెన్సు పెదవులను కొఱికికొనుచు నావైపుచూచుట మానుకొనియెను.

"అనగా మీరు నన్ను చంపవలయుననియె యుద్దేశించుచున్నారా?" ఆమాటకు లారెన్సొక విషపునవ్వును నవ్వెను.

"ఒకరిదారి కడ్డమువచ్చు నింకొకరి కెప్పుడు నిట్టి యపాయమె గలుగుచుండును. ఏది నీవు కష్టపడి కనిన సుకుమారపుబిడ్డ?" అని ఫ్రాస్టుసతి వెగటుగ ప్రశ్నించెను.

"నే నిపుడు చెప్పదలచుకొనలేదు. సరికదా, మీ రెవ్వరు నా కడ్డము వచ్చినను—" అనుచు వాక్యము నింకను ముగింపకనే లేచి ముందున కడుగు వేసితిని.

సరి మరి చెప్పుట కేమున్నది? వా రడ్డము వచ్చిరి. నేను బెంగ పెట్టుకొనినంతయూ నైనది. మృత్యుదేవత యపరావతారమువలె నున్న ఆ జర్మను నౌఖరు తటాలున వచ్చి నా కడ్డముగా నిలచి లోనికి బొమ్మని యాజ్ఞాపించెను. నేను కేక వేయుటకు ప్రయత్నించు సంగతిని కనిపెట్టి యతఁ డమాంతముగ పట్టుకొని నోట నొక గుడ్డ గ్రుక్కి లోపలి కీడ్చుకొని పోయెను. ఆ ముష్కరుని పట్టు విడిపించుకొనుటకు సగము చచ్చి శవమువలె నున్న నాకు శక్తి లేకుండెను. అయిన నూరకుండ లేదు. కాళ్ల చేతుల నెంతయో పెనగులాడితిని. కాని కార్యము లేక పోయెను. చివరకా పెనగులాడిన యాయాసముచేతనో లేక నా కంఠము నదిమిపట్టుకొనిన నా ముష్కరదానవుని హస్తకాఠిన్యమువలననో గాని అయిదారు నిముషములలో నేను స్మృతి తప్పి నేల పడినట్లయ్యెను.

తెలివి వచ్చి చూచుసరికి చివర యంతస్థునం దొక మూలగదిలో నొక కుక్కిమంచముమీఁద పడియుంటిని. ఆ గది యెవరిదో నౌఖరులదని దాని రూపు చెప్పుచుండెను. ఆ కుక్కిమంచము తప్ప దానియం దొక కుర్చీగాని పరుపుగాని కన్పించకుండెను. సకల సౌఖ్యములతో తుల తూగుచుండిన మేము మా నౌఖరుల నింత దుర్భరావస్థయం దుంచు చుంటిమి గదా యని నా కప్పుడు సిగ్గు గలిగెను. ఆ గదియం దుండు వారు చలికాచుకొనుట కెక్కడ బొగ్గులను, కట్టెలను వెచ్చించెదరో యని యెంచి కాబోలు నా గదియందలి నేలకుంపటి నెవరో యిటుక లతో కప్పించిరి.

సగము నలిగిపోయి పటుకుపటుకు మనుచుండిన యా కుక్కిమంచము మీఁద నొక మూలకు చుట్టచుట్టి యొక గడ్డిపరు పుండెను. అదిఅంతయు ముడుతలుపడి యనుపయోగకరముగ నుండెను. దానివంటిదె తలదిం డొకటి దానిక్రింద నమర్చియుండెను. తలదిండు గూడ గడ్డితో చేసి నట్లుండెను. పరుపులో నున్న దుప్పటి మెతగబట్టి కంపుకొట్టుచుండెను.

ఆగది కొక్కటియె కిటికి. విద్యుద్దీపమును వెలిగించు కొనజాలకుండ నెవరో దాని బల్బు నపహరించిరి. చీకటిపడిన పిమ్మట నాగదిలో వెలుగు నిచ్చుట కేమియు గన్పించకుండెను. గది నలుదిక్కుల నతి జాగ్రత్తగ పరిశీలించి చూచునప్పటి కొకమూల చిన్న క్రొవ్వవత్తి ముక్క యుండెను.

తలుపులాగి చూడగ పైకి తాళము వేసినట్లుండెను. నా మొఱకు తనమునకు శిక్షింప నెంచి కాబోలును వారు నన్నీ కొట్టులో పెట్టిరని యనుకొంటిని. తినుటకాహారముగాని, త్రాగుటకు పానీయముగాని కన్పించకుండెను. రాత్రి సమీపించుచున్నది నేనిల్లు విడచిపెట్టి యింత కాలమరిగినది. ఈ లోపల నా పసిపిల్లడెన్ని సారులు నా కొఱకేడ్చెనో యని మనసు సందలజిడి గలిగెను. నే నెచటి కరిగితినో లవుజాయిగాని రోజు మేరీగాని తెలిసికొనజాలరు. వారితో నేనేమియు జెప్పకుండనిటు వచ్చితిని. వారిని నమ్మి యేమి చెప్పుటకును నాకు ధైర్యము చాల కుండెను.

ఆరాత్రి నేననుభవించిన యమయాతనను గూర్చి యేమి వ్రాయుదమన్నను నాకిప్పుడు గూడ నొడలు కంపమెత్తుచున్నది.

క్రూరులును, దయావిహీనులును, ధనకాంక్షావివశులును, న్యాయాన్యాయ విచక్షణావిదూరులును నన్ను జంపియైన నాయాస్తి నపహరింప నిశ్చయించుకొనినవారునగు నిద్దరుస్త్రీలును వారిచేతులలోని కీలుబొమ్మవలెనాడు కోతియు, పాడుకోతియునై మెలగుచున్న పిచ్చి యువకుడును నావిధి తమకనుకూలముగానుండు రీతినిర్ణయించుచున్నారనుసంగతి నాకనుక్షణము జ్ఞాపకమునకు వచ్చుచుండెను. వారిచేతులలో నాక్రూరజర్మనుడను యమసాధన మొకటియున్నది. వారికిష్టమైన నెంతటిక్రూరకర్మమునైన వారనాయాసముగ చేయింపగలరు.

కండ్లారజేయుచు నన్నింతలుచేయుట కంగీకరించుచున్నను లారెన్సు స్థితిగతులను తలచునపుడెల్ల నాకుదుఃఖముకలుగుచుండెను. అతని యున్మాదరోగము నానాటికిపెరిగిపోవుచుండెను. ఈనెట్టికుదిరి యితడెట్లు బయటపడునోయని యాలోచించుచుండగా నాయిబ్బందిగడచి నేనిపుడెట్లు బయటపడగలుగుదునను విచారముదానికంటె ప్రబలతరమయి నన్ను వేధింపసాగెను. నాప్రాణాపాయస్థితియు, నాపిల్లవాని భవిష్యజీవితసమస్యయు నన్నుకలవరపెట్ట నారంభించెను.

చలి యపరిమితముగ నుండెను. కాచుకొనుటకు నిప్పుగాని కప్పుకొనుటకు వస్త్రముగాని లేనందున శరీరమంతయు కొయ్యగట్టుకొని పోవుచుండెను. ప్రొద్దున నిల్లువిడచిపెట్టినదాదిగ నొక గృక్కెడు మంచినీళ్లైన త్రాగనందున దాహ మగ్గలమగుచుండెను. ఆకటిచిచ్చు దానికంటె మరింత యధికముగ బాధించుచుండెను. ప్రాణములు నిలుచునో నిలవవో యను విషమావస్థలో నీయింద్రియముల చపలత్వమున

కెక్కడ నవకాశముండెనో నాకు తెలియకుండెను. క్రమక్రమమున ప్రాణభయ మధికమయి యీక్రూర దానవులవలన నింకెట్టి దారుణ బాధల ననుభవింపవలసియున్నదో యని మనసు డోలాందోళనమై పరిపరివిధముల పరితపింపజొచ్చెను.

దూరమునందున్న రోడ్లపై నడచు బండ్లచప్పుడు తప్ప రాత్రి మరి యేధ్వనియు విన్పించకుండెను. ఆధ్వనియైనను కొంతసేపటి కాగిపోయి నిర్మానుష్యనిశీథ నిశ్శబ్దమున లీనమైపోయెను. సకల రోగముల కునికి పట్టై అసహ్యాకరముగ కన్పించుచున్న ఆమంచముపై పండుకొనుటకు నామనస్సంగీకరింపకుండెను. కాని యేమిచేయను? చలిబాధ నానాజూకు తనము నావలకు పారదోలెను. అచట దొరకిన వస్తువులన్నిటిని, బాగుగనున్నను భ్రష్టముగనున్నను, నుపయోగింపక తీరినదికాదు. అయినను చలియాగుటలేదు. యీబాధలకు తోడుగ నికముందు జరుగబోవు కార్యములను గూర్చి మనస్సనేకవిధముల తలపోయుచు నన్ను మరింత వేధించుచుండెను. ఆగదియందుండిన క్రొవ్వువత్తి రెండు గంటలుండిన తరువాత నారిపోయెను. తెల్లవారువరకు నొక్కర్తె నా చీకటి గాఢాంధకారమున సమిత భయకంపములతో నుండవలసి వచ్చెను.

తెల్లవారు సమయమున నాకొక కునుకుపట్టినట్లయ్యెను. అంతలో గుమ్మమునం దడుగులచప్పుడై మెలకువవచ్చెను. లేచి యెవరివా మాటలని యాలకించునప్పటికి ప్రాస్టుసతి యచటికివచ్చి యేమియో పలుకుచున్నట్లు గ్రహించితిని.

“మహారాజశ్రీ భేజుసతిగారింకను మేలుకొనియె యున్నారు కాబోలును?”

“అవును మీధర్మమాయని రాత్రి తెల్లవార్లును.”

మీాపిల్లవాని నెచటనుంచిరో యిప్పుడైన ననుగ్రహించి చెప్ప గలరా ?"

"చెప్పను. నాకంఠములో జీవనమున్నంతవరకా పనిజరుగదు."

"సరియె. అంతవరకిచటనె యుండుడు. మరల రేపటియుదయమున తమదర్శనార్థము వచ్చెదను. యీాలోపల బాగుగ మంచిచెడ్డలనాలో చించుకొని నిష్కారణముగ నుసురుల విడచుట మంచిదికాదని గ్రహింప గలరు."

"అంతవరకు వచ్చునపుడు చూచుకొందము లెండు."

"ఈబింకము మరియొకటి రెండుగడియలు మాత్రముండును. తరు వాత నీయంతట నీవేచెప్పగలవు."

అనుచు నామె నాచోటుబాసిపోయెను. అట్లయిన వారింతవేగము నన్ను జంపరు. ఆకలిదప్పులకాధారము లేకుండజేసి, కొన్నాళ్లు హింసించి అస్వాభావికముగ చచ్చునట్లు చేసెదరు. ఇంక మరి యిరు వదినాలుగు గంటలవరకు తినుటకాహారముగాని, త్రాగుటకు నీళ్లు గాని, లేకుండ కఠినోపవాసము చేయవలసియున్నదా ? ఇప్పటికే శరీరమంతయు శుష్కించి నిస్సత్తువవలన మూర్ఛవచ్చునట్లుండెను. నన్నింత బాధపెట్టుచున్నసంగతి లారెన్సునకు తెలియునో తెలియదో? తెలియకేమి? తెలిసియె యూరకుండెనా? డబ్బుకాంక్ష యాత్మబం ధువులందుగూడనింత నిష్కఠినభావము గలిగింపగలదా? ఆహా లోభదేవత! నీప్రతిభ నిరంకుశము!

దినమంతయు జ్వరమువచ్చినట్టుండి శరీరముపై స్మృతియె లేకుండ నుండెను. మనశ్శరీరములు రెండును పూర్తిగ డస్సిపోవుటవలన మెదడు సొమ్మసిల్లి మరేపనియు చేయలేకుండెను. ఈరాత్రి మరలనెట్లు గడచు నను భయముతప్ప మనసునందింకొక యాలోచనయె లేకపోయెను.

మరల చీకటి పడుచుండుటనుజూచి కాలుసేతుల నెటులనో కష్టముపై కూడజేసికొని నేల మోకరించి దైవమును ప్రార్థింపనారంభించితిని. నాసంగతి యేమైనను సరియెగాని, దైవమా! నాశిశువునుమాత్ర మెటులైన గాపాడుమని పరిపరివిధముల ప్రార్థించితిని. ఆకాళ్లమీద నట్లు మోకరించియుండగనే తెలివి తప్పిపోయెను. అట్లు మోకాళ్లపై నుండి నిద్రించుట కెవరికైన శక్యమగునెడల కొంతసేపు నిదురించితినని తలంపవచ్చును.

తిరిగి తెలివివచ్చి చూచుసరికి యర్ధరాత్రి సమయమయ్యెను. ఎవరో మెల్లగ దొంగవలె తలుపు తాళము తీయుచున్నట్లుండెను.

ఆచప్పుడువినగనే నాగుండెలెండిపోయినవి. బోనులోపడిన యెలుకవలె చప్పుడుచేయకుండ నొకమూలకరిగి, కాలు సేతులదగ్గర చేర్చుకొని వంగివంగికూర్చుంటిని. తలుపు తెరచుకొని లోనికివచ్చు వారికి కన్పించకుండ తప్పించుకొనవలయునని నాయుద్దేశము. ఇంతలో తలుపుత్రోసిన చప్పుడయ్యెను. అటుప్రక్క జూచులోపల గది యంతట దీపపుకాంతి వ్యాపించి కన్నులు మిఱుమిట్లు గొల్పుచుండెను. ఆదీపమును పట్టుకొనిన మానుషాకారమును జూచిన వెంటనే భయోద్రేకమున డెంద మెంతసందడించెనో యాభగవంతునకె యెరుక. వెలుగుచూచిన వెంటనే బలహీనతవలన గాబోలు కన్నులు మూతబడియెను. రెండునిముషములలో మరల తలుపుమూతబడినట్లు చప్పుడయ్యెను. మెల్లమెల్లన కన్నులువిప్పి చూచునప్పటికవి క్రమక్రమమున దీపపుకాంతి కలవడి మూతవడుటమానినవి. అంతట నల్లని గౌను తొడగికొని యొకయాడుమనిషి లోపలప్రవేశించెనని గ్రహింపగలిగితిని. ఆమెముఖము విచారగ్రస్థముగ నున్నట్లుండెను. పాదములు దళముగనుండెను. వాటికి స్టాకింగులుగాని, జోళ్లుగాని లేనందున తెల్లగగన్పించుచుండెను.

నాకు జ్ఞానము వచ్చినప్పటినుండియు నీమె మాయింట దాసిగా నుండెడిది. ఆపె అసలు పేరు ల్యూసీ. అయినను నేనుమాత్రమామెను "ట్వీసీ" యని పిలుచుచుంటిని. తక్కినపనివారామెనెప్పుడు నెగతాళి చేయుచుండిరి. కాని ఆపె మంచిపనికత్తె. మరియొకచోటి కరుగ వలయునను యుద్దేశ్యము ఆమెకెప్పుడును లేకుండెను. ల్యూసీతప్ప తక్కిన నౌకరులందరీయింటినుండి యావలికరిగిరని తరువాత నాకు తెలసెను. తెలివి తేటలంతగా లేనిదగుటవలనను, ఒడలువంచి బాగుగా కష్టపడి పనిచేయునదియగుటవలనను, ఆమెనుగూడ పనిలోనుండి తప్పింపవలయునంత యావశ్యకత వారికి గన్పించకపోయియుండవచ్చును.

ఆమె చేతిలో క్రొవ్వువత్తి యొక్కటియెగాక పాలకూజాగూడ నుండెను. రెండవచేతియందొక రొట్టెముక్క యుండెను.

లోపలమనిషి సంచారమేమియు గానక ఆమె భయకంపితయై దిగులుపడి దిక్కులుచూడనారంభించెను. పాపము! ఆఘాతకులు నన్నిపాటికేమిచేసిరోయని యామె హడలిపోయియుండును. అందువలన నింక తడవు మసలరాదని యెంచి నేను నా రహస్య ప్రదేశమునుండి మెల్లగ నీవలకివచ్చితిని.

"అయ్యో! అమ్మా! లోర్నా! నాతల్లినీవేనమ్మా! నేను మొదట నమ్మలేదుగాని తరువాతనేమో చూతమని వచ్చితిని. అయ్యో అమ్మా యెంతనీరసించి పోయినావె తల్లీ? ఎంతపనిచేశారమ్మా ఆ రాక్షసులు!" అనుచు నామె శోకసంతసాశ్చర్యములతో బలికెను. ఆమె కన్ను లశ్రుపూరితలై చినుకులు క్రిందికి జారుచుండెను. ఆమె ముఖమప్పుడెంతయో దయార్ద్రమై చాల అందముగ గన్పించెను. మూర్తీభవించిన కారుణ్యదేవతయె యిట్లువచ్చెననియు నాప్రార్థన నాలకించి దానికి ప్రత్యుత్తరముగ నామె నా భగవంతుడిచటికి పంపియుండ వచ్చుననియు నేను విశ్వసించితిని.

ఆ పాలకూజా పట్టుకొనునప్పుడు నీరసమువలన చేతులుగడగడ వణక సాగెను. పాలు త్రాగునప్పుడవి తొణకిపోయి క్రిందికి ధారకట్టి ప్రవహింప నారంభించెను. రొట్టెను పెద్దపెద్ద ముక్కలుగ విరచి తొందరతొందరగ నోటవేసుకొన నారంభించితిని. ఆకలితొందరలో నది కుత్తుకకడ్డము పడకుండ జాగ్రత్తగ మ్రింగవలసి వచ్చెను.

క్షుద్బాధనట్లు శాంతింపజేయుచుండు సమయమున ల్యూసీనేనిచట నున్న సంగతి తనకెట్లు తెలసినదియు చెప్పసాగెను. నేనిప్పుడున్నది యామెగదియేనట! అనగా నాకిప్పుడు కారాగృహముగ దోచినగది యామె కనుదినము నివసించు ప్రదేశముగ నుండెనట! తానెన్నియో సంవత్సరముల నుండియు కాపురమున్న ఆగదిలోనుండి యొకనాడాక స్మికముగ నాజర్మను నౌకరు యామె నావలకు పొమ్మనెనట! ఎంతచెప్పి నను తాను వినకుండుటజూచి యా క్రూరుడామెను చేయిపట్టుకొని యావలికీడ్చివైచెనట. పిమ్మట నామె యచటనే నిలచియున్నను వారే మియుపాటింపక నన్నిచట బందీకృతనుగజేసి యెట్లయిన వశ్యము చేసి కొనవలయునని యాలోచించుకొనుచుండిరట! నన్నెట్లయిన లొంగ జేసినయెడల గొప్ప పారితోషిక మిచ్చెదనని ఫ్రాస్టుసతి వాని కాశపెట్టె నట! రేపటిమధ్యాహ్నమునకు ప్రాణమువిసిగి నేను వారెట్లు చెప్పిన నట్లు చేయుదునని వారనుకొను చుండిరట!

వారీ కుట్రనంతటినేల పన్నుచున్నారో పాపమా ల్యూసీ యెరుగదు. నన్నీగదిలో ఖైదీగానుంచి నీళ్లుగాని, పాలుగాని యీయక నోరెండ గట్టి బాధించుచున్నారని మాత్రమామె గ్రహించెనట. ఎందుకేపనిని చేయుచున్నారో ఆమెకేమియు బోధపడలేదు. ఎందుకు చేయు చున్నను, తాను చిన్నప్పటినుండియు పెంచిన గారాబమువలన నన్నిట్లు బాధించుట ఆమెకు కష్టముగదోచెను. ఆ గదిలో నిదివరకు తాను నివ సించుచుండుటవలన దాని తాళము చెవులలో నొకటి వారికీయగా

నింకొకటి తన యొద్దనే యుండిపోయెనట. ఇంటి యజమానురాలిగ నాన్నగారామెను నియమించిన వెంటనే ప్రాస్టుసతి యందలి తాళము లను తీసికొనిపోయెను. ల్యూసీవద్ద రెండు తాళములున్న సంగతి నామె యెరుగనందున నొక తాళముచెవి తీసికొని యూరకుండెను. ఎప్పుడవసరము వచ్చినను పనికివచ్చునుగదాయని ల్యూసీదానిని జాగ్రత్తగదాచెను. ఇప్పుడా తాళము తన యొద్దనున్న సంగతి జ్ఞాపకము వచ్చి తానిట్లు వచ్చెనట! నన్నీ చెరనుండి యెట్లయిన తప్పింపవలయు నని యామె యుద్దేశ్యము.

కొంతసేపైన పిమ్మట నామె యతివినయముగ "ఎవరును చూడక మునుపే తప్పించుకొని పోవుటమంచిది. కాదమ్మాలోర్నా ?" అని పలికెను.

చివరకా ల్యూసీవలననే నేనీచెరనుండి విముక్తిగాంచితిని. అప్పుడు వేకువజామున నాలుగు గంటలయ్యెను. ఇంటిలోని వారందరును గాఢ నిద్రలో నిమగ్నులై యుండిరి.

పాపమేమియు నెరుగని ముదుసలి నారక్షణ కొరకెన్ని జిత్తుల నేర్చినది ? ఆమెనీరాత్రియందింత శ్రమపడుటకు ప్రోత్సహించిన ఆ ప్రేమాతిశయము నేమని వర్ణింపవచ్చును ? మేమాగదిని విడచి యావలకు వచ్చిన పిమ్మట నామె ఆ తాళముచెవిని నాచేతికిచ్చి బయట నెచ్చటనో పారవేయుమనిచెప్పెను. అది తనయొద్దనే యుండునెడల వారు తన పెట్టెలను బట్టలను వెదకునపుడీది కనిపించి వారామెను బాధించెదరని భయమట ! పాపము !!

మేము మెట్లుదిగిన వెంటనే యామెచేతిలోనున్న క్రొవ్వువత్తి దీపమునార్పి తన నూతన నివాసమగు పశువుల శాలయందలి అట్టల గుడిసెలోని కరిగెను.

నే నెక్కడ పారిపోవుదునో యను సందేహామేమియు లేక యింటి లోని వారందరును నిద్రించుచున్నారను మాటనిజమేనా?

నే నేవిధమునను గూడ తప్పించుకొనజాలనని వారికి పరిపూర్ణవిశ్వాసముండెను. అందువలన నెట్టియనుమానమును లేక హాయిగ నిద్రించుచుండిరి. దానికి సందేహములేదు. కాని యెవరో ప్రక్కపై నిటునటు కదలుచున్నట్లు మాత్రము చప్పుడగుచుండెను. ఆ చప్పుడెచటి నుండి వినిపించుచున్నదో యని నే నటునిటు చూచుచుండగనే ముంగట నున్న గదులలో నొకదాని తలుపు నాకస్మికముగ నెవరో తెరచిరి. లోపలి విద్యుద్దీపపుకాంతి బయట నంతటను వ్యాపించి పట్టపగటివలె నన్నిటిని పట్టి యొప్పగించునట్లు కన్పరచుచుండెను. వారెవరో నన్ను జూచియె యుందురని యెంచి నిరాశనై భయముతో పెద్దకేక వేసితిని. కాని దైవవశమున నా కేక నాకుతుకలోనే యిమిడిపోయెను.

వెంటనే తెలివితెచ్చుకొని ఆ ప్రక్కనేయున్న యొక పొదచాటున డాగియుంటిని. ఆ తలుపు తెరచినది లారెన్సు. రాత్రి చొక్కావేసికొని ఆకుజోళ్లను తొడగియుండెను.

అతడు బైటి యరుగుమీాదికి వచ్చి అటునిటు చూచి "ఏమిటిది చెపుమా! ఏదియో చప్పుడైనట్లు వినిపించినది! "అని యనుకొనుచు మరల నూరకుండెను. పిమ్మట లోపలికరిగి సిగరెట్టు కాల్చుచుండెను. తలుపునతడు మూసినను దాని సందులలోనుండి వెలుగు కనిపించుచుండెను. అందువలన నతడింకను నిద్రపోలేదని యనుకొంటిని. ఆ వెలుగట్లొక యరగంటవరకు కన్పించుచుండుట వలన నే నంతసేపు నచటనే డాగియుంటిని. వెలుఁగు గల్పించుటయె గాక లారెన్సు తనలో తానేమియో మాట్లాడుకొనుచుండినట్లు గూడ నాకు వినుపించెను. నన్ను బలవంతముగ వారుపెట్టుచున్న బాధల కతడోర్వజాలక విచారించుచుండెనేమో? అందువలననె నిద్రపట్టకపోయి యుండవచ్చును.

కొంత సేపైన పిమ్మట మరియొక తలుపు నెవరో మరియొకచోట తట్టినట్లు చప్పుడయ్యెను. క్రొత్తగా కొని తెచ్చిన కుక్కను కసరునట్లు ఫ్లోరెన్సు లారెన్సు నుద్దేశించియె కానోపు నిట్లు పలికెను. "ఏమిటీ రాత్రివేళ నీపని? వెంటనే పోయి పండుకొనుము. లేకున్న నౌఖరీ వానిచేత బుద్ధిచెప్పించెదను."

వెంటనే దీపమారిపోయెను. ఆ మాటలకేమియు ప్రత్యుత్తరము వినిపించలేదు. ఇంక నే నెంతమాత్ర మాలసింపగూడ దని గ్రహించి తిని. మరియొక గంటలో నందరు మేలుకొందురు. అప్పుడు తప్పించు కొనుటకష్టము. గనుక నిప్పుడే తప్పించుకొనవలయును. ఈ సరికప్పుడే తప్పించుకొని యావలికరిగి యుందునని యా ముదుసలి తలంచుచుం డును.

లారెన్సు నిద్రపట్టక నటునిటు దొర్లుచు ముక్కుచుండుట నాకు వినిపించుచుండెను. నేను మెల్లగ వీధిగుమ్మముదెస దారితీసితిని. అడుగు తీసి యడుగిడునంతలో నేమిపిడుగు పడునో యనునంత బెంగతో క్షణ మొక యుగముగ బాధపడుచు మెల్లిగ వీధిగుమ్మము చేరుకొంటిని. తలుపునకు పూర్వపుగడియలు మాత్రమేగాక మరికొన్ని క్రొత్తగడియ లుండెను.

నేనెంత ప్రయత్నించినను అవి విడకుండెను. తుదకెటులనో పెద్ద గడియతప్ప తక్కిన యన్నిటిని విదలించితిని. అ పెద్దగడియనుగూడ నెంతయో ప్రయాసముమీద విదలించితిని. కాని అది విడిపోవునపుడు పిడుగు పడినట్లేదియో పెద్ద చప్పుడయ్యెను. ఆ ధ్వని చచ్చినవారినైన మేలుకొలుపునట్లుండ నిక నిద్రబోవుచున్నవారి సంగతి చెప్పుటకేము న్నది! అచట నేదియో విద్యుత్తంత్రముతో నొక గంట నేర్పాటు చేయుటవలన నీచప్పుడు కలిగియుండ వచ్చునని తరువాత నూహించితిని. దొంగలు తలుపు తీయునపు డందరిని మేలుకొలుపుట కట్టి గంటల

నచ్చటచట నేర్పరచుచుందురని నేనిదివరకెచటనో చదివి యుంటిని. అంతియగాక లారెన్సునకిప్పుడు పిచ్చిపట్టి యుండుటవలన నాతడెవరికిని తెలియకుండ నావలికెక్కడ నరుగునో యను నుద్దేశ్యమున దానినమర్చినను, నమర్చియుందురు.

తరువాతగలిగిన యూహలెటులుండినను తలవనితలంపుగ కలిగిన ఆధ్వనికిమాత్రము నాకు మతిభ్రమణముకలిగి మూర్ఛవచ్చునట్లయ్యెను. మూర్ఛయే వచ్చియుండినయెడల నీపైకథ వ్రాయనవసరము లేకనేపోయెడిది. చప్పుడువినినంతనే మేడమీదివారందరును తలుపులను తీసికొని క్రిందికివచ్చునంతలో నేను ల్యూసీకుటీరము కడకు పరుగెత్తితిని. అంతలో ల్యూసీ ఆధ్వనియర్థమును గ్రహించి బైటికివచ్చునంతలో నేనచటికరుగుటనుగాంచి తటాలున లోనికి తీసికుపోయి తలుపువేసెను. అచట నంతయు చిమ్మచీకటిగానుండెను. ఆయింటియందెచ్చట నిప్పులేనందున చలిబాధ యధికముగానుండెను. పాపమాచీకటిలో ల్యూసీ నేలపై నొకచాప పరుచుకొని దానిమీద పరుండెను, నేను లోనికరుగునంతనే యచటి చీపుళ్లకట్టల నవతలకు త్రోసి యచటనేర్పరచిన యట్టతలుపు నొకదానినామె తెరచెను. ఆయరలో నావలిగోడలోపల నొకబీరువాగూడుండెను. ఆగూటియందొక మనిషి వంగికూర్చుండుటకు తగినంత స్థలముండెను. ఆగూటియందు నన్ను ప్రవేశపెట్టి గూటితలుపులను, ఆయరతలుపులను వేసుకొని చీపుళ్లకట్టను అందుంచెను. మరల యథాస్థానమందుంచి యామె యావలికరిగెను. నాకాబీరువా గూటిలో నూపిరి యాడునో యాడదో యను సందేహముకలిగెనుగాను, ప్రాణభీతిలో కొట్టుకొనుచున్న నాకప్పుడీ యిబ్బందినిగూర్చి యెక్కువగ విచారించుట కవకాశము లేకపోయెను.

నన్నట్లు లోపలనుంచి జాగ్రత్తగా తలుపులనువేసికొని ల్యూసీ యెప్పటియట్లు నేమియునెరుగనిదానివలె పరుండెను. ఇచట నీచిన్నచిన్న

యేర్పాటులు జరుగుచుండగా నావల దొంగలెవరో వచ్చిరను హడావిడి హెచ్చుచుండెను. తక్కిన నౌకరులందరును హెచ్చరింపగోరి జర్మను నౌకరు "దొంగదొంగ" యనియు పట్టుకొనుడు పట్టుకొనుడు" యని కేకలు పెట్టెను.

కాని దొంగలజాడ యెచటను గానరాకుండెను. ఇంతలో నాజర్మ నుడు ల్యూసీ యింటికరుదెంచి పెద్ద కేకలువేసి యామెను లేపెను. ఆమె ఆ కేకలకు లేచినట్లు నటించుచు తలుపుతీసికొని యావలికరుగగా "దొంగలగంట మ్రోగినది. నీవు వినలేదా!" అని బొబ్బరించియడిగెను. ఏమియు నెరుగనిదానివలె నామెకంఠస్వరము విశేషముగ చలించు చుండగా "ఏమినాయనా? లేచుసరి కాలస్యమైనదా యేమి? ఏమో ముసలిదానను. యోకుహాముగారు తమరు కొంచెమీ ముసలిముద్ద మీద కటాక్షించవలయును" అని పలికెను.

"ఆలస్యముకాదే ముద్దా! అయిదుగంటలైనదో లేదో అప్పుడే యెక్కడివేళ? ఈదారినెవరైన దొంగలు నడచిన చప్పుడైనదా లేదా?"

"దొంగలా! ఏమోబాబు. నేనేమియు వినలేదు." అని యావృద్ధు రాలు ప్రత్యుత్తర మొసగెను.

పిమ్మట నతడామె శయనాగారమును, ఆచుట్టు ప్రక్కలనున్న పొదల చాటునను కొంచెము పరిశీలించిచూచి తక్కిన నౌకరుల యిండ్లకరిగెను.

వాడట్లు తనిఖీచేయుచుండగా హడలిపోయి బీరువాతలుపులను మరింత దగ్గరగా బిగియించుకొని కూర్చుండి కొంతసేపటివరకు భగవం తుని ప్రార్థించితిని. ఈసమయమున ల్యూసీ విషయమున నేనొక ప్రమాణమును గైకొంటిని. దైవకృపవలన నేనా ప్రమాణమును నిలుపు కొనగలిగితిని. అప్పటికాయాపదదాటి బయటపడువరకు నాకు యమ యాతనగనుండినను, కొన్నిదినములు గడచినపిమ్మట ఆరాత్రిజరిగిన ఘోరవిపత్తు నాకు విషాదముకంటె నెక్కువ సంతోషము కలిగింప

సాగెను. నేనాడట్టిబాధనే యనుభవింపకుండునెడల ల్యూసీ సంగతియే తలంపకుండియుండును. ఎంతక్షుద్రజీవుని హృదయమందైన నపారమైన ప్రేమాప్రవాహ మిమిడియుండుననియు, సమయమువచ్చునపుడది యాశ్చర్యకరముగా ప్రవహింపగలదనియు నేనందువలన గ్రహింప గలిగితిని.

అందునంతయు పరిశోధించినపిమ్మట వారునన్ను పైదిగానుంచిన మేడగదినిగూడా తెరచిచూచిరి. నన్ను లోపలగానక నేనెచటికైన తప్పించుకొని పారిపోయియుండుననియు, అందువలననే గంటమ్రోగి యుండుననియు వారనుమానించిరి. కాని వారు చూచునప్పటికి తలుపు తాళము వేసియుండుటవలన నేను లోపలినుండి బైటికి రాలేదనియు లోపలికిటికీలోనుండి యావలికిదుముక ప్రయత్నించి క్రిందకాలువలో బడి చచ్చియుండుననియు వారూహించుకొనియుందురు. క్రిందపడిపోవు నెడల శరీరమైన గన్పించకపోవునాయని కొంతసేపు వెదకిరిగాని క్రింద నేమియు గన్పించకుండుటవలన వారి కనుమానము తీరకుండెను.

తెల్లవారుకొలదిని పరిశోధనము మరింత హెచ్చుగుచుండెను. ప్రతి గదిని, చావడిని, సందును, గొందిని కూడ వారు వెదుకనారంభించిరి. ప్రాస్టుసతి స్వయముగవచ్చి మేడమెట్ల క్రిందిగదులను, ల్యూసీ బసను వెదకిజూచెను. కాని దైవవశమున అసహ్యాకరముగ గన్పించుచుండిన యామె యట్టలగదిని మాత్రము పరీక్షింపలేదు.

ఈ హడావిడి యంతయు నెందులకని వంటకత్తె పెక్కుసారులు అడుగగా వింటిని. కాని యెవరు నామెప్రశ్న కుత్తరమీయకుండిరి. ఎవరో తలుపువేయబోయి గంటవాయించి యుందురేమో దాని కేల నింతకళవళము పడవలెనని యామె యూరడించుచుండెను. తక్కిన

నౌకరులుగూడ అటులనే వాదింపసాగిరి. వారిగోల భరింపనోర్లక చివరకు వెదకుటమాని వూరకుండిరి. నౌకరుల ధోరణినిబట్టి చూడగా యింటివారిలో నెవరిమీాదనుగూడ వారి కభిమానముగాని, గౌరవము గాని లేనట్లు గన్పించెను.

మధ్యాహ్న సమయమున ల్యూసీ కొంచెము రొట్టెయును, కోకో పాలను తెచ్చియిచ్చెను. ఆమెను ప్రతిదినమిచ్చు యాహారము నాదిన మామె భుజింపక నాకిచ్చివేసెను. పిమ్మట నామె నేనెంతయో ప్రతి మాలగ ఆబీరువాగూటి తలుపుల నోరువాకిలిగా నుంచుట కంగీక రించెను.

అప్పటికి దొంగల నెమకు సందడియంతయు నణగెను. నేనెటులనో యదృశ్యనైతినని వారనుకొనిరి.

సాయంకాల మైదుగంటలవేళకు ల్యూసీ తొందరగవచ్చి నౌఖరు లందరును అప్పుడే తేసీరుత్రాగి చావడిలో కూర్చుండిరనియు, జర్మను నౌకరు మేడమీాద నేదియో పనిచేయుచున్నాడనియు తప్పించుకొని పోవుటకదియే సమయమనియు చెప్పెను.

"ఇప్పుడే" యని యామె పలుకునప్పటికి నాకెచ్చటనుండి వచ్చినదో తెలియదుగాని యపరిమితమగు శక్తి వచ్చినది.

మెలమెల్లన వీధిగుమ్మము చేరుకొని యావలకరిగితిని. దారి పొడ వునను కాళ్లువణకిపోవుచు ముడుకులు కొట్టుకుపోవుచుండెను.

గుమ్మముదాటి వీధిచేరుకొనిననుగూడ నాపదదాటినదను నమ్మ కము లేకుండెను. వెంటనెవరు వచ్చుచున్నారోయని దిగులుగనుండెను.

ఇంతలో నెచటినుండియో యొక రక్షకభటుడు దర్జాగా నడచుకొనుచు నాకెదురుగా వచ్చుచుండెను. అతనికినాపై ననుమానము కలుగకుండా తప్పించుకొనుట కెంతయో భయముకలిగెను కాని చివరకెటులనో వానిని తప్పించుకొని యావలబడితిని.

గ్రీన్విచ్ యచటికి చాలా దూరమున్నది. వేగమింటిలోపడి నాచిరుకుర్రని యొడిలోబెట్టుకొని నాకఱవుదీర ముద్దులాడువరకు నోపికబట్టుట కష్టముగానుండెను.

వీలయినంత శీఘ్రముగ నేనిప్పు డింటికరుగవలయును. "హృదయమెచటనున్న నదియెగృహా" మను మాట నిజమని నేనపుడు తెలిసికొంటిని.

ఇంటి కరుగునపుడు దారిలో నెన్నియో సంశయములు బాధించినవి.

నేను తలుపుమీద చేయి వేసినంతనె యెవరో దానిని తెరచిరి. లవుజాయి దిగులుపడి నాదెస జూడ నారంభించెను.

"పిల్లడు, పిల్లడు——" అనుచు తొందరగ నేమియో యడుగబోయి నోట మాటరాక నూరకుంటిని.

"అయ్యో! ఎందుకమ్మా అంత బెంగ? పిల్లడు సురక్షితముగ నున్నాడు. ఎట్టి లోపమును గలుగలేదు. దూడవలె కదలక మెదలక పాలు త్రాగి హాయిగ పండుకొనుచున్నాడు. అవును కాని యిలాంటి దానవు నీ వెందు కింత బాధపడి మ మ్మింత బాధపెట్టితివి?" అని యడిగెను.

నే నా మాటల వినుట కాగలేదు. నా బంగారు తండ్రిని, నాపాలిటి భాగ్యదేవతను చూచువరకు నా మన సాగకుండెను. దడదడ గదిలోని కరిగితిని. నా చిన్నికూన హాయిగ నిద్రించుచుండెను. ముక్కురంధ్ర ములకడ జేయి యుంచి యూపిరి యుండుటను గాంచి మనము శాంతిం చెను. వాని జాడలను బట్టి చూడగా నే నిచట లేనందున వాని కెట్టి లోపమును గలుగలేదు.

ఇంతలో రోజుమేరీ యింటికి వచ్చెను. నే నేల నిన్నిదినము లెచట నుండిపోయినదియు చెప్పవలసినదని వారు నిర్బంధించిరి. కొంతసేపటి వరకు వారికి నే నేమియు చెప్పలేకుంటిని. తరువాత వా రిరువురి సహా యమున తల దువ్వుకొని స్నానముచేసి రెండు మూడు రొట్టెలను భుజించిన వెనుక ప్రాణము కొంత కుదుటబడెను. ఆతరువాత జరిగిన కథ నంతటిని జెప్పితిని. నే నెవరినో అప్పుడు తెలిసినది లవుజాయికి.

అయినను దొంగతనము విషయములో నామె యభిప్రాయ మంతగ మారినట్లు గన్పించలేదు.

రోజుమేరీకి చాల కోపము వచ్చినది. వెంటనే పోలీసుస్టేషను కరిగి రిపోర్టు చేయుదము రమ్మనియెను. కాని నాక దియిష్టము లేకపోయెను.

జానుమెడ్లీ యక్షరములతో నాపేర నొక బంగీ వచ్చిన సంగతి యామె కప్పుడు జ్ఞాపకము వచ్చెను. బంగీ విప్పి చూడగా దానిలో నా బ్యాంకి నోట్లకట్ట నేను కట్టినట్లుగనె యుండెను. నా కెంతయో ఆశ్చర్యము కలిగెను. నాడు దొంగిలించిన డబ్బంతయు మరల వచ్చినది తిరిగి నాయిష్టము వచ్చినట్లు వెచ్చించుకొన వచ్చునని వానిని లెక్కించుకొనుచుండగా దానిలో మెడ్లీ కార్డు ఒకటి యుండెను. ఆ కార్డుమీద "పొరపాటున వీటిని దీసికొంటిని. క్షమింపవలయును" అని వ్రాసి దాని క్రింద జానుమెడ్లీ యని చేవ్రాలు చేసియుండెను.

అవురా! నే ననుమానించినట్లు జానుమెడ్లీ చేసినదే యీ దొంగపని యని యపు డందఱమును నవ్వుకొంటిమి.

ఆ సమయమున రోజుమేరీ నావైపు నిదానించి చూచెను. నేను గూడ నామెవైపు తిలకించితిని. ఆమె కన్నులవెంబడి నీరు కార నారంభించెను. ఆమె విచారముతో "లోర్నా! నీవు నన్ను విశ్వసించితివి. నే నా జాను నిచటికి తీసికొని వచ్చితిని. ఆత డిట్టి పనిని చేసినాడు. ఇంక నిటుపై నీవు మరల నన్ను నమ్మజాల వనుకొనియెదను" అనెను.

ఆ మాటల బలుకునపు డామె ముఖ మతిదీనముగ గనుపించెను. వెంటనే నే నామెను బిగ్గరగ కౌగలించుకొని యామె యొనరించినదాని యం దెట్టి తప్పిదము లేదనియు తప్పుచేసినది మెడ్లీ యనియు చెప్పితిని. మెడ్లీ నమ్మక స్వామిద్రోహ మొనరించునని యెవరు గ్రహింపగలరు? అంతియగాక నతడు రోజుమేరీని ప్రేమించుచున్నట్లు వ్యవహరించెను. తిన్నయింటి వాసము లెన్నునట్లు మెడ్లీ తాను వలచిన యువతికిని,

ఆమె స్నేహితులకును అపచార మొనరించునని యెవ రనుమానింప గలరు ? నా డబ్బు నా కంపుట కింత యాలస్య మొనరించుటయె గాక నతడు తక్కిన వస్తువు లన్నిటి నుంచుకొనెను.

ఎంత విశ్వాసఘాతకుడు ! రోజుమేరీ యేమియు తోచక బంగీ కాగితముల నిటునటు త్రిప్పుచు నొక నూతనాంశమును కనిపెట్టెను. నేను బంగీ విప్పునప్పుడే దానిని గమనింపవలసి యుండెను. మనము స్థిమితముగ లేనందున నా కా ధ్యానమే లేకపోయెను. బంగీకాగితముల ముద్రలను జూపించుచు, రోజుమేరీ ఆ బంగీ అమెరికా దేశమందలి శాను ఫ్రాన్సిస్కో పట్టణమునుండి వచ్చినదని చెప్పెను.

అట్లయిన మెడ్లీ ఫెర్ను ద్వీపమునకరిగి అచటినుండి యీ బంగీనంపి యుండవచ్చునని నా కనుమానము కలిగెను. ఆ ఫెర్నుద్వీపపటము లును, నెడ్డు జాతకమును, మెడ్లీ యపహరించిన వస్తువులలో నుండి పోయినవి. ఈ దుర్మార్గుడు తానే నెడ్డు భేజుగ ప్రవర్తించి ఆ ద్వీప ముల నాక్రమింపడుగద ! ఏమో యెవరేమి చెప్పగలరు ?

నే నింతవర కనుమానించినట్లు నెడ్డు భేజు నిజముగ మరణించియె యుండునెడల యీ పటములు మొదలగువానితో నా కెట్టి ప్రయోజ నము నుండదు. ఆయాస్తి యంతయు నా చంటికుర్రవానికి రావలసి యున్నది. కాని వాని పుట్టిన నాటికే లభించిన డ్యూకు అండుడ్యూకు కంపెనీవారి యాస్తియంతయు నుండగ దీనికిగూడ నేల ప్రయాస పడ వలయునని యనుకొంటిని.

మరునాటి యుదయము ధైర్యమునవలంబించి మెడ్లీ పంపిన బంగీ లోని సొమ్ముకొంత చేతపట్టుకొని మానాన్నగారి యింటి వకీలు మిా కెనుగారి యొద్దకు పయనమైతిని. అతడునన్ను జూచియు, నా కథ వినియు, మిగుల యాశ్చర్యచకితుడయ్యెను. నాన్నగారువ్రాసిన వీలు నింకను కచేరీలో దాఖలుచేయలేదనియు, నాకా సంగతిని ముందుగ

తెలియబరచనిది దానిని ఫైలుచేయుటకు వీలులేదనియు, నాన్నగారు మరణించిన దాదిగ నాయునికిపట్టును కనుగొనుటకు తాను విశ్వప్రయత్నము చేయుచుండెననియు నతడు చెప్పెను.

లారెన్సు యెవరియనుమతి నొందకయె నాన్నగారియింటిలో ప్రవేశించెను. అతనినావలికంపుట రెండునిముషములపని. కాని నాకతనిపై నెట్టికోపమునులేదు. అంతియగాక నతని ప్రస్తుతస్థితి బాగులేదు. అతని పోషణార్థము కొంతడబ్బిచ్చుట మంచిదనిగూడ నాకుతోచెను. వెంటనే నాయుద్దేశమును మీాకినుగారి కెఱింగించితిని.

నాప్రాణములిపుడెట్టి యపాయకరస్థితి యందున్నదియు, నన్నును నాబిడ్డను జంపుట కాతుంటరులెట్టి దుండగము నొనరించినదియు నేనతనికి వివరముగ తెలియబరచితిని. అట్లయిన లారెన్సు జీవించియున్నంతకాలమతనికి నాకుతోచిన భృత్యము నిచ్చుటకొక వీలు వ్రాయవలసినదని మీాకినుగారు చెప్పిరి.

కంపెనీవ్యవహారమున కెట్టిలోపమును కలుగకుండ తగినవారి నతడాయాపనుల నిర్వర్తించుటకేర్పాటుచేసెను. వారిలో కొందరు నాన్నగారితోగలసి ముప్పదియేండ్లనుండి యీకంపెనీలోనే పనిచేయుచుండిరి. వారిలో కొందఱికి కంపెనీలాభములో వంతులుండెను. లారెన్సునకు కంపెనీకిని యెట్టిసంబంధమును లేదు. లారెన్సు తెలివితక్కువపనులను గూర్చి మీాకినుగారప్పుడు మరికొన్ని వివరములను చెప్పిరి. కంపెనీలోని ముఖ్యోద్యోగీయుల పనిపాటలనుగూర్చిగూడ నతడేమియో జెప్పినట్లు జ్ఞాపకము.

మాయెత్తుగడలనుగూర్చి లారెన్సు ముందుగా గ్రహించినట్లుండెను. ఒకనాటిసాయంకాలము మీాకినుగారును కంపెనీ ముఖ్యోద్యోగీయులిరువురును వెంటరాగా నేను నాన్నగారియింటి కరిగితిని. తలుపులు తాళములు వేసియుండెను. ఆచెంతనున్న రక్షకభటుని బిలచి

వానినచట సాక్షిగనుంచి తాళములను బ్రద్దలుజేసి లోనప్రవేశించితిమి. పెరటితలుపునకు తాళము వేసినట్లులేదు. గట్టిగాలాగినంతనె యది యూడివచ్చెను. పనివారందరు మూడురోజులక్రిందటను, ఇంటివారా క్రిందటిరోజునను కొంతసామాను పట్టించుకొని బయటికరిగిరని యిరుగు పొరుగు వారలుచెప్పిరి. రెండుబండ్లసామాను పట్టించుకొనిపోవుట వలన వారాయిల్లు ఖాళీచేసి యెచటికో పోయియుందురని యిరుగు పొరుగువా రూహించిరట !

వంటయింటిలో మే మడుగుపెట్టుసరికి మాసల్లపిల్లి "మ్యావు మ్యావు" అని యరచుకొనుచు వచ్చెను.

దానిని జూచి మిాకినుగారి కోరికపై నాతో లోని కరుదెంచిన రక్షకభటుడు "పిల్లి జాడలను బట్టి చూడగా నది యాకలితో నున్నట్లు కన్పించు" దని పల్కెను.

"అయ్యో పుస్సీ! నిన్నొకర్తె నిచట విడచిపెట్టి పోయినారా? కఠినచిత్తులు" అని నేను జాలిగ బలికితిని. ఇంతలో నెచటనో తలుపు తీసిన చప్పు డయ్యెను. మే మందర మా తలుపు చప్పుడైన దెస జూచితిమి. లోపల మనిషి సంచరించుచున్నట్లు అడుగుల చప్పుడయ్యెను. ఆ చప్పుడు విని మిాకినుగారు గంభీరస్వరమున నిట్లు పల్కిరి. "ఎవ రక్కడ? వెంటనే బయటికి రండి! లేకున్న ప్రాణము దక్కదు."

* * * *

ఆ మాటలు విని పాదములు తొట్రిలుచుండ నా ప్రాణములు గాపాడిన ముసలి ల్యూసీ యీవలకు వచ్చెను.

"ఓసి ల్యూసీ! నీవేనా?" అని నే నరచితిని. ల్యూసీ యెవరో, ఆపె నా ప్రాణము లెట్లు కాపాడెనో, ఆ సంగతి నపుడు నే నందరి కెఱింగించితిని.

మమ్మును మా వెంట నున్న పోలీసుభటుని జూచి యామె భయ మొందెను. “నిన్నిచట కాపుంచి వారంద రావలి కరిగిరా?” అని నే నడిగితిని.

“లేదమ్మా! వారితో గలసి నేను గూడ నావలికి పోవలసియుండెను. కాని నా చిన్ననాటినుండి యిచటనే యున్నందున దీని నిపుడు విడచి పెట్టుటకు మన సొప్పినది కాదు. ఇదే నా యిల్లు గదా యింకెక్కడికి పోదును? ఆ పాపిష్ఠి యోకుహాము నాకున్న ఆకొలదిపాటి డబ్బు నపహరించినాడు. అందువలన నేమి చేయుటకును తోచక నిచట డాగి యుంటిని. నే నెచట దాగియుందునో నీకు తెలియునుగదమ్మా!— అక్కడనే మొన్నటినుంచి దాగియుంటిని.”

ఆ డాగియున్నచోటు నే నెరిగినదే యని మరల చెప్ప నవసరము లేదు. నా యింటియందలి మేడమిద్దెలన్నియు నా ప్రాణము గాపాడ నేరని పాడురోజున నన్ను గాపాడిన స్థల మదియె.

తక్కినవారా ముసలిదాని మంచిచెడ్డలు తెలియక దాని నేమేమియొ ప్రశ్నింపసాగిరి. వారామె నంత కఠినముగ ప్రశ్నించుట నాకు కష్టముగ దోచెను. అంతమంది అన్నిసారులు గంట మ్రోగించగా తానేల తలుపు తెరవలేదో చెప్పవలసినదని వారామెను నిలువదీసి యడుగ సాగిరి. ఎవరు వచ్చి యేమిచేసి పోవుదురో యను భయమున తాను తలుపు తీయలేదని యామె యెన్నిమారులు చెప్పినను వారు నమ్మకుండిరి. గంట మాత్రము పెక్కుసారులు మ్రోగె నని యామె చెప్పెను. ఇల్లంతయు రెండు రోజులనుండి ఖాళీగా నుండెను. ఆ క్రిందటిరాత్రి ఫ్లోరెన్సును తల్లియుగలసి రెండుపెద్దబండ్లపై సామానువేయించుకొని యెచటికోపోయిరి. ఆప్రయాణసన్నాహములనుగూర్చి వారు చాల సేపువర కేమియో మాట్లాడిరి. కాని తన కాసంగతులు జ్ఞాపకము

లేవు. వారెచటి కరిగినదిగాని, ప్రస్తుత మెచటనున్నదిగాని యామె కేమియు తెలియదు.

“నీవస్తువు లన్నిటి నెత్తుకొనిపోయిరేమో చూచుకొనియెదవా లోర్నా?” అని యెవరో బలికినట్లయ్యెను.

“ఈజాడలన్నియు నట్లే గన్పించుచున్నవి. అమ్మ నగ లెంత విలువైనవి! వాటినైన నుంచిరో లేక నెత్తుకొనిపోయినారో?” అని నేనంటిని.

పిమ్మట మేమందరము గలసి మేడమీది కరిగితిమి.

* * * *

లారెన్సు గతనాలుగైదువారములలో చేయించిన మార్పులను జూచి నాన్నగారి స్నేహితులు ఆశ్చర్యచకితులై నవ్వసాగిరి. వారిలో నొకరు “లారెన్సునకు పిచ్చిపట్టినదనగా నేను నమ్మలేదు. కాని యీ యేర్పాటులనుబట్టి చూడగా నతనికి పిచ్చియెత్తినమాట యథార్థ ... ... మనియె తోచుచున్నది.” అనిరి. మీకు తెలియదేమో గాని సర్ మార్టినుగా రాసంగతిని చాలదినములక్రిందటనె కనిపెట్టిరి. అని మరియొకరనిరి.

ఈక్రొత్తయేర్పాటులను చేయించినంతమాత్రమున నతనికి పిచ్చి పట్టినట్లు నిర్ణయించుటకువీలులేదని మీకినుగా రనిరి. ఇదియొక క్రొత్త పద్ధతియనియు, నవనాగరికులు కొందఱావిధముగ తమ యిండ్లలో మార్పులను జేయించుచున్నారనియు మీకినుగారు వారందరికి అప్పుడు బోధించిచెప్పిరి.

భోజనశాలలోనికరిగి చూడగా నచటి వెండిసామాగ్రియంతయు నట్లేయుండెను. ఖజానాపెట్టె నాన్నగారి పఠనాలయమందుండెను. ఆతాళములగుత్తిని మీకినుగా రింటియొద్ద మరచివచ్చుటవలన దానిని తెరచుటకు వీలులేకపోయెను. వారి ధర్మమాయని పఠనాలయమును

మాత్ర మీాక్రొత్తమార్పులతో పాడుచేయలేదు. తక్కినమార్పులన్నిటిని పడగొట్టించి యెప్పటియట్లు యిల్లంతటిని బాగుచేయించుట కథమపక్ష మొక నెలదినములైన పట్టుననియు, అంతవరకు నేనీగది యందె కాలక్షేపము చేయవలయుననియు ననుకొంటిని. అంతలో నొకరాప్రక్కనున్న గదితలుపు తోయగా నదియె కచేరిచావడియని నేను తెలియబరచితిని. ఆగదియందున్న అగ్నిగుండములో నిప్పులుండుటయెగాక దానిలోనికాంతులు గదియంతటను ప్రసరించుచుండెను. ఆయగ్నిగుండముచుట్టును పరజాగుడ్డలు వ్రేలాడుచుండెను.

"అందరు నొక్కసారి యూగుడు. ఆ చిన్నదాని నావలిగదిలోని కరుగమనుడు" అని రక్షకభటుడు కేకవేసెను.

కాని ఆ వింతయేమియో చూడవలెనను ఆతురత అందరికి గూడ నధికముగ నుండుటవలన అందఱమచటి కరిగితిమి. ఆ యగ్నిగుండము దగ్గఱ నొక శవము పడియున్నట్లదియో నాకు గోచరించెను. అంతట నేను వెనుకకాగిపోతిని.

భయకంపములతో మీాకినుగారా శవము లారెన్సు డ్యూకుదని తెలియబరచుటలోపల నేనా సంగతిని గ్రహించితిని.

* * * * *

రక్షకభటు డనుమానముతో అగ్నిగుండము వైపుచూచి వెంటనే పుస్తకాలయములోనున్న టెలిఫోనుయొద్ద కరిగెను. నన్ను బలవంతము పైని డ్రాయింగు గదిలోనుండి యూవలికంపిరి. ఇంతలో నెవరో ల్యూసీని దీసికొనివచ్చి నా కెదురుగ గూర్చుండబెట్టిరి. నల్లపిల్లి ఆమె యొడిలో గూర్చుండెను. అటుపిమ్మట నింటిలోనికి వచ్చుచు బోవుచు నుండిన వారిసందడి హెచ్చసాగెను. నల్లని తోలుసంచితో నొకరును, మరియొక రక్షకభటుడును లోనికరిగిరి.

ఆక్రొత్తగా వచ్చినమనిషి ల్యూసీనిట్లు ప్రశ్నించెను.

"లారెన్సు డ్యూకుయింటిలోనున్న సంగతి నెరుగుదువా ?"

"నే నెఱుగను"

"ఆయన యింటిలోనుండి బయటికెప్పు డరిగినది తెలియునా ?"

"తెలియదు."

"అతడు చనిపోయిన సంగతియైన తెలియునా ?"

"తెలియదు."

వారెన్ని ప్రశ్నలనడిగినను తెలియదని ల్యూసీ చెప్పుచుండెను. పాపము ! ఆమె యేమియు నెఱుగదట. వీధితలుపు మాత్రము నెవరో కొట్టినట్లును, తలుపునకతికియుండు గంటను మ్రోయించినట్లును, ఆమెకు పెక్కుసారులు వినుపించెనట ! అంతకు తప్ప వేరేమియు నామెకు తెలియదట.

"వీధితలుపు చప్పుడైనప్పుడు నీవేల తలుపుతీయ కుంటివి ?"

"నే నింటిలోనున్న సంగతి యెవరికీ తెలియగూడదు గనుక."

"ఏల తెలియకూడదు ?"

నే నిచటనున్న సంగతి వారికి తెలియునెడల బలవంతముగ నావల కంపుదురు గనుక."

"వారంద రావలకు బోయినపుడు నీవొక్కర్తె వేల నిచటనుంటివి?"

"ఇదియె నాయిల్లు. ఇంతకుతప్ప నాకు వేరేదియు దిక్కులేదు. నా డబ్బంతయు గూడ మోకుహాం అపహరించెను."

మోకుహాము యెవరని వారడుగగా జొకేయిమను జర్మనునౌకరు నామె యాపేరున బిలచుననియు, అతడు లారెన్సు నౌకరనియు, మర్యాద తెలియని మూర్ఖుడనియు వారికపుడు తెలియ బరచితిని.

"వాడా సొమ్మేల అపహరించెను ? ఎంత ?"

"ఆరు సవరనుల ఆరు షిల్లింగులు నా జీవితమందలి యావదార్జనయు నదియె. ఆ మాత్రము గూడ నతడు నాకు దక్కనీయకుండెను."

నీ వెందుకిచ్చితివి ?" అని యడుగగా నామూర్ఖుడేవియో లేనిపోని నేరముల నారోపించి యామె నుద్యోగమునుండి తొలగింప ప్రయత్నించెననియు, అట్లు తొలగించకుండ జేయుటకాడబ్బు నీయవలసి వచ్చెననియు, నామె చెప్పెను.

ఈ హడావిడి యంతయు నిట్లుండగా నింతలో వీధితలుపు నతికి యున్న గంట నెవరో మ్రోయించిరి.

---

ఎవరాగంట మ్రోయించిరో చూడవలయునని నేను చాలఆతురత నొందుచుండగా ముగ్గురు పోలీసుద్యోగియులు తలుపుదగ్గర కరిగిరి. వారిలో నానల్లనిపొట్టిమనిషి యెక్కువ అధికారముగలవాడని దుస్తులనుబట్టి గ్రహించితిని. మీకినుగారితో శాండిసు, ప్రోచీనుగారు లిద్దరు నుండిరని చదువరుల కిదివరకె తెలసియున్నది. కాని ఆయారుగురు పురుషులలో నెవరికి నెట్టిభయము లేకుండెను. ఇంకభయపడుచు నవస్థపడుచున్న మేమిరువురము ల్యూసీయును, నేనును స్త్రీలము. మాతో మానల్లపిల్లి ప్రిసిల్లు గూడ కొంచెముభయ మొందినట్లుండెను.

ఇంతలో మీకినుగారి యనుమతిపై నాపోలీసు అధికారి తలుపు తీసెను. తలుపుతీయుసరికి గుమ్మములో లారెన్సు ప్రాతనౌఖరు ఫ్రెండిలు నిలచియుండెను.

అతడెవడో ఆపోలీసుఅధికారి యెరుగడు. తక్కినవారినిమాత్ర మెఱుగునుగనుకనా ?

"ఎవరు నీ"వని యాయధికారి గట్టిగప్రశ్నించెను. పోలీసుభటులను జూచినంతనె సగముప్రాణము పైకెగసిపోయి జీవచ్ఛవమువలె నిలచియున్న ఫ్రెండిలున కాప్రశ్న మరింత భయముగలిగించెను.

"మీపని కాటంకము గలిగించినయడల క్షమింపవలయును." అని యతడు దీనముగ బలికెను.

"నీవేల వచ్చితివి ?"

"డ్యూకుగారిని చూడవలయునని."

"నీవు డ్యూకుగారికి మిత్రుడవా ? అట్లయిన లోనికిరమ్ము."

లోనికి రెండడుగులు పెట్టెనపిమ్మట నన్నుజూచి నీవేల నిచటనున్నావనునట్లతడు ప్రశ్నార్థముగ నావైపుజూచెను.

పిమ్మట పోలీసుద్యోగిప్రశ్నకు ప్రత్యుత్తరముగ "నేనతనికి మిత్రుడనుగాను. అతనియొద్ద బంట్రౌతుగా జాలదినములు పనిచేసియుంటిని. ఇప్పుడొక్కసారి చూసిపోవలయునని—"

"ఉద్దేశించి వచ్చితివా?"

"ఆఁ. అవును. ఆయన నొక్కపరి చూడవలయునని చాలదినముల నుండియు నాతురతగనుండెను." అనుచు నతడు నాముఖమును, పోలీసు వారిముఖమును జూచి యేదియో విపరీతము జరిగినదని యూహించుకొని "ఇప్పు డాయన యెచటనున్నారు? ఇంతమంది జనులేల వచ్చిరి? ఆయన కేమియు ప్రమాదము కలుగలేదుగదా?" అని యాతురతతో ప్రశ్నింపసాగెను.

ఫ్రెండిలుని, వానియాతురతను జూచి నాకు చాలజాలి కలిగెను. నన్ను మోసగించిన మెడ్లీ కితడు బావమరదియను సంగతియు, లారెన్సు కొలువునం దున్నప్పుడితని జూచిన నాకపరిమితమగు అసూయగలుగుచుండె ననుసంగతియు నేనపుడు పూర్తిగ మరచిపోతిని. వానిమీద జాలికలుగుటవలన దగ్గరకరిగి "అయ్యో ఫ్రెండిలు! మరియెక్కడి డ్యూకు?" అంటిని.

అంత నతడు కళవళపడి యేడ్చుచు "ఏమి జరిగిపోయినది? డ్యూకుగారేమైపోయిరి?" అని యడిగెను. "అతడు మరణించెనని యిప్పుడె తెలసినది."

అంతట ఫ్రెండిలు బిగ్గరగ నేడువసాగెను. అచటివారంద రాశ్చర్యపడి వీడెవడని యడుగగా నేనపుడు పూర్వకథనంతటిని వారికి తెలియబరచితిని.

పిమ్మట నొకజవాను వానినేవేవియో ప్రశ్నలనడిగి బాధించుచుండెను. ఫ్రెండిలు తగినప్రత్యుత్తరముల నీయజాలకుండెను. లారెన్సు మరణవార్త ఫ్రెండిలు హృదయమును పగులజేసెను. అతని యసందర్భ

మరణము నాకే విచారము గలిగించుచుండగా యిక ఫ్రెండిలు సంగతి వేరే చెప్పవలయునా? నిష్కారణముగా చెడుతిరుగుళ్ల కలవడి లారెన్సు చెడియెనుగదా యని నేను విచారించుచుంటిని. ఫ్రెండిలు విచార మటువంటిదిగాదు. తాను హృదయపూర్వకముగ ప్రేమించి గౌరవించిన యజమాని మరణించినందుల కతడు వగచుచుండెను.

చిన్నసత్రము వీధియందలి మేడను విడచునప్పుడు అనగా సుమారు రెండుమాసములక్రిందట తనను పనిలోనుండి తప్పించిరనియు ఆసంగతిని నెలదినములుండగా చెప్పనందుల కొకనెలజీతము నిచ్చెదమని చెప్పిరనియు కాని తానాసొమ్మును పుచ్చుకొనలేదనియు, ఉద్యోగమునుండి తొలగించిననుగూడ తాను లారెన్సును తరచుగ జూచుచుండెననియు లారెన్సు తన్ను మరల నుద్యోగమునం దుంచుట కెంత ప్రయత్నించినను కార్యము లేకపోయెననియు, తాను కోరినప్పుడెల్ల రావలసినదని లారెన్సు తన నెంతయో దీనముగ బ్రతిమాలెననియు నతడు చెప్పెను.

ఇట్లప్పుడప్పుడు వచ్చుటకు లారెన్సు తనకు కొంతడబ్బు నిచ్చుచుండెనని యాతడంగీకరించెను. ఆడబ్బును పుచ్చుకొనకుండునెడల తాను పేదవాడగుటవలన మరియొకరియొద్ద కొలువు చేయవలసివచ్చెడిదని ఫ్రెండిలు చెప్పెను.

లారెన్సు నిషావస్తువులను వుపయోగించుచుండిన సంగతి తనకు తెలియుననియు కాని ఆవస్తువు లతనికెట్లు వచ్చెడివో ఆసంగతి మాత్రము తనకు తెలియదనియు, తానట్టివస్తువుల నతని కెన్నడును కొని యివ్వలేదనియు నతడు చెప్పెను.

ఫ్రెండిలు నిన్నటిదినము మూడుసారులును, నేడు రెండుసారులును, లారెన్సును జూడవచ్చెను. డ్యూకుగారు తమ్మొక విపత్తునుండి గాపాడ

వలయునని జాబువ్రాయుటవలన నతడిన్ని మారులు వచ్చెను. ఆవిపత్తు యెట్టిదో వివరముగా నతడు వ్రాయలేదు.

పోలీసుఉద్యోగి లారెన్సువ్రాసిన లేఖనందుకొని దానిని జదువుకొనుచుండగా నతనిభుజముమీాదనుండి నేనాయుత్తరమును తొంగి చూచితిని. దానియందిట్లుండెను.

“ ప్రియమైన ఫ్రెండీలూ !

మంచివాడవు గనుక నన్నీవిపత్తునుండి కాపాడవలయునని నిన్ను కోరుచున్నాను. ప్రస్తుతము నాయొద్ద నొక షిల్లింగైనను లేదు. కాని రెండుమూడురోజులలో నీకేమైన నీయకపోనులెమ్ము. నేనొనరించిన తప్పిదములకు మాచెల్లెలికినాపై నెంతయసూయగలిగినను నన్ను పూర్తిగ విసర్జింపదు. వారు సామానంతయు తీసికొనిపోయిరి. నీవు శీఘ్రముగ వచ్చిననెతప్ప నాపనియంతయు పూర్తియగును. బహుశా యదియె యుత్తమపద్ధతియని నాకు తోచుచున్నది.

నేనింతవరకు దయ్యములతో చెలగాటములాడుచుంటిని. చివరకు పరాజితుడనైతిని.

ఇట్లు
నీమిత్రుడు
లారెన్సుడూ్యకు”

జరిగినవృత్తాంతమంతయు నిప్పుడీలేఖవలన నాకు విశదమయ్యెను. ప్రాణమువిసిగి చివరకు లారెన్సు ఆత్మహత్యగావించుకొనెను. ఆమాట తలచుకొనినప్పటికి పట్టరానంత దుఃఖమువచ్చి మరి నిలువజాలక చేరువనున్న ఒక కుర్చీలో కూలబడితిని. వారిబాధ పడలేక నతడాత్మహత్య గావించుకొనెను. అయ్యో ! లారెన్సు !! అదియె నీకుత్తమ పద్ధతిగ గన్పించినదా ? యని విచారింపసాగితిని.

పదిపండ్రెండు దినములవరకీవింత ప్రజలకలజడికలిగించెను. అటు తరువాత నేదియో కుటుంబకలహములువచ్చి యీరీతిగా జరిగియుండు నని యందఱనుకొనిరి. పోలీసుఅధికారి యాచుట్టుప్రక్కలనున్న పెద్ద మనుష్యులను కొంతమందిని తెచ్చి పంచాయతీచేయగా నల్లమందు నిషాయెక్కువగుటవలన లారెన్సుద్యూకు మరణించెనని తీర్పుచెప్పిరి. ఆత్మహత్యచేసికొనినట్లు పరిస్థితులవలన స్పష్టముగ గన్పించుచుండె. నిట్లు తీర్పుచెప్పుట బాగులేదని ప్రజలనుకొనుచుండిరి.

నాకుమాత్రము పంచాయితీదారుల తీర్పేసరియైనదని తోచెను. లారెన్సు బుద్ధిపూర్వకముగ మరణించియుండడు. ఫ్రెండిలు వచ్చువర కైన వేచియుండును. ఫ్రెండిలువచ్చినపుడు తలుపు తెరచియుండునెడల లారెన్సు మరణింపకపోవునేమో? తలుపుతీయకుండుట ల్యూసీతప్పని గూడ నేనుచెప్పను.

అట్లయిన నీయుదంతమంతటి కెవరుకారకులో వారిదే యీతప్పంత యునని చెప్పవచ్చును. సరియె యెవరుకారకులో మున్ముందు తెలి యగలదు.

లారెన్సున కంత్యక్రియలుగావించినపిమ్మట నేనుమరల మాతాత తండ్రులగృహమున నివసింపనిశ్చయించితిని. మరల నీయింటిలోనుండు భాగ్యము యీజన్మమున గలుగునని నేననుకొనలేదు. తలవనితలంపుగ గలిగిన యీమార్పునకు నాలోనాకే యాశ్చర్యముగలుగుచుండెను.

లారెన్సుచేయించిన క్రొత్తమార్పులన్నిటి నూడబెరికించి యింటి నంతటిని మరల పూర్వపంధానుసరించి బాగుచేయింపవలెనను కొంటిని.

ఆమరుచటిదినమె గ్రీన్విచ్చికరిగి యచటి అద్దెగదులకు స్వస్తిచెప్పి రోజు మేరీతో గలసి ఢ్యూకుమేడకు వచ్చితిని. లవుజాయిని విడచి వచ్చునప్పుడు నాకుచాల దుఃఖమువచ్చెను. శుభముగ వెళ్లునపుడు కంటనీరు బెట్టకూడదనియు, తానప్పుడప్పుడు నాన్నగారింటికివచ్చి మమ్ము తరుచుగ జూచుచుందుననియు నామెచెప్పెను. తరుచుగ వచ్చునట్లు వాగ్దానమొనరించినను ఆమెయొక్క సారిమాత్రమె మాయింటికివచ్చెను. అప్పుడు మేమొనర్చిన మర్యాదల కాశ్చర్యమొంది తనకును యింతటి మహాభాగ్యవంతులకు నెక్కువస్నేహముండకూడదని యామెపలికెను.

అదృష్టదేవత నాతో డాగురుమూత లాడుచున్నట్లు నాకప్పుడప్పుడు దోచుచుండెను. ఇప్పుడింత దృఢముగ నున్నట్లు గన్పించుచున్నను, కనబడని విపత్తేదియో యప్పటికప్పుడు సంభవించి మరల మమ్ము లండను నగరవీధులందు భిక్షమెత్తింప వచ్చునని నేను రోజు మేరీతో నా కష్టసుఖము లన్నిటిని చెప్పుకొనుచుంటిని.

మాకిరువుర కిప్పుడు పనిచాల మిక్కుటముగ నుండెను. పెక్కు దినముల బట్టి మేముభయులము అక్కచెల్లెండ్రవలె నత్యంతస్నేహముతో మెలగుచుంటిమి. అక్కచెల్లెండ్రయ్యును కొందరు తరుచుగ దబ్బులు లాడుచుందురు. మా కెప్పుడట్టి కలహములుగూడ లేకుండెను. మా యిద్దరిలో నా చిన్నపాపనిపై నెవరికెక్కువ యభిమానమున్నదో చెప్పుట కష్టము. ప్రతిదిన ప్రవర్ధమానుడగుచు నేడు చంటిబిడ్డడన్ని విధముల తండ్రినిపోలుచు పెరుగుచుండెను. అది చూచి రోజుమేరీ యేమనుకొనునో యనియు, మరల మా పూర్వగాథలను గూర్చి అనవసరచర్చ లారంభ మగునేమోయనియు నేను భయపడు చుంటిని. కాని రోజుమేరీ నా కంటె నెక్కువ యానందమును గనబరచుచుండుట వలన నట్టి యుపద్రవమేదియు లేకపోయెను.

గృహమంతటిని మరల నెప్పటియట్ల బాగుచేయించుటలో మాకు పని యెక్కువగనుండెను. గతవిషయములనుగూర్చి తరచితరచి యాలోచించుకొనుచు విచారించుట నాకుకష్టముగదోచెను. ఏదియో యెడతెరిపిలేని పనిపెట్టుకొనుటవలన గత దుఃఖములను మరచి యిరువురము హాయిగ కాలక్షేపము చేయుటకు నిశ్చయించుకొంటిని.

ఒకనాడింటినౌఖరులు కావలయునని పత్రికలలో ప్రకటించితిని. అందులో బట్లరుపని నిమిత్తము వచ్చినవాటిలో మొట్టమొదటిది ఫ్రెండిలుది.

ఆదరఖాస్తులను చూడగనేనాకు మిగుల ఆశ్చర్యముకలిగెను.

ఫ్రెండిలుని జూచునప్పటినుండియు వానిపై నేలనో నాకసూయ మిక్కుటముగనుండెనని యిదివరకు చెప్పియుంటిని. కాని లారెన్సు కొలువునందుండునపుడతనియందు ఫ్రెండిలు గన్పరచిన విశ్వాస మపరిమితము; సామాన్యముగ నట్టిప్రభుభక్తిగలబంటులు దొరకుట కష్టము. అందువలన కొంచెము సేపాలోచించి వానినే పనియందుచుకొనుటకు నిశ్చయించితిని.

జానుమెడ్లీ సంగతిసందర్భముల నతడేమైన వివరముగ దెలుపునేమోయని వానితో చాలవరకు ప్రస్తావించితినిగాని కార్యములేకపోయెను. మెడ్లీ దేశాంతర మేగెననియు, ఏ దేశమునకరిగెనో తానెరుగడనియు తెలసికొనుటకు తగిన ప్రయత్నముల జేసెదననియు నతడు పలికెను.

* * * *

ఫ్రెండిలు యెంతయో ప్రయాసతోగూడిన ప్రయత్నముపై కొన్ని వివరములనుమాత్రమునరసి నాకిట్లు జెప్పెను.

మెడ్లీకుటుంబము కవెంటుగార్డెనులో గల తోటలను వర్తకశాలలను విక్రయించుకొని అమెరికాదేశమున కరిగిరి. ఫ్రెండిలు జాన్‌మెడ్లీ సోదరిని వివాహమాడినసంగతి యిదివరకు తెలసియె యున్నది. ఆమె లోకాంతరప్రాప్తినొంది యిప్పటికి కొన్ని సంవత్సరములైనది. జీవించి యున్నప్పుడైన నామె పుట్టింటి కరుదుగ వచ్చుచుండెడిది. మాటల సందర్భములో మేడ్లీని లారెన్సుసంరక్షణార్థము కొన్నిదినములు నియమించినట్లు మెడ్లీనాతో చెప్పినసంగతి నిజమేనాయని ఫ్రెండిలు నడిగితిని. లారెన్సు మతిచెడి తిరుగుచున్నందున నతని యభిమానము కావలయు మనిషియొక డతని నిరంతరముకాచుకొని తిరుగవలసివచ్చుట వలన ఫ్రెండిలు తన బావమరదినె నియమించెనట.

ఫ్లోరెన్సు మర్చిసనుగురించియు, ఆమెతల్లినిగురించియు, నతనికెంత వరకు వివరములు తెలియునో చెప్పవలయునని యడిగితిని. నాకు తెలియనిసంగతులుగూడ కొన్నిటి నాతనివలన తెలసికొంటిని. లారెన్సు మరణమునుగూర్చి పోలీసువారొనరించిన విచారణకు వారుభయులు గూడ వచ్చిరి. పోలీసువారు వారిని లారెన్సుమృతినొందుటకేమికారణమని ప్రశ్నింపగా తమకాసంగతేమియు తెలియదనియు, ఉద్యోకుల గృహమును విడచిపెట్టి తాము మరియొక బసకిరుగునపుడు లారెన్సు గూడ తమతో నచటికి వచ్చెననియు, ఆమరుసటిదినము తనకు పట్టణములో నేదియో పనియున్నదని చెప్పి యెచటికో బోయెననియు రాత్రి యింటికిరానని చెప్పినందున తామంతగా నాతురతనొందలేదనియు వారుచెప్పిరి.

ఇంక ఫ్రెండిలు చెప్పినకథ. లారెన్సునకు మతిస్థిమితముగ లేనిసమయమున అతనికిని ఫ్లోరెన్సునకును వివాహమొనరించుటకు ప్రయత్నములు జరిగెను. ఫ్రాస్టుసతి మర్చిసనునకు తల్లి. ఆమెయె యీవివాహ

మునకు కారకురాలు. ఆమె చేయుచున్న ప్రయత్నములు నాన్నగారికి తెలిసిపోయెను. ఆసంగతి తెలసినవెంటనే యతడామెను పనిలోనుండి తప్పించెను. ఆసమయమున నేనెచటనుంటినో తెలుసుకొనవలయునని యతడు చాలవరకు ప్రయత్నించెను. నాన్నగారుకూడ నాయునికిపట్టు దెలసికొనుటకు విశ్వప్రయత్న మొనరించిరట! బ్యాంకుఖాతా యొక్కటియె కొంతయాధారముగ గన్పించెనటకాని వారికిగూడ నానూతన విలాసము తెలియనందున నేమియు చెప్పనేరకుండిరట!

ఈక్రొత్త సంగతులు నాయుహాప్రపంచమును మరల కలతపెట్ట సాగినవి. నెడ్డు సంగతి తలచుకొనినప్పుడెల్ల, తానెచ్చటనున్నదియు తెలుపక నిన్నిదినములనుండియు నన్నిచట నొంటరిగ డించిపోయినందుల కెంతేనియు గినియుచుంటిని. కోపమెంత యగ్గలముగనున్నను నాకాతనిపై ప్రేమమాత్రము నశింపకుండెను. తానుకోరి ప్రేమించి పెండ్లి యాడిన భర్తపై నేయువతికైన నెన్నటికట్టి యసహ్యస్థితి సంభవింప జాలదని నానమ్మకము. ఇతరులకెట్లు దోచినను నాకుమాత్ర మట్టి సంగతి యసందర్భముగ దోచెను. ప్రేమ పూర్తిగ నశించునెడల వలచిన స్త్రీయొక్క ప్రేమలో లోపముండవలయును. ఎంత నీచపురుషునైనను, ఒకమారతని ప్రేమించి పెండ్లియాడిన మగువ కాతనియందెట్టి విషమ స్థితిలోనైనను ప్రేమ యుండకతీరదు. అటులనేనాకు నెడ్డుపై ప్రేమ నశింపకుండెను. జానుమెడ్లీ యెట్టి నీచకార్య మొనరించినను రోజుమేరీ కతనియందలి ప్రేమ నశింపకుండెను. ఆతనినెప్పుడైన నేను దూషించు నెడల, నా మాటలకెదురాడ జాలకపోయినను, కంటనీరుబెట్టుచు "మరల నీడబ్బంతటినీకు పంపలేదా?" యని యడుగుచుండును. గ్రీన్విచ్చియందున్న విషమదినములలో నతడుతగిన సహాయము చేయకున్న నెంతయో బాధ పడుదుముగదా యని చెప్పుచు నతడొనరించిన సహాయముల

నేకరువు పెట్టుచుండును. మెడ్లీయందు నాకెట్టి గౌరవము లేకపోయినను ఆమె పవిత్రప్రేమలతానికుంజము వాడి ఆయిల్లాలెంత కుందునో యనివెఱచియైన నేనతని దూరుట మానుకొనవలసి వచ్చెను.

అంతపెద్ద వ్యాపారముచేసి, ఇన్ని యేండ్లు గడపిన నాన్నగారే విశ్వప్రయత్నమొనరించి నేనున్నతావు గనజాలనపుడు పాపము పరదేశమునందున్న నెడ్డు నేనున్న ప్రదేశము నెట్లు కనుగొనగలడను వివేకము నాకపుడు గలిగెను.

డ్యూకుఅండ్ డ్యూకు కంపెనీవారి బ్యాంకునకును, నెడ్డు డబ్బుంచిన బ్యాంకునకును ఎట్టి సంబంధము లేకుండెను. మాబ్యాంకుసంగతి జ్ఞాపకమువచ్చినపుడు నాకు క్రొత్తయూహ యొకటి జనించెను. నెడ్డు వ్రాయు జాబులు నాకెట్లు చేరును ? మాబ్యాంకు విలాసమునకైన వ్రాయవలయును లేదా పూర్వము మేము నివసించియుండిన చిన్నిగృహమునకైన వ్రాసియుండవలయును. నాన్నగారు నాయునికి పట్టు తెలియక నాబ్యాంకును మాత్రమెటులనో కనుగొని దానియందు నా పేరున డబ్బుకట్టిన సంగతి జ్ఞాపకము వచ్చెను. నెడ్డుగూడ అటులనె కట్టియుండకూడదా ? అను సంశయము నాకపుడు కలిగెను. బ్యాంకులో నాఖాతాతీసి వేయుటవలన నేనెచటనున్నదియు బ్యాంకు వారికి తెలియకపోయి యుండుననియు, నెడ్డు తప్పకుండ నచటికి నాపేరున జాబులనుగాని డబ్బునుగాని పంపియుండుననియు నాకపుడుతోచెను. ఆ మరునాడే పిమిలికంపేటకరిగి మా బ్యాంకునకరిగితిని. నా పేరున జాబులనుగాని డబ్బునుగాని ఎవ్వరైనపంపిరా యని యడిగినంతనె వారొక కట్టెడు జాబులను తెచ్చియిచ్చిరి. నా పేరున మరికొంత డబ్బుగూడ జమకట్టబడి యుండెను. యీమారు జమకట్టిన మొత్తము చాల హెచ్చుగనుండెను. నెడ్డువ్రాలుతో విలాసములువ్రాసి యుండిన ఆ

విదేశపుటుత్తరములను జూచినంతనె నాకప్పుడు గలిగిన సంభ్రమాశ్చర్యములు ఇంతంతయని చెప్పశక్యముగాదు. వానినెవరైన యూహింపవలయునేగాని వ్రాయనేరరు. నలుగురు చూచుచుండగా నచట నాయుత్తరముల కట్టనువిప్పుటకు నాకిష్టములేకపోయెను. విదేశపుటుత్తరములు మాత్రమెగాక లండనునగరమునుండికూడ నొకజాబు నెవరో వ్రాసియుండిరి. దానిని విప్పిచూడగా మాయింటి యధికారి వ్రాసియుండెను. ఆరుమాసములనుండి యింటిఅద్దె యివ్వలేదనియు అందువలన తనకు యిబ్బందిగనున్నదనియు నతడు వినయపూర్వకముగ వ్రాసెను. వివాహానంతరమొక సంవత్సరముహాయిగ కాలక్షేపముచేసిన ఆయింటి సంగతియె చాలదినములనుండి నాకు జ్ఞాపకములేకపోయెను. ఈయుత్తరము జూడకున్న యింకెన్నిదినములు మరచియుందునో? వెంటనె అతనిజూచి బాకీపైకమంతటిని చెల్లించి ఆలస్యముచేసినందులకు క్షమాపణము కోరుకొని పిమ్మట నాయింటిలో నీయుత్తరములన్నిటిని సావకాశముగ చదువుకొనవలయునని నేను నిశ్చయించుకొంటిని.

నెడ్డు యిప్పటివరకు సజీవుడైయున్నాడను దృఢనిశ్చయముకలిగినంతనె నాకపరిమితానందము కలిగెను. రోజు మీరీ నాసవతియోయని యనుమానించుచు విచారసముద్రమున కొట్టుకొనుచుండిన సమయమున నెడ్డు మరణించిననె నాకెక్కువ సంతసకరముగ నుండునని యెంచితిని. కాని అతడు మరణింపక సజీవుడై యుండుటవలన నాకిపుడపరిమితానందముకలిగెను.

నెడ్డు వ్రాసిన లేఖలన్నిటిలో కట్టకడపటిదానిపై సిడ్నితపాలాఫీసు ముద్రయుండెను. అనగా అమెరికా సంయుక్తరాష్ట్రము లందలి న్యూసౌత్ వేల్సను రాష్ట్రమునుండి వచ్చెను. దానసంపి ఆరు వారములైనది. అదియె కడపటిదిగాన దానిని మొదట జదువనెంచితిని.

గ్రామాంతర మరుగుట వలన చాల దినములనుండి యింటికి రాలేదని యింటియజమాని యగు పూలవర్తకునకు సమాధానముచెప్పి అద్దెనంతటిని చెల్లించి యిల్లుమాత్రమింకను కావలయునని చెప్పితిని. ఆ యింటియవసరము మరల నుండునేమోయను అనుమానము నన్నప్పటికి గూడ విడువకుండెను. నాజీవిత స్థితియంతయు నస్థిరమును, ఆకస్మికప్రమాద పరిపూరితము నగుచుండుట వలన, ఏగడియ యెట్లుండునోయను భయసంశయములు విపరీతముగనుండెను.

పిమ్మట తొంటి చిన్నగృహమున ప్రవేశించి ధూళిధూసరితమైన కుర్చీయందటులనే కూలబడి యుత్తరములు జదువనారంభించితిని. మొదట నేననుకొనిన రీతిని కట్టకడపటి యుత్తరమును మొదట విప్పితిని.

ప్రాణప్రియా ?

నీకీయుత్తరమందుసరికి లేనిపోని బెంగలతో నాకు పిచ్చియెత్తియుండునని నమ్మెదను. నీస్వంతదస్తూరిని నీ సమాచార మేమియు తెలియనందుల కెంతవిచార మొందుచున్నానో దైవమునకెఱుక. అదియె నాపిచ్చికి కారణము. నీ విపుడు గ్రీన్విచ్చిలో నున్నావనియు, మహాద్వీపత్తువలన క్షోభిల్లుచున్నావనియు వినికిరిగ తెలసినది. కాని నీవీసరికి స్వస్థచిత్తురాలవగుదువను నమ్మకమున నీలేఖను వ్రాయుచున్నాను. బ్యాంకు మేనేజరు పేరున నీ ఖాతాలో జమకట్టుటకుగాను వేయిసవరనులను నేడే పంపితిని.

"నాబహిఃప్రాణమా ! లోర్నా ! యీలేఖను చూచినవెంటనే నీకుశలవార్తను తంతిమూలముగ తెలియబరచుము. ఒకనెలదినముల వరకిచట నుండెదను. ఈనెలదినములలో నీయొద్దనుండి జాబుగాని, తంతిగాని రానియెడల వెంటనే లండనునగరము బయలుదేరి వచ్చుచున్నాను. నిన్నెచట చూడగలనో ఆసంగతినైన బ్యాంకువారికి చెప్పుము.

"నేనిప్పటిలో రాకూడదు. వ్యవహార పరిస్థితులు చాల చిక్కుగ నున్నవి. ఇప్పుడిచ్చట నుండకపోవుటవలన చాల నష్టమువచ్చును. అయిననాకది యంతలెక్కలేదు. ఈప్రపంచమంతటను నాకు కావలయు వస్తువు వొక్కటియెగలదు. దానిపేరు లోర్నా. నాబహిఃప్రాణమవగు నీవుతప్ప నాకింకేమియు నవసరములేదు. నాసర్వస్వమవగునీకు సంతోషమొనగూర్చుటకై నేనిపుడింత దూరదేశము చేరితిని. అట్టిస్థితిలో నీమంచిచెడ్డలు తెలియనపుడు నాకీధనమేల ? జీవమేల ?

"నేనంత మంచిలేఖరిని కానని నీవెరుగుదువు. అందువలన వుత్తరమును బాగుగ వ్రాయలేక పోయియుందును. అయినను యీ మాటలనుబట్టి నామనసునందున్న భావములను నీవు గ్రహింపగలవని నమ్ముచున్నాను.

"నేనిపుడనుకొనినటులంతయు సక్రమముగ జరుగునెడల నామనో హారి ప్రపంచమంతటి నొక ఆటవస్తువుగ భావించి తనయిష్టమువచ్చిన రీతి నాడుకొనవచ్చును. నేను వచ్చులోపల మీ ముసలినాన్న గారి నెన్నడైన జూడ తటస్థించునెడల నతనితో నామాటలుగ నిట్లు చెప్పుము. అనతికాలముననె తమతో సరితూగు సంపదల ననుభవించి తీరెదనని తమకు వాగ్దాన మొసగియుంటిని. ఇప్పుడాస్థితికి వచ్చితిని. తమస్థాయికిమించిన భాగ్యము సంపాదించితిని గావున తమ తనయను పరిణయ మొందినందులకు మన్నింపుడు."

"మెయిలు స్టీమరు మరియొక యరగంటలో ౹ యలుదేరుచున్నది. ఇంకొకనిముష మాలస్య మొనరించినను లేఖ దానికందదు. అందువలన నింతటితో విరమించుచున్నాను.

ఇట్లు
నిన్ను ప్రేమించు నీప్రాణసఖుడు
నెడ్డు."

దీనిలో వ్రాసిన ప్రకార మతడొనరించునెడల నతడమెరికాలో స్టీమ రెక్కి రెండువారములగునని లెక్కించుకొనిచూచితిని. ఈలేఖ యిచ్చటికి వచ్చుటకు మూడువారములైనదని లేఖపైనున్న తపాలాముద్రలవలన తెలియుచున్నది. అనగా నెడ్డు మరి వారము రోజులలో లండనుచేరునని యనుకొంటిని. మెయిలుటపావచ్చుట కెంతత్వరితయాన సౌకర్యము లున్న నంతత్వరితగతి నతడిచటికి వచ్చునని యతని యుత్తరముల ధోరణినిబట్టి గ్రహించితిని.

ఒకటి వెనుక నొకటిగ తక్కినలేఖలను గూడ చదివితిని.

నేను గ్రీన్విచ్చి యందున్న సంగతి యతనికెట్లు తెలసినదోయని నేనాశ్చర్యపడజొచ్చితిని. అతడు రోజుమేరీ విషయమై యేమియు వ్రాయలేదు. గ్రీన్విచ్చి యందుండునపుడు నాకామె యెచటకనబడి

పోవునో, నేనందుపై నేమనుమానింతునోయను సంకోచమైన ఆయన కున్నట్లూ యుత్తరములందొక దానిలోనైన గన్పించలేదు.

తాను త్రవ్వించుచున్న బంగారుగనులను గూర్చియు అందువలన లభించు పెన్నిధులనుగూర్చియు నతడెంతయో గ్రంథము వ్రాసెను.

ఆగనుల విషయమున ఆష్ట్రియా ప్రభుత్వమువారితో నేవియో తగాయిదాలు వచ్చియున్నవనియు, అయినను భయమొందవలసిన యవసరములేదనియు, నాన్నగారివద్దనుండి పోయిన కాగితములు తనకు లభించునెడల నెట్టిచిక్కును లేకపోయెడిదనియు నతడు వ్రాసెను.

కడపటి యుత్తరము నాకుముందుగ వ్రాసిన జాబునందతడిట్లు వ్రాసెను. "ఇచ్చటి వ్యవహారములన్నియు నతియద్భుతముగా పరిష్కృతమైనవి. నీవు మహాదదృష్టవంతురాలవగుటయె దానికి కారణము. పొగడికకుకాదు గాని నీవు గొప్ప సూరవనితవని చెప్పవలసియున్నది. అన్నియు బాగుగనున్నవనిగాని, యుత్తరములే వ్రాయవు. అదిమాత్రం బాగులేదు. అందువలన నాకెంత బాధగనున్నదో నీవు గుర్తించలేదు............" అని యేమియో వ్రాసెను.

మరియొక లేఖయందతడిట్లు వ్రాసెను. "నీకు నేనెన్నియో వివరములను తెలుపుచూ నొకలేఖను వ్రాసియుంటిని. ఎంతకాలమునకు నెట్టి ప్రత్యుత్తరము రాకుండుటను బట్టిచూడ నాలేఖ పరులచేతిలో పడినట్లు నాకనుమానము గలుగుచున్నది. ఎవరిచేత బడినను సరియె కాని, లారెన్సుడ్యూకు చేతులలో మాత్రము పడకుండచేయుమా భగవంతుడా' యనిదైవము ననేకవిధముల బ్రార్థించుచున్నాను. అతనికా యుత్తరమే అందునెడల నాయాశలన్నియు నడుగంటును. నేనిదివరకు నీవువ్రాసినట్లు ఫెర్నుద్వీప పటముపై నేనుచాలా వరకాధార పడియున్నాను. ఆపటముగాని, దాని ప్రతి మరియొకటిగాని నాకు వెంటనే కావలసియున్నది. ఆపటము తాలూకు నకలు మరియొకటి జార్జియొద్ద

నుండెను. వాడాప్రతి తనయొద్దనున్నట్లు తానుమరణించుటకు ముందొక వారముక్రిందట నాకువ్రాసిన యుత్తరములో తెలియబరచినాడు. నేనీ సంగతిని క్రిందటిలేఖలో నుదహరించితిని. శ్మశానమందలి గృహములో నీవుచూచిన ఆస్త్రీ యింతకాలమునుండియు వానితో నబద్ధములాడుచు వాడు తనకుమారుడేయని చెప్పుచుండెనట. వాడును, లోకులు నామాట నమ్ముకొనుచుండిరట! ఆమె నెక్కడనో చూచినట్లు నాకు జ్ఞాపకమున్నది. మాతల్లికి జబ్బుచేసినపుడామెతో నుపచారార్థమీామె లండనునగరమునకు వచ్చినట్లున్నది. దీనినిబట్టి చూడగా నొక యను మానము గలుగుచున్నది. నేనుకాక మాతల్లికి మరియొక కుమారు డుండి యుండవలయును. నాకపుడు కేవలము బాల్యప్రాయమై యుండుట వలననే నాసంగతిని మరచియుండవలయును. నేను దగ్గరలేని సమయము నను, వాడు కేవలము బాల్యదశయందున్నపుడును, మాతల్లి మరణించి యుండవలయును. అప్పుడా టక్కరివానిని తనకుమారునివలె బెంచి వానిని లోకమునుగూడ వంచించియుండవలయును. ఇవి యంతయు నాయూహాపరికల్పితము. ఇందెంతవరకు సత్యమున్నదో భగవంతునకే తెలియవలెను. నేను తిరిగి లండనునగరము వచ్చునప్పుడీసంగతులన్నియు రూఢిగ తెలియగలవు. అయ్యోజార్జి! ప్రియసోదరుడా! ఎంతదురదృష్ట వంతుడవై మరణించితివిరా నాయనా! నీకును నాకునుగాక మరి యిరు వదిమందికైన సరిపోవునంతటి యాస్తియిచట నున్నట్లు నీవేమి యెఱు గుదువు? ఇంతవరకు నాకీసంగతినైన తెలుపకుంటివి? నాకొక తమ్ము డున్నాడను సంగతి ఇదివరకే తెలసియుండెనా?——"

తక్కినయుత్తరము లన్నిటికంటె నీయుత్తరము నాకెక్కువ ఆశ్చ ర్యము కలిగించినది. "ఇదివరకె వివరములన్నిటిని వ్రాసితి" ననినలేఖ నాకెచ్చటను గన్పించకుండెను. నెడ్డు అనుమానించినటు లాయుత్తర మింకొకరి చేతిలో పడియుండవచ్చును. కొన్నియుత్తరములపై మా

చిన్నకుటీరపు విలాసమునుకొట్టి బ్యాంకువిలాసము వ్రాసియుండుటయు నాకు గన్పించెను. అటులింటికివచ్చిన యుత్తరము లందొకటి పోయి యుండవచ్చును. లారెన్సు నాయింటిచుట్టు నెవరినో కాపుంచుటయు ఇంటిని దోపింప బ్రయత్నించుటయు జరిగినరోజులలో నీయుత్తరము వచ్చియుండవలయును. అప్పుడు లారెన్సు మనుష్యులెవరో దాని నపహరించి లారెన్సున కిచ్చియుండవలయును. దాని నతె డపహరించి యుండవలయు.

అజాబులో తానాపటమునకలు దాచియుంచిన స్థలమునుగూర్చి యేమైనా వ్రాసెనేమో, వ్రాయకుండునెడల జానుమెడ్లీ కారహస్య స్థలమెట్లు తెలియును? వ్రాసియేయుండె ననుకొందును. అట్లయిన లారెన్సు అపహరించిన లేఖ జానుమెడ్లీకెట్లుచిక్కెను? ఒకవేళ లారెన్సు మెడ్లీ నాపనికి నియమించెనేమొ?

అప్పుడునాతల యెన్నెన్నియో వెఱ్ఱియూహలపాలయ్యెను. యెంత యూరకొందుమన్నను మెదడు పనిచేయుచునే యుండెను. చివరకు తలనొప్పియెత్తి పోటుపెట్టసాగెను. కలలోతిరుగుచున్న మనిషివలె నేవేవియో వెఱ్ఱియూహలతో నేనిల్లు చేరితిని. ఈవిషయములన్నిటిని నేను రోజుమేరీకి చెప్పవచ్చునా? చెప్పవచ్చునెడల యెంతవరకు చెప్ప వచ్చును, ఎంతవరకు చెప్పగూడదు? ఆమెతో చెప్పకున్న యింకనా కిదమిద్ధమని నిరూపించి చెప్పగలవారెవ్వరు? అని యేవేవియో తలపు లెడతెగకుండ వచ్చుచుండెను.

ఈయుత్తరములో వ్రాసిన జార్జియను నాతెడామెభర్త యగునా కాదా? ఒకవేళ యామెభర్త కాకపోయినయెడల మాకిరువురకు నెడ్డే భర్తయగునాకాదా?

ఇప్పటికిగూడ నేనింతసంశయమొందుట యితరులకాశ్చర్యము గలిగింపవచ్చును. కాని దూరమాలోచించి చూచు నెడల కలతవడియున్న నామనమునకట్లుతోచుట వింతగాదని వారు గ్రహింపగలరు. ఒకప్పుడు నెడ్డు యామెభర్తయగునా కాదాయను అంశమును చర్చించునపుడు దస్తూరినిబట్టి నిర్ణయించవచ్చునను యూహతో నెడ్డు వ్రాసినయుత్తరమునొకదాని నామెకు జూపించితిని. అంతట నామె త్రుళ్లిపడి తనభర్త వ్రాతవలెనున్నదని పలికెను. కొంత సేపటికి మరల తెలివితెచ్చుకొని, కొంతమంది యన్నదమ్ములదస్తూరి యొకేమాదిరియుండునని చెప్పెదరనియు అటులనే జార్జియెడ్వర్డుల దస్తూరి యొకేవిధమున నుండియుండ వచ్చుననియు యిందువలన తాను చెప్పినమాటలయందనుమానింపదగదనియు నామె నమ్మకముగ బలికెను. అంతియగాక తనభర్త మరణించెనని యామె రూఢిగ జెప్పుచుండెను. చెప్పుటయెగాదు మరియొకరిని వివాహమొనరించుకొన బ్రయత్నించుచున్నది. తగినంత కారణములేనిది యామె యేలనమ్మును? ఒకవేళ పొరపాటుపడియెననియె యనుకొందము. అయిన నేనిపుడామెకాసంగతి తెలుపుట మంచిదా?

మరునాడు నేను మరల బ్యాంకునకరిగితిని. నాపేరనొక వాయువార్త వచ్చియుండెను. దానిలో "బయిలుదేరితిని. దారిలోనున్నాను." అనియుండెను. ఎవరా తంతినిచ్చియుండిరో తెలియకుండెను.

అటుతరువాత నేననుదినము బ్యాంకునకును, మాపూర్వ గృహమునకును, బోవుచుంటిని. ఆ గృహమును మరల సుభ్రముగ బాగుచేయించితిని. నే ననుదినమెచ్చటికిట్లు పోవుచుంటినో తెలియక రోజుమేరీ యాశ్చర్యపడుచుండెను. నా దంతయు రహస్యజీవనము. ఎవరితో నేమి చెప్పుకొనుటకును వీలులేకుండెను. చెప్పినను లాభమేముండును? దేని

వలన చెడుగువచ్చునో ! దేని వలన లాభము వచ్చునో యెవరు నిర్ణయించి చెప్పగలరు ? యీ నూతన యుదంతము నా వైఖరిని మరల మార్చివేసెను. పూర్వమువలె నా సంగతుల నెవరికిని చెప్పకుండ నుండవలయునను నా రహస్యప్రవృత్తి మరల సన్నావరించెను. అయినను ప్రతియంశమును గూడ చిన్నిమార్టినుకు కెరింగించుచుంటిని. వాడు మాత్రము దేనికిని ప్రత్యుత్తరమీయకుండెను.

ఇప్పటికి మార్టినుకు నారుమాసములు దాటినవి. వసంతకాలమప్పుడె చాలవరకు గతించెను. అబ్బ ! కాల మెంత త్వరితగతిని బోవుచుండెను! గత రెండు వారములనుండియు నెడ్డు రాకకెదురు జూచుచుండుట వలన కొంచెము దీర్ఘముగ గన్పించినవి కాని అంతకుముందు వారములు రోజులవలెను, రోజులు కనురెప్పవేయు కాలమువలెను గడచిపోవుచుండెను.

రోజుమేరీతో గలసి అవసరమువచ్చినప్పుడు కూలిమనుష్యులను గూడ బెట్టి మానాన్నగారియింటిని మరల నెప్పటియట్లు బాగుచేయించితిమి.

*　　*　　*　　*

ఇన్ని యేర్పాటులను జేయించుచుంటినేగాని మనసులో భయము మాత్రముపోలేదు. నాకనియింతచక్కగ చేయించుకొనుచున్న యీవసతులన్నిటి ననుభవించుట కింకెవరిచటికి దాపరించెదరో మరల నేకారణమువలననైన నేనెచటికైన బోవలసివచ్చునేమోయని శంకించుచుంటిని. కష్టములన్నియు నొంటిగనిచాటిపోవుటవలన నాబ్రతుకెప్పటికప్పుడు గాలిదుమారమునకెగయు చిరులతవలె నస్థిరముగ గన్పించుచుండెను. అందువలన లేనిపోని యనుమానములు పెచ్చుపెరుగుచుండెను.

పెద్దు రావలసిన సుదినమాసన్నమగుచుండెను. కట్టుకొనుటకు మంచిదుస్తులను కుట్టించుకొనవలసి యుండెనుగాని నాన్నగారిటీవలనే మరణించుటవలనను లారెన్సు మరణించి రెండువారములైన పూర్తిగ గడువనందువలనను క్రొత్తదుస్తులను కుట్టించుటకు వీలులేకపోయెను. ఒకనాడనాలోచితముగ నేనేదియో పనిచేసికొనుచుండు సమయమున మాకుట్టుపనికత్తె నన్నెటులనో యొప్పించి తెల్లనిపట్టుగౌను నొకదాని కుట్టి నాకుయిచ్చెను. చేసినపని యంతగాగన్పించకున్నను నాయొద్ద నామెచాల హెచ్చుడబ్బు పుచ్చుకొనెను. ఆగౌను బాగులేదని మరి యొకదానిని, అదిబాగులేదని ఇంకొకదానిని కుట్టించితిని. వీటిబిల్లులను ఇంటిమరామత్తు బిల్లులను చెల్లించవలసివచ్చినపుడు లారెన్సు సహవాసము రిక్తగపోలేదనియు, ఆతనికితగిన చెల్లెలునగుదుననియు ననుకొంటిని. డ్యూకు అంకు డ్యూకుకంపెనీవా రిన్నిసంవత్సరముల నుండియు కష్టబడి కూడబెట్టిన ధనమంతటి నేననతికాలముననే వెచ్చించెద నేమోయని భయమొందితిని.

*　　*　　*　　*

ఒకనాఁడు చక్కఁగశృంగారించుకొని, చక్కఁగనలంకరించుకొన గలిగినందుల కెంతేనియు సంతసించుచు వీధిచావడి ప్రక్కనెయుండిన పెద్ద హాలులో కూర్చుంటిని. రోజుమేరీ ఆసమయమునం దెచటికో బోయెను. ఆమె యెప్పుడువచ్చును, వచ్చి యెప్పుడునన్ను చూచును, చూచి నా అలంకరణచతురతను యెప్పుడుమెచ్చుకొనును అని నేనెంతయో యువ్విళ్లూరుచుంటిని. ఆమె యెప్పటికిని రాకుండుట మనసునం దెంతేనియు గినియజొచ్చితిని. ఇంతలో ఫ్రెండీలు లోపలికివచ్చి "లారెన్సుసతి తమదర్శనార్థము వచ్చినది" యనిచెప్పెను.

నాకప్పుడేమిచేయుటకును తోచలేదు. ఫ్లోరెన్సు నప్పటిలో జూచుట నాకెంతమాత్రము నిష్టములేకుండెను. అట్లిష్టము లేకుండుటకు నిజము దాచనేల ఒకకారణముగలదు. ఆమెను జూచినంతనె నాకపరిమితమగు భయముగలుగును. అంతియగాక నాజీవితము నందింక నెట్టియాపద రావలసియున్నను యీమనిషిమూలమునగాని, యీమెతల్లివలనగాని రావలసియుండుననియు వేరొకవిధముగ నాకెట్టి యాపదయు రాజాలదనియు నేననుకొనుచుంటిని.

"ఆమెయొక్కతియె వచ్చినదా? లేక వెంట నింకెవరైననున్నారా? అని ఫ్రెండీలు నడిగితిని.

"మరియెవ్వరును లేరు. ఆమెయొక్కర్తియె వచ్చినది." అనుచు నతడు చిన్నదగ్గు దగ్గెను. ఒంట్లోబాగులేదని చెప్పి ఆమనిషి నావలకు పొమ్మనరాదా?" యను నట్లాదగ్గు నాకర్థమయ్యెను.

"అలాగునకాదు ఫ్రెండీలు ఆమెనిపుడు చూచుటయె మంచిది. కాని నీవుమాత్రము గుమ్మముదగ్గరనే వేచియుండుము. పిలచిన తక్షణమె లోనికిరావలయును." అని వాని హెచ్చరించితిని.

"చిత్తము." అనుచు నతడావల కరిగినవెంటనే ఫ్లోరెన్సునులోపల ప్రవేశపెట్టెను.

వితంతువేషము వేసినను గూడ విచారము మాత్ర మావంతయు లేనటు లామె మొదటినుండియు చకచక మాటలాడ నారంభించెను. ఆమె కేదియో గొప్ప గుండెధైర్యమున్నట్లు నాకుతోచెను. అందువలన నాకుత్సాహముగాని విచారముగాని కలుగలేదు.

లోపలికివచ్చి యామె యిటునటు నొకమారు చూచి తరువాత నావంకతిరిగి "ఇదియె మంచిపద్ధతి ఇల్లుండుటయె నాకిష్టము. కాని మీయన్నగారి దదియంతయు నొకవిధమైన మతము. ఆతనియుద్దేశ్యములువేరు. ఈయింటి యందంతట నతడేవేవియో మార్పుల నొనరించెను. ఆమార్పులు నాకంతగా రుచింపకున్నను ఆతనియుద్దేశముల కెదురుచెప్పుట నాకిష్టము లేకుండెడిని. అందువలన నేమియు మాట్లాడకూరకుండెడిదానను. అయిన నతడదియెపనిగ అవసరమైనవి కానివి యెన్నియో మార్పులనుచేయించి యిల్లంతటిని అందవికారము చేసెను." అనెను.

"అవును. నాకుకూడ అందవికారముగనే కన్పించెను." అని నేనంటిని.

లారెన్సు నడిగి ఖర్చునకైన డబ్బుతీసికొని పోవలయునని వచ్చిన నాడు తానును తన తల్లియు నన్నుపెట్టిన బాధల నింతవేగ మీయామె యెట్లు మరచిపోయెను. ఏముఖముపెట్టుకొని మరల నీరీతి సరససల్లాపముల నారంభించుచున్నదని నాకాశ్చర్యము గలిగెను. అయిన నాగాధ నెటులయిన నామెకు జ్ఞాపకముచేసి నేనాసంగతి నెంతమాత్రము మరువలేదను సంగతి నామెగుర్తించుటకై "మరల యిల్లంతటిని మరామత్తులు చేయించి బాగుచేయించితిని. నౌకరుల బసలు కేవలము నరకకూపములవలెనున్నవి. మీరంత గారాబమున నన్నాదరించి మూడవ

అంతస్థు మీదిగదిలో బసకుదిర్చిన నాటిరాత్రి పాపము నౌకరులెట్టి బాధలుపడుచున్నారో గ్రహింపగలిగితిని.” అని పలికితిని.

ఆమాటలకామెకు కొంతశృంగభంగమయ్యెను. కాని ఆసంగతి తెలియకుండ నామె దాచ ప్రయత్నించెను. ఎంతదాచప్రయత్నించినను ఆముఖముమాత్రము చెప్పివేయుచుండెను.

అయిన నామె యించుకయు సంకోచింపక “నిజముగ లోర్నా! ఆవిషయములో నీవు నమ్మెదవో నమ్మవోగాని, నా ప్రమేయమేమియు లేదు. నిన్నట్లు బాధించుట నా కెంతమాత్రము యిష్టములేదు. అయిన నేనేమిచేయగలను?” అని పలికెను.

“సరియె. జరిగినదేదో జరిగినది. ఇప్పుడా ప్రసంగమెందులకు? కాని యిప్పుడు నీవేదియొ పనిమీద వచ్చినట్లున్నదే?”

* * * * *

మేము క్రిందటిమారు అనగా నన్ను బలవంతముగ జంపప్రయత్నించిననాటిరాత్రి, కలసికొనిన యప్పటిస్థితికి నిప్పటిస్థితికి నెంతభేదమున్నది? పరిస్థితులన్నియు నొక్కమారుగ తలక్రిందులైనవి. ఆసంగతి స్పష్టముగ గన్పించుచున్నను, ఎప్పటి కేవిపరీతము సంభవించునో యను భయము మాత్రము నా కధికమగుచుండెను.

ఈమె రాకడజూచు నప్పటినుండియు నా భయము మరింత హెచ్చెను. ఇప్పుడీమె యేదియొ పెద్ద యెత్తుగడమీద వచ్చెను. ఆ ముఖవైఖరి యాచనకు వచ్చినదానివలె లేదు. ఆమె నెంతనీచముగ పరిభవించి యావలకంపుట కవకాశమున్నను, ఆమె యాచనకే వచ్చియుండినయెడల అన్నభార్యగదాయని దయతలచి యేమైన నీయ వలయునని బుద్ధి పుట్టినది.

నే ననుమానించినట్లు ఫ్లోరెన్సు ఏదియో పెద్ద యెత్తుగడ మీద వచ్చినదని నాకు వెంటనే విదితమయ్యెను కాని ఆమె “అసలునకె ఎసరు పెట్ట” వచ్చినదని నేను గ్రహింపజాల కుంటిని.

“లోర్నా నిజము చెప్పిన నీ వేమనుకొనియెదవోగాని నీ యలంకరణము మాత్రము పరిపూర్ణ శోభస్కరముగ నున్నదిసుమా ? సంపూర్ణత్వసిద్ధి నీ యరచేతియందున్నట్లున్నది. అనన్య సామాన్యమగు యింత నైపుణ్యము నీ కెచటినుండి వచ్చెనో యని నా కాశ్చర్యమగుచున్నది.”

“ఆఁ ఆలాగునా ? దాని కేమిగాని నీవు వచ్చినపని యేదియో కానిమ్ము. నా దుస్తులను గూర్చి నీతో చర్చించుట కిప్పుడు నాకు వేళ లేదు. అసలునీతో నేమి మాట్లాడుటకు గూడ నిష్టములేదు. మనమిద్దరము మాట్లాడదగిన అంశములేమియు లేవనియె నా యుద్దేశము. అయిన నీ వేదియొ కొంటెతనపు ఎత్తుగడమీద నిచటికి వచ్చితివని నా యూహ !”

“నన్ను జూచిన నీ కిట్లు తోచుచున్నదా యేమి? సరియె కానిమ్ము. నీ మంచికోరి స్నేహభావమున రాజీ చేసికొనవలయునని నేనింత శ్రమపడి వచ్చితిని. నీ కంత అయిష్టముగ నున్నప్పుడు—”

“ఆహా నాకిష్టము లేదుగాకలేదు, రాజీలేదు గీజీలేదు వెంటనే యావలికి దయచేయవచ్చును.”

“అక్కర లేదనునపుడు నా కేమి పిచ్చిపట్టినదను కొంటివా ? నేను వచ్చినసంగతిని రెండుమాటలలో చెప్పిపోయెదను. నీవంత విసుగుకొననక్కరలేదు. నా పనినంత విస్తరించి చెప్పనక్కరలేదు. నీ తండ్రి రేపు మరణించుననగా తొలినాడు తన సర్వస్వము లారెన్సున కిచ్చి వేయుచు నొక వీలు వ్రాసినాడు.”

ఫ్లోరెన్సు చెప్పినమాట నాకు కొంచెము భయము గలిగించినది. కాని ఆమె నన్ను నిదానించి చూచుచుండుటవలన నామనసు నామెకు తెలియనీయ కుండుటకై యెటులనో ధైర్యము చిక్కబట్టి యెట్టియాశ్చర్యమును దోపనీయక,

“ఆ వీలు నీ యొద్దనున్నదా ?” అని యడిగితిని.

"ఆహా ! ఇచటనేయున్నది."

ఇంతటక్కల మారిమనిషి ఆవీలు నిచటికేల తీసుకొనివచ్చినది చెపుమా యని నాశ్చర్యము కలిగెను. అసలు వీలు నెచటనో న్యాయ వాదియొద్ద భద్రముగానుంచి దానినకలు తెచ్చి నాకు జూపింపవలసి యుండెను. లేకున్న న్యాయవాదిద్వారా వ్యవహారమంతటిని నడిపింప వలసియుండెను. అట్లుచేయక నామె యింత తెలివి తక్కవగ దస్తావేజు నిచటికి దీసికొని రాకూడదను కొంటిని.

"నేనది చూడవచ్చునా ?"

వెంటనే సంచిలోనుండి మడతలు పెట్టిన కవరలోనుంచిన దస్తావేజు నామె పైకితీసి విప్పినాచేతికిచ్చెను. నా కప్పుడట్టి బుద్ధియె పుట్టియుండిన నాదగ్గరనున్న నిప్పుగుండములో దానిని పడవైచి మరల నామె తీసి కొనకుండ నడ్డగించ వలసినదని ప్రెండిలునియోగించ వలసియుండెను. కాని నాకట్టి బుద్ధి పుట్టలేదు. పుట్టినను నేనట్టి సాహసకార్యము చేయ లేనని యెరిగియె యామె యాకాగితమును ధైర్యముగ నాచేతికిచ్చి యుండును.

వీలు నాన్నగారి స్వహస్త లిఖితమనుటకు సందేహములేదు. దొంగ సంతకమని వాదించుట కెట్టి యవకాశమునులేదు.

దాని యందేమున్నదో తెలసికొన వలయునను ఆతురతలో దాని నంతటినొక మారతిత్వరితగ గన్పించినది. సాక్షులందరును గూడ ప్రతి కూలురే. ఒకమాటగాని, మనిషిగాని అనుకూలముగ నున్నట్లు కన్పించకుండెను.

కాని ఆ సాక్షులయందు మాత్రము నాకు తీవ్రమగు అనుమాన ముండెను. ఇటువంటి ముఖ్యములైన దస్తావేజులందు ఘరానామను ష్యులను సాక్షులుగ నుంచుట వాడుక. దీనిలో జోకీయును, ప్రాస్టు

సతులు సాక్షి సంతకములు జేసిరి. అనగా లారెన్సు అత్తగారును, నౌఖరును లారెన్సునకు అనుకూలముగ వ్రాసిన దస్తావేజులో సంతకములను చేసిరి.

"లారెన్సు వివాహమైనపిమ్మట నాన్నగారు ఫ్రాస్టుసతి నావలకు తరిమిరని వింటినే? ఆమె సంతకము దీనిలోని కెట్లువచ్చినది?" అని నేనడిగితిని.

"అలాగునా? ఆహాఁ.! ఈజాకీముఅన్నవాడు నాకుతుక నులిపి నానోరు మూసిన జర్మనుడేనా?"

* * * *

అపుననుసట్లు ఫ్లోరెన్సు భుజములను గదలించెను. "ఇటువంటివీలు దగ్గరనుంచుకొనియేనా? మీరాదినము నన్నంతగా బాధించిరి?"

ఆమాటలకామె కోపముతో "ఆపనితో నాకెట్టినిమిత్తములేదని చెప్పియుంటినే! మరల నేలనాసంగతి? నాకీవీలు యీరోజుననె కన్పించినది. లారెన్సు కాగితములన్నిటిని తిరుగవేయుచుండగా వాటిలో దొరకినది." అని సమాధానపూర్వకముగ జవాబులు చెప్పినది.

"అయిననేమి? ఈ వీలు పుట్టినసంగతి ఫ్రాస్టుసతికిని, ఆజర్మను నౌఖరునకును, చాలకాలముక్రిందటనే తెలసియుండవలయునుగదా! వారేల నన్ననవసరముగ బాధించిరి?"

"మీనాన్నగారు దానిని చింపివేసిరేమోయని వారనుకొనిరి."

"అట్లయిన నది లారెన్సుకాగితములలోని కెట్లువచ్చెను?"

"నాకు తెలియదు. మీనాన్నగారాయనపేర తపాలాద్వారా పంపించియుండవలయును."

"నాన్నగారు మరణించిన తొలిదినమున ఫ్రాస్టుసతి యచటనే యుండెనందువా?"

" నేనతిత్వరితగతి నీప్రశ్నలన్నిటి నడుగుచుండగా నామెకు సమాధానము చెప్పుటకష్టమయి చేతిరుమాలుతో మొఖము తుడుచుకొననారంభించెను.

" అవునామె యచటనేయుండెను. "

" ఆమాట ఋజువుకాగలదనుకొనియెదను. "

ఆహా ? జాకీయము ఋజువు పలుకగలడు-అతడే ఆమెను లోపల ప్రవేశపెట్టెను. "

" నాన్నగారామెకు కబురంపిరా ? ఆమెయెవచ్చినదా ?

" లేదు. మీనాన్నగారు కబురంపినమీదటనే వచ్చినది. "

" జాకీయిముచేతనే కాబోలు కబురంపినది ? "

" అవును. "

నేను మరల నామెవీలు నామెకిచ్చివేసితిని. దానినందుకొనునపుడామెచేతులు వడకుచుండెను. ఆకంపమట్లుండగనే యామెచేతిసంచిని తెరచి దానిలో నాదస్తావేజునుంచుకొనెను. ఆపిమ్మట నిట్లడిగెను.

" వీలుచూచితివిగద ! ఇంక నేమిచేయనెంచితివో చెప్పుము ? " అని ఖండితముగ పలికెను.

"ఏమియును లేదు."

"ఏమియును చేయవా ?

"ఏమైన నెందుకు చేయవలెను ? "

"ఎందుకా ?—సరియె కాని—"

"కానియు లేదు గీనియులేదు. నీ విపుడేమిచేయవలయునో నేను చెప్పెదను వినుము. ఆ కాగితములను తీసుకొనివెళ్లి యొకన్యాయవాదికిమ్ము. అతడు దీనిని కోర్టులో దాఖలుచేయుచు నే నిదివరకు దాఖలు

చేసిన వీలునురద్దుపరపించును. నా వీలును వ్రాసినపిమ్మట మూడువార ముల తరువాత నాన్నగారి వీలువ్రాసిరి. అంతియగాక నాకీయాస్తి వచ్చుటకు విధించినషరతు అనగా తాను మరణించిన ఆరుమాసము లలో నేను సంతానవతిని కావలయునను షరతు అసందర్భముగా నున్నది. నీ వీలులోని షరతులు సహేతుకముగనున్నవి. నా వీలు కంటె నీ వీలు అనేకవిధముల ప్రశస్తముగ నున్నదని నాయభిప్రా యము. గనుక యుపేక్ష చేయకుము.

* * * * * *

ఉపాయాంతరమేమియు తోచక అయినను అధైర్యమొంది నటు లామె తలంచకుండ నామెను "దబాయించవలయునని యిట్లంటిని. ఈ వీలునం దెచటనైన లోపముండక పోవునా యను యడియాశయొకటి లోపలనున్నను దాని నెదిరించి గెలువగలమను ధైర్యమేమియు లేకుం డెను. నా మాటలకామె వెంటనే ప్రత్యుత్తరమీయకుండుటవలన నాకు ధైర్యము హెచ్చయ్యెను.

"ఇన్నిదినములనుండి లారెన్సు దీనినేల కోర్టులో దాఖలుచేయ లేదో?"

"ఏమో! కవరు విప్పనైన విప్పలేదు. చివరదినములలో లారె న్సున కెట్టిపిచ్చి పట్టినదో నీ వెఱుగుదువుగదా?"

"అవును. నా కాసంగతులన్నియు బాగుగా జ్ఞాపకమున్నవి. కాని ఒక్క నిముషముక్రిందటనే లారెన్సున కాకవరువచ్చిన సంగతినే యెరు గనంటివి. ఇప్పుడు అతడాకవరు విప్పనైన విప్పలేదనుచున్నావు, దానిని నాన్నగారు తపాలాద్వారా పంపించియుండవచ్చునని నీవేగదా చెప్పి తివి?"

"అవును అంటిని. నిజమే—అతడా కవరును తపాలాద్వారా పంపించుట కేమియాటంకము ?"

మాటలాడు కొలదిని నాకు ధైర్యమధికమగుచుండెను. డబ్బుమీది కాంక్ష వలన చేతచిక్కిన డబ్బును విడువనొల్లక నేనింత పటాటోపము చేయుచున్నానని యెవ్వరైన తలంపవచ్చును. కాని నిజమదిగాదు.

ఎంతదాక్షిణ్యము గల యాతుడైయైనను, తనకులభించిన యపార సంపదనంతటి నాటకబూటకములతో కాలక్షేపముచేయుచున్న అనాథ స్త్రీలిద్దరకిచ్చివేయుటకు సమ్మతింపజాలడు. అందువలన వారికడిగిన వెంటనే యాస్తి నిచ్చివేయనందులకు నేనంతగా సమర్థించుకొననవసరము లేదు.

కాని యీవిషయమున నాలోచింపవలసిన దొక్కడబ్బు విషయము మాత్రమెకాదు. డ్యూకులపేరు ప్రతిష్ఠ లీపీలుపై నాధారపడియున్నవి. మా నాన్నగారంత శోభస్కరముగ సంపాదించిన కీర్తి ప్రతిష్ఠలను గాపాడుట యిప్పుడు ముఖ్యవిషయము. నేను చిన్నదాననియు, తనకు పుత్రసంతతిలేదనియు నతడంతగా విచారింపకుండుటకు లారెన్సుపై నతనికి గల ప్రేమాభిమానములె కారణము. లారెన్సు కులగౌరవప్రతిష్ఠలను బాగుగ కాపాడగలడను నమ్మకమతని కుండెను. కాని రాను రాను లారెన్సు ప్రవర్తన మనుమానాస్పదముగ గన్పించి దాని నతడు బాగుగపరీక్షింపనారంభించినట్లుండెను. క్రమక్రమమున నిజము గ్రహించి లారెన్సుపై నసూయనొందెను.

ఇకనాసంగతియా! నే నతనికారంభముననే ఆశాభంగము గలిగించి యతనిగౌరవము చెరచితిని. అందువలన ఆశ నిరాశయని యతడు భావించెను. కాని లారెన్సుపై నసూయజనించినప్పటి నుండియు నతనికి నా మీద కొంతదయగలిగి నట్లుండెను.

లారెన్సును, నేనునుగూడ గాపాడజాలసి కీర్తి ప్రతిష్ఠల నొకవేళ తనమనుమడైన గాపాడగలడేమో యని యతడీవీలు నిట్లు వ్రాసియుండవచ్చును. అందువలన తాతగారియాస్తియు, గౌరవప్రతిష్ఠలును, నుయ్యాలలో నూగులాడుచున్న నాచంటికుఱ్ఱనికి లభించినవి. ఆకీర్తియైనను సామాన్యపుకీర్తిగాదు. ప్రపంచమందలి నావికామార్గము లన్నిటి జుట్టివచ్చు స్టీమరులకు చిన్నిమార్టిను యజమానియగుచుండవలదని నే నెట్లు తన్ని వేయగలను?

* * * * * *

ఈ ఆలోచనలన్నియు నా మెదడున తిరుగులాడుచుండెను. అయినను యెదుట నొకపిశాచమువలె గన్పించుచున్న ఫ్లోరెన్సున కేదియో సరియైన ప్రత్యుత్తరమీయవలయును గద!

"సరియె దానిని వెంటనే మీ న్యాయవాదిదగ్గరకు తీసికొనిపోయి తగినచర్య నడిపింపుమని నేను మరలబలికితిని.

"కోర్టుల కేగుటవలన చాలకాలము పట్టునని యాలోచించుచున్నాను. శరీరమునకు లేనిపోని యాయాసము గలుగును. అధమపక్షమొక సంవత్సరమైన పట్టవచ్చును. అంతియగాక వేలకొలది డబ్బు ఖర్చగును. హాయిగ బ్రదుకుట కేదియో యాధారముండిన జాలు నెవరీతిప్పలు పడగలరు? సంవత్సరమున కయిదువేలు మాత్రమిచ్చిన చాలును. ఎక్కువ అక్కరలేదు."

"ఎంతయో యెక్కువలేదు. మరియొక్క తొంబయియైదువేలు మాత్రమై యుండును తక్కినరాబడి. అదికూడ నీకేలభించును గదా వ్యాజ్యములో గెలుపొందినపుడు!" అని నేను కొంటెతనముగ బలికితిని.

నా మాటలామె కెంతయో కోపముగలిగించినవి.

"అట్లయిన నీవామాత్రపు భృతి నిచ్చుటకైన నంగీకరింపవనుమాటయె?" అని యామె బిగ్గరగ గుడ్లెఱ్ఱజేసి పలికెను.

"ఒకచిల్లిగవ్వ నిచ్చుటకైన నాకవసరము గన్పించదు. లారెన్సొక వేళ నీపేరనేదైన వీలుఁవ్రాసి యేపెట్టెలోనైన దాచియుంచెనేమో! అట్లేయుంచినయెడల నీవీయాస్తినంతటిని పిల్లపిల్లతరముగ ననుభవింప వచ్చును."

"లారెన్సు వ్రాసియిచ్చినమాట వాస్తవమె. ఇప్పుడువచ్చిన గట్టి చిక్కు అక్కడనెయున్నది. లారెన్సునకు మతిస్థిమితములేని సమయమున నావీలుఁవ్రాసెను గావుననది చెల్లకూడదని నీవెక్కడ వాదింతువో యని నాయనుమానము."

"ఏమొ! మీకినుగారెట్లు చెప్పిన నేనట్లు నడచుకొందును. అతడేమి చెప్పునో నేనూహింపజాలను. కాని నీవీలును త్రోసివేయుట చాల కష్టము. మొత్తముపై పరిస్థితులు నీకే అనుకూలముగనున్నవి."

"అట్లయిన నీవింత యాస్తినేల భ్రాంతిపడి చెడగొట్టుకొనెదవు! అయిదువేలనగా నీకొక లెక్కలోనిదికాదు." అని యామెపలికెను.

నామనసు చాల మెత్తనిది. కాని యీ నీచురాలియెడల నెట్టికని కరము జూపింపరాదని నేను గుండె రాయిజేసుకొంటిని. ఏదేని గట్టి లోపము గన్పించకున్న నీరాక్షసి యీరీతిగ రాజీకివచ్చునా! లక్ష సవరనుల రాబడికిబదులు అయిదువేల సవరనులతో సంతసించి యూరకుండునా! ఎంతమాత్ర మూరకుండదు. అని యనుకొని బిగ్గరగ "సరియెమంచిది. ఏమిచేయుదువో చేసిచూడుము. నేనుమాత్రము రాజీ పడజాలను. ఫ్రెండిలూ!" అని ఫ్రెండిలుని పిలచితిని.

నేనుపిలచిన వెంటనే తలుపుతెరచుకొని ఫ్రెండిలు వచ్చుటనుజూచి యామె వెల్లమొగమువేసి "నన్నువంచించితివా! నీకిదితగునా!" అని ఖిన్నురాలై యడిగెను.

"నిన్నెంతమాత్రము వంచింపను. లేనిపోని యనుమానముల నొందకుము. మన సంభాషణకంతటికొక సాక్షియుండుట మంచిదిగదాయని

యిట్లుచేసితిని. ఫ్రెండిలూ! మేముభయులమిప్పుడు మాట్లాడిన సంగతులన్నియు వింటివిగదా?"

"వింటిని"

"సరియె మంచిది. వాటిని జ్ఞాపకముంచుకొనుము. డ్యూకుసతిగారికి వీధిలోనికి దారిజూపింపుము. పాపము చాల రాత్రియైనది."

ఫ్లోరెన్సుఆవలకరిగినది. అంతట ఫ్రెండిలుని లోనికిపిలచితిని. ఈసంభాషణ యంతయు బాగుగ జ్ఞాపకముండునపుడే ముఖ్యాంశములన్నిటి నొక కాగితముపై వ్రాసియుంచుమని వాని కాజ్ఞాపించితిని. వాడట్లు వ్రాసిన పిమ్మట "ఈవివాద మెట్లు పరిణమించునో యూహించి చెప్పు" మని వానినడగితిని. అతడు తన యభిప్రాయము చెప్పినపిమ్మట నిట్లంటెని.

"నాకుగూడ నటులనే తోచుచున్నది. కాని మనసుమాత్ర మేలనో కలవర మొందుచున్నది. ఆదస్తావేజు తప్పకుండ నాన్నగారు వ్రాసినదే! ఆయన దస్తూరియందుండు కొన్నివంపులను ఎంతటి ఫోర్జరీదారులైనను గూడ అచ్చుగ్రుద్దినటులంత జాగ్రత్తగ వ్రాయజాలరు. అంతియగాక ఫోర్జరీచేయుట అందరికిని చేతగాదు. ఈదుర్మార్గుడు జోకీయిముగాడు ఫోర్జరీచేయగలడా? వ్రాయుటయె చేతకానివాడు ఫోర్జరీనెట్లు చేయగలడు?"

"ఫోర్జరీ చేయజాలడుగాని వాడుమాత్ర మతిదుర్మార్గుడు. ఎంతటి నీచకార్య మొనరించుటకైన వెనుదీయడు. కాని ఇంగ్లీషుభాష వాడికి రాదుగదా దానిలోనెట్లు ఫోర్జరీచేసి వ్రాయగలడు. కాని అమ్మగారు నాకు తెలపిన విషయమింకొకటి యున్నది."

"ఏమది?"

"లారెన్సు డ్యూకుగారు పూర్తిగ చెడిపోయిన రోజులలో సర్ మార్టినుగారు నాకు వర్తమానమంపిరి. నేనపుడు వారి దర్శనముచేసితిని. ఆసమయమున నచట నయిదారు వీలుఫారములు పడియుండెను. లారెన్సుగారియందెక్కువ యభిమానము గలిగియుండుట తప్పేమో తెలియదుగాని అప్పుడుమాత్రమాతని ప్రవర్తనము బాగులేదని తెలిసి యున్ననుగూడ బాగుగనున్నదని మార్టినుగారు నమ్మకొనునట్లు

పలికితిని. ఫిండ్లీ నామాటకు ఋజువుపలుకగలడు. అప్పుడు డ్యూకుగారు నామాటనమ్మకొని" అట్లయిన లారెన్సు క్రమక్రమమున మంచిదారికి రావచ్చును. వాడు పూర్తిగ బాగుపడకున్నను పిల్లలయిన మంచివారు కావచ్చును." అని పలికిరి. ఒకవేళ నామాటలను విశ్వసించి వారీ క్రొత్తవీలును వ్రాసిరేమోయని నాకు సంశయముగానున్నది. అప్పటిలో మీయన్నగారి యన్నముదిని బ్రతుకుచుండుటవలనను, అతడెట్లైన బాగుపడవలయునని కోరుచుండుటవలనను, నేనట్లుచెప్పితిని. అంతియె గాని, ప్రమాణపూర్తిగ చెప్పుచున్నాను.—మీపై నెట్టివ్యతిరేకాభిప్రాయములేదు. కనుక క్షమింపవలయును."

"ఇదంతయు నాన్నగారు రేపు మరణించెదరనగా తొలిరోజున జరిగినదా ? అయ్యో నాన్న ! నాకంఠమున ప్రాణముండియు గూడ మీమరణసమయమున చెంతలేకుంటినా ? ఎంతపాపముచేసితినో ?" అని విలపింపసాగితిని.

"అట్లయిన నీవు నాన్నగారిని జూచితివా ? ఫ్రెండిలు ? అతడంతగా చిక్కిపోలేదుగద ! ఇన్నాళ్లనుండియు నాకాసంగతి చెప్పలేదేమి ?"

లేదు లేదండి అమ్మగారు. సర్ మార్టిన్‌గారా మాటలాడిన పిమ్మట ఆరుమాసములు జీవించిరి. ఆపిమ్మట మరణించిరి. ఇది చాలాకాలము క్రిందటిసంగతి." అని ఫ్రెండిలు తొందరగచెప్పెను.

నేనపుడు సంగతిసందర్భము లన్నిటి నతిత్వరితగతి నూహించి మాసములను లెక్కింపసాగితిని.

ఆరుమాసములక్రిందట లారెన్సుపై నాన్నగారికి చాల జాలిగ నుండెను. అతడు మంచిదారికి వచ్చునేమోయని యతడపుడు తలచుచుండెను. అందువలన దానికనుగుణ్యముగ తనవీలులో తగిన యేర్పాటులను జేయనుద్దేశించి యుండవచ్చును.

కాని మూడు వారములకు మరణించెదరనగా నాన్నగారు మరియొక వీలు వ్రాసిరి. అదియె లారెన్సు చెప్పినది. ప్రస్తుతము మీకినుగారియొద్ద నున్నది. మొదట లారెన్సున కనుకూలముగ వ్రాసిన వీలు కాదని మరణవేదన నొందుచుండగా నింకొకవీలు వ్రాసియుందురా? అట్లు వ్రాయుట అసందర్భమని నాకు తోచెను.

ఇట్లాలోచించుచు నేను ఫ్రెండిలువైపు చూచితిని. వానికప్పుడే క్రొత్తయాలోచనయేదియో తట్టినట్లు కండ్లయందొక మెరుపుమెరసెను.

"నేను మరల తమకడ్డము వచ్చుచున్నందులకు క్షమింపవలయును. ఆయారుమాసముల క్రిందట వ్రాసిన వీలులోని తేదీని వారెటులనో మార్చివేసియుందురు." అనియతడనెను.

నాకాయాలోచన సరియైనదిగ తోచెను. ఫ్లోరెన్సు చెప్పినట్లా మొకా వీలు లారెన్సు కాగితములలోనే దొరకియుండవచ్చును. దానిమీది తేదీని ఫ్లోరెన్సుగాని, తల్లిగాని మార్చియుండవచ్చును.

"నీవు నాన్నగారిని చూడబోయినసమయములో ప్రాస్టుసతి నాన్నగారి కొలువులోనుండెనా?"

"నుండెను. లారెన్సుగారు ఫ్లోరెన్సును పెండ్లియాడిన సంగతి మార్టిను డ్యూకుగారికి తెలిసినను ప్రాస్టుసతి తంత్రము మాత్రమాతని కప్పటికి తెలియలేదు. మరికొన్నిదినములయినపిమ్మట తెలసెను. అట్లు తెలసినవెంటనే యతడామెను కొలువులోనుండి పారదోలెను."

"ఆమెను క్షమించి నాన్నగారామెను మరల కొలువులోనికి తీసికొనియుందురా?"

"లేదమ్మగారులేదు. మరల నామెను కొలువులోపెట్టినట్లులేదు. నేనింతదూరము చెప్పుచున్నందులకు మన్నింపవలయును. ఆరంభములో నాదుండగీడు డ్యూకుగారిని పూర్తిగవంచించినది. ఒకమారామె

తప్పుచేసినసంగతి నాన్నగారికి తెలసినవెంటనే పనినుండి తొలగించితిని. ఆమె ముఖము చూచుట కదియె యాఖరు. మరి క్షమింపలేదు."

"వీడో, యీ జాకీయియము బట్టుగాడో ?"

"నేనెరిగినంతవరకు వానిని పనిలోనుండి తొలగించినట్లులేదు. ఫ్రాస్టుసతితో వాడింటిసంగతులన్నిటిని యెప్పటికప్పుడు చెప్పుచుండె ననుసంగతి డ్యూకుగారికి తెలియదు. అందువలన వారు మరణించిన నాటిరాత్రి ఫ్రాస్టుసతి యథేచ్ఛగా నీయింటిలో ప్రవేశించు నపుడెవరు నడ్డుపెట్టకుండిరి."

*                *                *                *

ఫ్రెండిలు అట్లు చెప్పగానే నాన్నగారొకవేళ స్వాభావికమైన మరణము నొందలేదేమో వీరెవరైన మందుపెట్టి చంపిరేమో యని నాకు విపరీతమైన యనుమానమొకటి జనించెను. అంతట "నాన్న గారినెవరైన బలవంతముగ జంపియుండరుగద! ఫ్రెండిలూ! అని నేనడిగితిని. అట్టిదుర్మార్గము జరుగుటకెట్టి యవకాశము లేదనియు నేను లేనిపోని కించ పెట్టుకొనరాదనియు నతడు నొక్కి నొక్కి చెప్పెను.

"మీరెంతమాత్ర మట్లాలోచించుటకు వీలులేదు. ఇంత యెందు లకు మీరే మాట్లాడితిరిగదా డాక్టరుతో ? ఇంకేలనీయనుమానము !"

"రోగము చాలకాలమునుబట్టియున్నదని డాక్టరు నాతోచెప్పినాడు."

"డాక్టరు తరుచుగ వచ్చుచుండుటయెగాక యిద్దరునర్సులు రాత్రిందివములు సర్ మూర్టిమెగారిని కనిపెట్టుకొని యతని కుపచారము చేయుచుండిరి. అట్టి స్థితిలో నెవరికైన అప్రాంతముల కరుగుటకు గుంటెలుండునా ?"

అట్టి విషమస్థితిలో నాన్నగారు వీలుంవ్రాసిరనుమాట నాకసందర్భ ముగ దోచెను. అంతియెగాక నతడు మరణించినదినమున యుద్ధయు మారంభముగ మరణమొందినంతవరకు మీకిసుగారతని చెంతనే

యుండిరి. అట్టిస్థితిలో రహస్యముగ వీలు వ్రాసి పోస్టులో లారెన్సున కంపుటకంటె తమకు మొదటినుండియు న్యాయవాదిగనుండి హితమొనగూర్చుచుండిన మిూకినుగారికి దానినిచ్చియుండరా? అంతియగాక నాన్నగారంత విషమస్థితిలో నున్నపుడు తనకు త్తరము వ్రాయగా లారెన్సు దానిని విప్పనైన విప్పకుండ నేవియో కాగితములలో బడవైచియుండునా? ఎంతమాత్రము పడవేసియుండడు.

ఫ్లోరెన్సు మాటలు నిజమని యొక నిముషమైన నమ్ముట నాబుద్ధిలోపమేగాని వేరొకటిగాదు. నిజముగ నేనామె కప్పటిలో గట్టిగ బుద్ధి చెప్పి మరియు పంపించవలసియుండెను.

ఫ్రెండిలు చెప్పినటులిది యేదియో తంత్రముగాని వేరుకాదు. ఆ దస్తావేజు నొకవేళ భూతద్దముపెట్టి పరీక్షించునెడల దానిలోని లోపములన్నియు తెలసిపోవునను భయముచేత ఫ్లోరెన్సు ఆ దస్తావేజును నాయొద్దనెక్కువకాల ముంచకుండెను. నేనేవిషయమునైన నతిసులభముగ నమ్ముచుండునని లారెన్సు పెక్కుసారులు నన్ను మందలించుట నామె యాలకించినది గాబోలును నేడీతంత్రము పన్నినది.

*    *    *    *    *

ఫ్లోరెన్సు హడావిడిలో నేను క్రొత్తదుస్తులను ధరించినమాట మరచితిని. రోజుమేరీ నన్నాబట్టలతో జూచి యానందించవలయునని నేనెంచిన సంగతియు పూర్తిగ మరచితిని. ఏమియు తోచకుండుటవలన ఫ్రెండిలు నొక కప్పు తేనీటి నిమ్మని యడిగితిని.

అప్పుడారు గంటలైనదని చెప్పి మరియొక అరగంటలో భోజనము చేయవలసియుండగా నప్పుడు తేనీరవసరముండునా యని ఫ్రెండిలు నన్నడిగెను. నాలుగుగంటలకే రోజుమేరీ రాలేదేమని విసవిసలాడుచుండిన నాకామాట మరింత కోపము గలిగించినది.

నాకాప్త బంధువువలె రోజుమేరీ యింటిలో సంచరించుచుండుట వలన ఫ్రెండిలునకు కష్టముగ దోచుచున్నదను సంగతి నాకింతవరకు తెలియలేదు. లారెన్సు కొలువులో తనవలె నామెగూడ నొక నౌఖరుగ నుండుటమాత్ర మతడెరుగును. అందువలన తనతో సరిసమానురాలనియె భావించుచుండెను. అట్టి స్థితిలో నామె తనపై నధికారము చలాయించుట కంగీకరింపజాలడని నేనపుడు తలంచితిని. ఫ్రెండిలు మాత్రమామె వైఖరి బాగులేదని యింతవరకు నాతో చెప్పుకొనలేదు. ఏదియో విధముగ మర్యాదగనె కాలక్షేపము చేయుచున్నాడు. నేడు నేను కొంచెము చనవిచ్చిమాట్లాడుట జూచి అదియె యెదనుగనెంచి కొంచెము ధైర్యము నవలంబించి యతడు తన బాధలను చెప్పుకొన దలచెను.

తేనీరవసరములేదని నేను చెప్పినపిమ్మట అగ్నిగుండముయొద్ద నేదియో పెద్దపని యున్నట్లు నటించి పిమ్మట నన్ను సమీపించి, అతి మర్యాదగ అనుమతియైన యెడల రోజుమేరీ విషయమై నేనొకటి రెండు మాటలను చెప్పుకొనవలసి యున్నది.”

“అట్లయిన నేమియో చెప్పుము.”

“చనవిచ్చినందుల కధికప్రసంగము చేయుచున్నానని భావింతురేమోయని సంశయముగ నున్నది,”

“లేదు లేదు. భయములేదు. చెప్పుము. రోజు మేరీయేమిచేసినది?”

మాయిద్దరిపేరులు “భేజుసతు” లగుటవలన నింటిలోనివారందరు నామెను రోజుమేరీ యనియె వ్యవహరించుచుండిరి.

“నేను చెప్పవలసినమాట తమకు కొంచెము కోపము కల్గించునేమో యని భయమగుచున్నది.”

నాకీ నంజుడుమాటలు చిరాకుగలిగించినవి. “నీమాటలేమియు నర్థముకాకున్నవి!”

"ఏమియు లేదండి! నాకు మొన్ననె జానుమెడ్లీయొద్ద నుండి యొక యుత్తరము వచ్చినది."

నా గుండెలు దడదడకొట్టుకొన సాగినవి.

"అతడు మరల నింటికి వచ్చుచున్నాడు. అమెరికాదేశపుసీరు ఆయనకు సరిపడలేదట."

"సరిపడక పోవచ్చును."

"నేను మెడ్లీ చెల్లెలిని పెండ్లిచేసికొంటిని. పాపమా చిన్నది పోయి చాలకాలమైనది. అయినను మెడ్లీ నాకు బావమరిది యనుటకు సందియములేదు."

"కావచ్చును."

"అవునా మరి ?—" అనుచు తలగోకికొనుచు నతడు వెన్నుపట్టెల వంక జూచుచుండెను. కొంతసేపైన పిమ్మట "జాను మరలయింటికి వచ్చి రోజుమేరీని పరిణయమగుననియు, ఆమె తన్ను పెండ్లియాడుట కంగీకరించెననియు వ్రాసినాడు. ఆమె మొదటిభర్త మరణించెననియు కొన్ని దినములవర కతడు మరణింపలేదేమో యని యనుమానముగ నుండుటవలన వివాహమిన్ని దినముల నుండియు నాగిపోయినదనియు, ఇప్పుడా యనుమానము తీరిపోవుటవలన ననతికాలములోనే వివాహము జరుగుట కభ్యంతరములేదనియు నతడు వ్రాసెను."

జాను మెడ్లీని మరల జూడవలయుననియు నాలుగుప్రశ్నల నడిగి నాలుగు చీవాట్లు పెట్టవలయుననియు నాకపుడుతోచెను. కాని ఫ్రెండిలు లోపలియుద్దేశ్యమేమియో నాకు తెలియకుండెను.

"వివాహమాడవచ్చును. తప్పేమి?"

అప్పుడు వెన్నుపట్టెలమీాది దృష్టినిమార్చి కనికరముదయించునట్లు నా ప్రక్క జూచుచు నతడిట్లుపలికెను.

"మరియేమియు లేదండి! అప్పుడు నాస్థితికొంచెము కష్టముగనుం డును. నే నేదియోవిధమున చాలదినములనుండియు మీ యిల్లు కని పెట్టుకొనియుంటిని. అందువలన నిచట నుద్యోగము మానుకొనుట కిష్టములేకున్నది. అయినను రోజుమేరీని మెడ్లీ వివాహమాడుట జరు గునెడల నా స్థితి కష్టతరముగ నుండగలదు. అప్పుడు మీకును నా కును ఒకవిధమైన దూరపుబంధుత్వమేర్పడును. అందువలన నాకే మియో ప్రమాదము సంభవించునని నా కెట్టిభయమునులేదు. నేనా సంగతి నంతటిని పూర్తిగ మరచిపోయి యెప్పటియట్ల మీ సేవచేయు టకెట్టి యాటంకమునులేదు. కాని మెడ్లీ క్షౌరముచేసికొనుటకు నీళ్ల నిమ్మనుటయొ, లేక నింకేదియో నీచకార్యములందు నన్ను నియోగిం పనెంచునెడల నే నట్టిపనిని మాత్రము చేయజాలను. రోజుమేరీ అప్పుడు యేమనుకొనినను కార్యములేదు."

నా కప్పుడతని ముఖముజూచి పట్టలేనంత నవ్వువచ్చినది. కాని ఫ్రెండిలు యెంతయో కష్టముపై తనబాధ నంతజాగ్రత్తగ విన్నవించు కొనుచున్నప్పుడు నేను నవ్వునెడల నతడేమనుకొనునో యని యెంచి ప్రయత్నముపై దానిని లోలోపల నడంచుకొంటిని.

*    *    *    *

పూర్వము ఫ్రెండిలు జూచినంతనె నేవగించుకొనుచుండిన నా కిప్పు డతని యందభిమానము కలుగనారంభించెను. వానిని నౌకరీనుండి తప్పించుట నా కెంతమాత్రము యిష్టములేకపోయెను. వానిబాధగూడ సకారణముగనె యున్నది.

జాను మెడ్లీకి తానట్టిపనులను చేయనవసరముండదనియు, ఒకవేళ మెడ్లీ చెప్పిననుగూడ తాను చేయనక్కరలేదనియు, అందులకు తగిన యేర్పాటులను చేసెదననియు నేను వానిని నమ్మించి పలికితిని. రోజు

మేరీమాట నేను చెప్పజాలకున్నను జానుమెడ్లీమాత్రము నాయందు తగినగౌరవము నుంచకవీలులేదని నే నతనికి నచ్చచెప్పితిని.

"మాటలసందడిని మరచితిని. ఏదో రోజుమేరి? ఎచటికరిగినది?"

భోజనము చేయువేళయయ్యెను. నా కప్పుడు నిజముగనె యలజడి గలిగెను. మరియొక యరగంటపోయిన పిమ్మట భోజనముచేసెదనని చెప్పి పిల్లదున్న గది కరిగితిని. మార్టిను గాఢనిద్రయం దుండెను. దాది అన్ని పనులను నిర్వహించుకొనుచుండెను. పిల్లవానివిషయమున నేను చేయవలసిన పనియేమియు గన్పించనందున దాది కేవియో యొకటి రెండుమాటలను జెప్పి మరల క్రిందికివచ్చితిని. ఆ తర్వాత భోజనము నారంభించితిని. ఆకలేమియు లేకుండెను. టెలిఫోనులో నెవరినైన పిలచి రోజుమేరి యెచటనున్నదని అడుగవలయు ననుకొంటిని. ఆమెకు లవ్‌జాయితప్ప మరి యేస్నేహితులును లేరు. అంతదూర మెప్పుడు పోవునా యని యనుమానించి మరల నూరకుంటిని.

రాత్రి తొమ్మిదిగంటలైనది. రోజుమేరీ యింకను రాకుండెను. నేను మరియోపిక పట్టజాలకుంటిని. ఇదివరకెప్పటి కప్పుడే తలవనితలంపుగ నెన్నియో యాపదలువచ్చుట అలవాటయినది గనుక నీమారు గూడ నేమివిపత్తువచ్చునో యని నాకు భయమధికమగుచుండెను. పోలీసువారికి ఫిర్యాదుచేయనెంచి టెలిఫోనుచెంత కరిగితిని. ఫోను చెడి పోయియుండెను. అందువలన మనస్సు కొంచెము శాంతించెను. రోజుమేరీ యేదైన కార్యాంతరముపై నరిగి యాలసించియుండవచ్చుననియు, ఆసంగతిని ఫోనులో చెప్పనుద్దేశింపగా ఫోను చెడిపోవుటవలన నూరకుండవలసివచ్చెననియు, యింతలోనే రావచ్చుననియు దలంచుకొని కొంత శాంతినొందితిని. రాత్రి పదిగంటలుకొట్టిన పిమ్మట రోజుమేరి యింటికివచ్చెను. ఆ వచ్చునప్పుడు గుమ్మములోని బంట్రౌతు చేతులలో నున్న పచ్చకవరు తీసికొనివచ్చి నాకు చూపించుచు నిట్లుపలికెను.

"లోర్నా ! నన్ను క్షమింపవలయును. నీకు చాలా అలజడి కలిగించియుందును. చాలా విచారముగా నున్నది. మే మెన్నియోమారులు ఫోనులో నిన్ను పిలిచితిమి. కాని కార్యములేకపోయెను. చివరకు టెలిగ్రాము నిచ్చితిని. అదియు సకాలమున 'చేరకుండెను. ఇదిగో ! యిప్పుడే వచ్చినట్లున్నది. చూడుము. నిన్నెంతయో శ్రమపెట్టితిని. ఎక్కువగా బెంగబెట్టుకొనలేదు గద !" అని యామె నవ్వుచు నడిగెను.

"నా కోపమున కంతములేకుండెను. తానుజేసిన తప్పిదమునకు పరితపించుట మాని యామెనవ్వుచున్నది.

"నా కిప్పుడున్న బాధలే వేనవేలున్నవను కొనుచుండగా నీవు క్రొత్తగా మరికొన్నిటిని తెచ్చిపెట్టుచున్నావు. బాగుగానే యున్నది." అని పలికితిని. నా మాటలునాకే కష్టముగా దోచినవి. ఆమెకా మాటలు నొచ్చునో నొవ్వవో యాలోచించుకొని మాట్లాడుటకు నా కోపిక లేకుండెను. కోపమతి విపరీతముగ పెరుగుచుండెను. తానెవ్వని కొరకతివిశేషముగ బెంగపెట్టుకొని విచారించుచుండునో ఆమనిషి నిరపాయముగ నింటికి వచ్చుటయే గాక ననవసరముగా నంతవిచారము గలిగించినందుల కెట్టిసమాధానము చెప్పకుండుటవలన నెవరికైన నెంతకోపము వచ్చునో ఆసంగతి అనుభవజ్ఞు లూహించవలసినదేగాని వ్రాయదగునది కాదు.

నేను కోపముగా బలుకుచున్నను గూడ రోజుమేరీ కొంటెతనముగా నవ్వుచునే మాట్లాడుచుండును.

"నేను జాన్‌మెడ్లీని చూచితిని. ఆతడీరోజుననే అమెరికానుండి వచ్చెను. అందువలన యింత ఆలస్యమైనది." అనుచు నామె మరల నవ్వుచూ చెప్పెను.

“నాకది తెలియునిసంగతి కాదు. ఫ్రెండిలిదివరకె నాకీసంగతినిచెప్పెను. నీవట్టి దుర్మార్గునితో నేల సహవాసము చేయుచున్నావో నాకు తెలియకున్నది.”

రోజుమేరీనవ్వు మరింతయధికమయ్యెను. నేను కోపముపట్టజాలక చివ్వునలేచి పఠనాలయములోని కరిగితిని. ఆమె యటులనే నవ్వుకొనుచు నావెంటబడెను. పైకి నవ్వుచున్నను లోపలమాత్ర మామెకు కష్టముగనున్న సంగతి నాకు విదితమగుచుండెను. ఇంతవరకు మాకెట్టి కలహము లేకపోవుటయెగాక అభిప్రాయభేదము కూడ కలుగకుండెను. ఆమెమంచితనమువలననె ఇట్లింతకాలము సుఖముగ కాలక్షేపమయ్యెననుమాట వేఱుగ చెప్పనవసరములేదు. మనసునకొంత నొచ్చినను గూడ నామెస్నేహము చెడనాడనొల్లక నవ్వుచునే మాట్లాడుచుండును.

“నన్నేల కోపగించెదవమ్మా? లోర్నా! ఈక్రొత్త “ఫ్రాక్కు” తొడగికొని సాక్షాద్దయాలక్ష్మివలె గన్పించుచున్న నీకీకోపమెచట నుండివచ్చినది? నేలవరకు వ్రేలాడు నీకుచ్చెళ్లు చాల మనోహరముగ నున్నవి. ఎవరుకుట్టిరి?”

ఆమె నాశ్చర్యవివశనుచేయుట కాక్రొత్తతొడవును ధరించితిననుమాట మరచి “నీవునన్ను పొగడనవసరములేదు. ఈమెడ్లీ గాథ యేమియో అదియంతయు వెంటనే చెప్పుము. అతడేమనుచున్నాడు?”

“ఏమనుట కేమున్నది? నన్ను వివాహమాడగోరుచున్నాడు.”

“ఫ్రెండిలువలన నాకీసంగతి ఇదివరకె తెలసినది. నీవిపుడు క్రొత్తగ నాకు చెప్పనవసరములేదు.” అని యామెకునొచ్చునట్లు పలికి “అది కాదు నేనడిగినది. నాడబ్బును వస్తువులను దొంగిలించినందుల కేమి సమాధానము చెప్పగలడని” అని పలికితిని.

“తిరిగి సొమ్ముపంపించలేదా”

“తక్కినవస్తువులనంపలేదే!”

“ఆసంగతులన్నియు నాకతడు చెప్పలేదు. అదియంతయు సవ్యముగనేయున్నదని పలికినాడు.”

“అంతమాత్రమున నీకు తృప్తికలిగినదికాబోలు!”

“తృప్తికలిగినను కలుగకున్నను నేనతని నమ్మక వీలులేదుకదా?”

“పోకిరి మనుష్యులను నమ్మటవలన నిక్లేజరుగును?”

“లోర్నా! నీకు కోపమువచ్చుననిన నేనుచెప్పజాలను గాని నీవీరీతి నతని తూలనాడుట బాగులేదు. అతడెంతమాత్రమును పోకిరీమనిషి కాడు. నేనిట్టిమాటలను మరి వినలేను.”

* * * *

పాపమీమాటలను వినునరికి ఆమె కన్నులశ్రుపూరితములైనవి. దుఃఖమాక్రోశించుటవలన ముఖకాంతిమారిపోయెను. అదిచూచి నాయంతటనాకే ప్రబలమగు సంతోషము కలుగజొచ్చెను. అయిన నప్పటిలో నావైఖరిని మార్చుట బాగుగనుండదని యెంచి—

“ఈబుడిబుడి దుఃఖములు నాకుపనికిరావు. నాతో నిజము చెప్పక తీరదు. నీవీదినము బయటికరుగునపుడీతడు వచ్చునని తెలియునుగద! నాకాసంగతి నేల సూచాయినైన చెప్పలేదు?”

“అమ్మో లోర్నా! నాసంగతి యెరుగనిదానివలె నేల నిట్లు కోపగించెదవు? నేనతని కలుసుకొందునని యెంతమాత్రమూహింపలేదు. ఇంటిలోని పనులన్నియు పూర్తియగునప్పటికింకను చాలవేళ యుండెను. ఈకాలమంతయు నేల వ్యర్థముచేయవలెను? లవుజాయి నొకమారుచూచివచ్చిన బాగుండదా? యని యెంచి యామెదగ్గర కరిగితిని. మేముభయులమేమియో మాట్లాడుకొనుచుండగా నితడు,

తలవనితలంపుగ లోనికి వచ్చెను. నీకు చెప్పని రహస్యమేదైన నాకు కలదా? ఏల కుడిచికూర్చుండి నన్నిట్లు నొప్పించెదవు ?"

* * * *

ఆమాటల కాశ్చర్యము గనబరచెదనేమో యని యామె నాముఖము వంకజూచెను. కాని నేనెట్టి యాశ్చర్యమును గనబరుపనందున నామె మరల నిట్లు చెప్పసాగెను.

"అప్పుడతడు గూడ మాతో తేనీరు(తాగి మమ్మిద్దరిని సినీమా (ప్రదర్శనమునకు రమ్మని కోరెను. లవుజాయి సంతసముతో నంగీకరించెను. నేనప్పుడెట్లు కాదనగలను? నీకాసంగతి టెలిఫోనులో చెప్పదలచి ఎన్నిమారులు (ప్రయత్నించినను కార్యము లేకపోయెను. తంతినిచ్చిన జాలునని జాను చెప్పగా వెంటనె తంతినిచ్చితిమి."

నేనింతసేపు యింత యలజడితో కాచుకొని యుండగా నామె సినీమా (ప్రదర్శనముల కరిగినదట !

"తంతి నిచ్చితిమి గదాయను, ధైర్యమున మేముభయులమును, వెన్నెల మనోహరముగ నుండుటను గాంచి పార్కులో కొంతకాలము సంతోషము విహరింప నరిగితిమి. ఆ సమయమున నన్నతడు పెండ్లి యాడగోరిన సంగతిని చెప్పెను. అతనియొద్ద కావలయునంత ధనమున్నదట ! "

"ఒకరిడబ్బు నపహరించుకొని పోయిన పెద్దమనిషికంత ధనమెచట నుండి వచ్చెను ? "

"ఎట్లున్నదో నాకు తెలియదు. కాని అమెరికాలో (ప్రతివారికి నతిసులభముగ డబ్బులభించునట !"

"అయ్యోపిచ్చిదాన ! అతడువెళ్లి సంవత్సరమైన కాలేదు. ఈలోపల కావలసినంత డబ్బు ఎట్లువచ్చినది? అమెరికాలోమాత్రము చెట్లు దులిపినంతనె డబ్బురాలునా యేమి ?"

* * * *

"అది యెటులనోగాని అచటమాత్రము కావలసినంత డబ్బు చిక్కునట. నాయిష్టమువచ్చిన చోట నెచటనైన చక్కనియిల్లు నొకదాని కొనెదనని యతడు పలికెను. కాలిఫోర్నియాలోనుండుట నాకిష్టముగనుండునని యతడనుకొనుచున్నాడట! అచటి శీతోష్ణస్థితి చాల మనోహరముగనుండునని చెప్పినాడు. పనిచేయుటకు చీనా నౌఖరులు కావలయునంతమంది దొరకెదరట. వారుతప్ప మరియెవ్వరును దొరకరట! ఏమో? కాలిఫోర్నియా యెట్టిదియొ నేనెరుగను. అది నాకు సరిపడుననుకొనను. రేపటిరోజున మేముభయులముగలసి నాకు కావలసినపెండ్లియుంగరమును యెంచుకొనియెదము. దానివిలువ నూరు సవరనులకు తగ్గకూడదని యతడనుచున్నాడు. ఇంక నాదుస్తుల కెన్నియో వందలు వెచ్చింపవలయునని యతడనుచున్నాడు. కాని నాకు మాత్రమంత సొమ్ము వెచ్చించుటకు మనస్సంగీకరింపకున్నది.—"

"తనసహామేమియు నక్కరలేకయె తానను కొనుచున్నంతటికంటె నెక్కువ విలువగలబట్టలను మనము కొనుక్కొనగలమని మెడ్జీతో చెప్పాము.

"నిన్ను నేనెఱుగనా? నిజముగ నీదయ కంతమేలేదు." అని సమయము దొరికినదె తడవుగ నామె తన సంతోషమంతటి నొక్కసారిగ వెలిబుచ్చెను.

ఆమెనన్ను బుజ్జగించుట కెంతయో ప్రయత్నించినది కాని నాకే యేర్పాటు లేమియు నిష్టములేకుండెను. ఫెర్నుద్వీపపటము నతడపహరించినందుల కతనిపై నాకపరిమితమగు కోపముగనుండెను.

"అతడేదియో తక్కువతరగతి మనిషివలెగన్పించుచున్నాడు గనుక నతని పెండ్లియాడుట కిష్టములేనట్లున్నది?" అని యామె భయపడుచు బలికెను.

"నీకాసంగతి తెలసియె యిట్లుచేయుచున్నావా?"

కాని సంగతిసందర్భములన్నియు ననుకూలముగ నుండుననియు, తానీవస్తువులను తీసికొనుటవలన నీకును తక్కినవారికిని లాభమేగలిగె ననియు నతడుచెప్పెను. నీక్షేమసమాచారము లన్నిటి నతడు పూస గ్రుచ్చినరీతి నడుగసాగెను. నీకీయాస్తి లభించుటకెక్కువ ఆశ్చర్యము గలిగినదో, లేక కుమారుడు కలిగినందులకెక్కువ ఆశ్చర్యముకలిగి నదో చెప్పజాలను గాని యతడా రెండుసంగతుల కత్యంతసంతోషము నొందెను.

"పిల్లడిసంగతి కతడాశ్చర్యము నొందనవసరములేదే ?"

"అవసరము లేదేమిటి? అతనికా సంగతియె తెలియదు. నేను చెప్పగనే యెంతయో సంతోషించి నవ్వసాగెను. ఆయన నిచటికి రమ్మనిపిలచితినిగాని నిన్నుచూచుటకు ధైర్యము చాలదని చెప్పినాడు. పిల్లవాని ఫొటోగ్రాఫ్ నొకసారి దొంగిలించియైన తనకు తెచ్చిచూపింప గోరెను.

"దొంగపని యతనికే బాగుగతెలియునే నీ కేల చెప్పినాడు? అని నేనంటిని. కాని చిన్నిమార్టిను నందింతప్రేమ కనుబరచినందులకు నా కతనిపై గొంతయభిమానము కలుగకపోలేదు.

* * * *

అంతియొగాక రోజుమేరీయును నేనును, గలసికష్టముపై గడపుకొను చుండిన విచారకరదినములలో మెడ్లీ మా కెన్నియో యుపచారముల నొనరించుచు మమ్ము సంతసింపజేయుచుండెడివాడు. ఆ సంగతుల నన్నిటి నే నెట్లు మరువగలను? అప్పుడు మెడ్లీ గనబరచిన జిత్తులు, తంత్రములు, ఆటలు, పాటలు అవియన్నియు నా కిప్పుడు జరిగినట్లు జ్ఞాపకమువచ్చుచుండెను.

"ఆపటములు తన కేల కావలసివచ్చెనో ఆసంగతినైన నతడు చెప్పెనా?"

"ఫెర్ను ద్వీపములలో నమూల్యమగు యాస్తిని సంపాదించుటకట !"

"నే నటులనే తలంచితిని. ఇప్పుడవి యెచటనున్నవి ?

"సిడ్నీద్వీపాధికారి కార్యాలయమందున్నవట! ఆ పటములప్పటిలో లభించకుండిన యెడల పరాశుదేశాధీశులతో గొప్పయుద్ధము సంభవించియుండునని యతఁడు చెప్పెను. నీ వంతతరచుగ చెప్పుచుండిన ఫెర్ను ద్వీపమిపుడు బ్రిటిష్ వారి యాధీనమైనది."

"అది నా భర్తది." అని నేను పెద్ద కేకవేసితిని.

"అవును. నే ననినమాటయు నదియె. బ్రిటిష్ రాజ్యప్రజలలోని వాడు కాడాయేమి నీ భర్త ?"

* * * *

ఇప్పుడామెతో వాదించుటవలన నేమియు లాభములేదని యెంచి నెడ్డు వ్రాసిన యుత్తరములలోని సంగతులను మాత్రమామెకు చెప్పకుండ మెలమెల్లన కాలక్షేపముచేసితిని. ఆ ద్వీపములు లేనిమాత్రమున మాకు డబ్బులోపమేమియు గలుగదుగాని నెడ్డునకు పరాభవము గలుగుటమాత్రము నా కిష్టములేకపోయెను. ఆ మాట యామె యెక్కడ చెప్పునోయని భయముగలిగెను. చివరకు పరాభవముగలిగి ప్రభుత్వము వారాదీవుల నపహరించిరా యని నాకు దిగులుపుట్టెను.

నే నట్లు విచారించుచుండగా "నీ కభ్యంతరము లేకుండిన నేను త్వరలో పెండ్లిచేసికొనియెదను." అని రోజుమేరీ పలికెను. ఫెర్ను ద్వీపవ్యవహారమును గురించి యామె కెట్టియాందోళనము లేకుండెను. ఆమె కిప్పుడు మెడ్లీతో వివాహ మొనరించు నెడల అనగా నెడ్డు లండనునగరము చేరులోపల నీమె కీవివాహము జరుగు నెడల మేము సవతులమగుదుమా కామా ? యను సమస్య దానియంతట నదియే పరిష్కృతమగునని నాకు తోచకపోలేదు. ఆ తరువాత నెడ్డునకు నే నొక్కర్తెనే పత్ని

నని చెప్పుకొనుట కెవ్వరు నాటంకము చెప్పలేరు. కాని నాకాపని యిష్టము లేకపోయెను. సత్యమెట్లున్న నట్లే వ్యవహారము జరిగించి మంచిచెడ్డలను ధైర్యముతో ననుభవించుట మంచిదని నిశ్చయించుకొంటిని. కాని మా యిద్దఱిభర్త యొకఁడేయై యతఁడు సజీవిగ నిప్పుడమెరికానుండి వచ్చుచున్న నెడ్డుగనే పరిణమించునెడల పాపమా నూతన వధూవరుల సంతోషాతిశయములు చెడునుగదా యని నాకు విచారము పట్టుకొనియెను.

ఫ్లో రెన్సుతో నా వ్యవహారమంతయు ముగిసినదను ధైర్యమేమియు లే కుండెను. ఆమె తెచ్చిన వీలు నా కెంతయో యలజడి గలిగించెను. అందువలన నా మరుచటిదినమే మీాకినుగారింటికరిగి ఆరాత్రి ఫ్లో రె న్సునకును నాకును జరిగిన సంభాషణ నంతటిని వివరముగ తెలియబరచి తిని. ఫ్రెండిలునకును, నాకును గలిగిన యనుమానమునుగూర్చి గూడ చెప్పితిని.

ఫ్లోరెన్సుయొద్ద నిజముగ నట్టివీలే యుండునెడల, ఆమెతో రాజీ చేయుటకు వీలులేదనియు, వీలుప్రకారము జరిగింపకుండుట అన్యాయ మగుననియు నతడు చెప్పెను. ఆమె యెచ్చటనున్నదో ఆ సంగతిని తెలుపవలసినదని యతడడిగెను. కాని నాకావిలాసము తెలియనందున నేమియు చెప్పలేకుంటిని. వారు బ్రైటనులో నెచటనో యుండిరని వింటినికాని యిప్పుడచట లేరని యేలనో నా కనుమానము కలిగెను.

నాన్నగారి యాస్తికి ధర్మకర్తలుగ నేర్పరచినవారిలో మీాకినుగా రొకరగుటవలన నతడు నిజస్థితిని కనుగొనవలసియుండెను. ఫ్లోరెన్సు కథ చాలవరకు కల్పితకథవలె నున్నదని యతడు చెప్పెను.

"ఆవీలు నామెకోర్టులో దాఖలుచేయుటయు దానిలో నీ వనుమా నించిన లోపములుండుటయు, నిజమగునెడల ఆ గడుసుదనంపు దబా యింపుల ఫలితముగ నామె కారాగృహమున కరుగుట తప్పదని యతడుపలికెను. నిన్ననవసరముగ భయపెట్టినందులకు తగినశిక్ష చేయనుద్దేశించునెడల నీవామెపై వ్యాజ్యము వేయవచ్చు"నని యతడు చెప్పెను.

ఈ వ్యవహారము నింకను బట్టబయలుచేయుట నా కిష్టములేకుండెను. అంతియగాక ఫ్లోరెన్సును కారాగృహమున కంపుటయా యని నామ

నను పరితపింపజొచ్చెను. కారాగృహము నందుంచునపుడు వారా జుట్టంతయు కత్తిరించెదరు. దానివలన నామెకు నగుబాటులగుటయె గాక నాపై నామెకు కోపము, నసూయయు గలుగును.

నాకు పిరికితనము చాలయెక్కువ. మీకినుగారితో నేనావిషయమై చెప్పినమాటల కాతనికి నాపై చాలాకోపము వచ్చియుండును. తల్లితో గూడ నామె పరదేశమున కరుగుటయు మరల నీ దేశమున కెన్నటికిని రామనివాగ్దానము చేయుటయు చేయునెడల వారికి క్రొంతభరణ మీయవచ్చునని నే నతనితో చెప్పితిని.

"నీకు నిజముగ పిచ్చిపట్టినట్లున్నది." అని యంతటితో నూరకుండక "నీకును మీ తండ్రిగారికిని చాలవ్యత్యాసమున్నది" అని యాతడు పలికెను.

నాకామాట కష్టముగ దోచెను. నాగుణములు చాలవరకు, నాన్న గారి గుణములే యనియు, అందువలననే నేనిట్లుంటిననియు నతనితో వాదింపజొచ్చితిని. నాన్నగారు నాయెడల కఠినముగ ప్రవర్తించుట వలన నేనెంతయో బాధపడితిని. ఆసంగతిని గుర్తించి నాన్నగారు అంత్యదశలో చాల విచారించిరి. నేనంతకాలము వేచియుండ నవసరములేకనే మెలకువతో ప్రవర్తించుచున్నానని నేను వాదించితిని.

కాని ఫ్లోరెన్సు విషయములో నేనెంతక్రూరముగ నున్నను నుండ వచ్చుననియు, అందులకు పరితపింపవలయు సమయమెన్నటికిని సంభవింపదనియు నేను చెప్పగలను. ఆమె నాయందాచరించిన ద్రోహమున కంతములేదు. అయినను లారెన్సు నామె వరించినది. ఆపేరుననె వ్యవహరించుచున్నది. ఆమె బెదరింపులకు తగిన శిక్షయె చేయవలసి వచ్చిన యెడల లారెన్సు డ్యూకు భార్య కారాగృహమున నుండవలసి వచ్చును. ఆమాట వినలేక నేను సిగ్గుపడి చావవలసి వచ్చునని నే నతనికి తెలియబరచితిని.

మిూకినుగారు నామాటలకు కోపగించుకొనిరి. తాను యేండ్లుగడచినవాడగుటయెగాక మాకుటుంబమునకు పెక్కు సంవత్సరముల నుండి న్యాయవాదిగ నుండుటవలన తనమాటల కెట్టియభ్యంతరమును చెప్పకుండుట మంచిదనియు, అట్లుగాక వితండముల వాదించుటవలన నామూర్ఖత్వము బయటపడుననియు నతడు గట్టిగ చీవాట్లు పెట్టెను.

అయినను నాయభిప్రాయము నించుకయు మార్చుకొనక ఒకవేళ ఫ్లోరెన్సుయొద్దనున్న వీలు నిజమైనదేకావచ్చుననియు, నిజమేయగు నెడల నాతరఫున నుండుటకు బదులు ఫ్లోరెన్సు తరఫున తాను వకీలుగ నుండవలసివచ్చునేమో యనియు కొంటెతనముగ బలికితిని.

ఈమాట యతనికి చాలనొప్పి కలిగించెను. దురదృష్టవశమున నటులనే జరుగునెడల ఫ్లోరెన్సెంత ధనమిచ్చెదనన్నను గూడ తాను తనధర్మకర్తృత్వమునకు రాజీనామా యిచ్చునేగాని మార్టినుగారి కుమార్తెకెదురుగ వాదింపడని యతడు ఎలుగెత్తిచెప్పెను. ద్యూకు అందు ద్యూకు కంపెనీయందు నాకెంతయభిమానమున్నదో యంతకంటె నెక్కువయభిమానమును గౌరవమును తనకు గలవను సంగతి నతడాచూపులలో వ్యక్తపరచెను.

ఫ్లోరెన్సు యెచటనున్నదో తెలిసికొనుట ప్రస్తుతము చాల అవసరమను అభిప్రాయమున మేమిరువురము నేకీభవించితిమి. రెండురోజులు గతించినవి. మరేమియు జరుగలేదు. ఆతరువాత ఫ్లోరెన్సుయొద్ద నుండి యొకలేఖవచ్చెను. సంగతి సందర్భములన్నిటిని బాగుగనాలోచించుకొని సంవత్సరమున కయిదు వేల సవరనులనిచ్చుట కంగీకరించుటమంచిదనియు, లేకున్న తానావీలును తన వకీలుచేతికిచ్చి తగిన చర్యనడిపింపవలసివచ్చుననియు నామె వ్రాసెను.

ఉత్తరములో నామె వైఖరి మరింత బెట్టుగనుండెనేగాని ఏమాత్రమును మారలేదు. నన్ను భయపెట్టుట కామె యిట్లువ్రాసినదనియు,

మనిషిని బేజారుచేసి ధనమపహరించుట కామె యుద్దేశించినట్లు ఋజువు పరచుట కీయుత్తరము బాగుగ నుపయోగించుననియు మీకినుగారు చెప్పిరి. కాని మీకినుగారికా నాడా దుర్మార్గురాలిపై గలిగిన కోపమున కంతములేదు.

ఈ యుత్తరము వలన చివరకెట్టి లాభనష్టములు సంప్రాప్తము కావలసియున్నను ప్రస్తుతమొక లాభము మాత్రము కలిగెను. ఆమె పాడింగ్టనులో నివసించుచున్నదని మేము తపాలా ముద్రనుబట్టి గ్రహింప గలిగితిమి.

ఆ దినము మేఘావృతమై చలిగాలి యెక్కువగ విసరుచుండెను. చిన్న చిన్న తుంపరులు పడుచుండెను. నేనును మీకినుగారు నొకగుర్రపు బండినెక్కి పాడింగ్టనునకు బయలుదేరితిమి.

చివరకు మాబండి యొకమేడకడ నాగెను. ఆవీధిలోని యిండ్లన్నియు నొకేతీరున నందవికారముగ నుండెను. మేమరిగిన మేడకు పదెనిమిది విద్యుచ్ఛక్తిగంట లమర్చియుండెను. దాని నంతటిని చిన్నచిన్న గదుల క్రింద విభజించిరి. వివిధవృత్తులుగల వివిధ దేశములవారందరు నివసించు చుండిరి. ఎవరిగదిగుమ్మమునకు వారివారి పేరులను, వృత్తులను తెలుపు బల్లలు వ్రేలాడుచుండెను. వాటియందొకమూల లారెన్సుసతిబల్లగూడ వ్రేలాడియుండెను. సగము చెరగిపోవుచున్న యక్షరములతో నున్న ఆబల్ల మరియొకరిబల్ల కడ్డముగ వ్రేలాడుచుండెను.

దరిద్రమంతయు నాబల్లపై మూర్తీభవించినట్లుండుటను జూచిన తోడనే నాకు పట్టలేనంతదుఃఖము వచ్చినది. లారెన్సు డ్యూకు పేరు ప్రతిష్ఠలెంత హీనస్థితికివచ్చినవో చూచి యతడు మాత్రము విచా రింపకుండునాయని నేను మీకనుగారివైపు చూచితిని.

న్యాయవాదులును, తదితరులును గలసి లారెన్సుసతిడబ్బు అంతటి నెటులనో హరించిరి. ఆమెతల్లి నగలుగూడ విక్రీతములైనవి. లారెన్సు అరువుతెచ్చిపెట్టిన నగలన్నియు మరల నాయావర్తకులకడ జేరినవి. వాటియుద్దేక్రింద నేను రెండువేలసవరనులను చెల్లింపవలసివచ్చెను. ఇంతియెగాక యింకెన్నియో ఋణములను, లారెన్సుచేసినవాటిని నేను తీర్చుకొనవలసివచ్చినది. మొత్తముపై లారెన్సుతరఫున నేను చెల్లింప వలసిన డబ్బంతయు సుమారొక లక్షసవరనులయ్యెను. ఈడబ్బు నీయ నని నేను త్రోసివేయుటకు ఎంతేనియు నవకాశముండెను. కాని కుటుంబగౌరవమునకు లోపముగలుగునను ఉద్దేశ్యముతో వాటినన్ని టిని వాయిదాలపై క్రమక్రమమున తీర్చుకొంటిని.

మీాకినుగారిట్టి విషయములలో చాలవరకు నాతో నేకీభవించు చుండిరి. డ్యూకుల కుటుంబగౌరవమున కెట్టి లోపమును గలుగకూడ దను అభిప్రాయమున నతడు నన్ను మించిపోయెను. కాని ఫ్లోరెన్సు విషయములో మాత్ర మతడించుకయు గనికరింపకుండెను.

దొంగసంతకములనుచేసి కుట్రలపన్ని యొరుల ధనప్రాణముల నప హరింప ప్రయత్నించిన దుర్మార్గురాలిని పట్టుకొని తగినశిక్ష విధింప వలయునని యితడిచటికి వచ్చెను. ఎంతద్రోహ మొనరించినను గూడ లారెన్సు డ్యూకుభార్య యింతపాడువడిన గృహమునందింత నీచముగ జీవించుచున్నదిగదాయని నాకు పట్టలేనంత విచారము గలిగెను. ఆమె బల్లయొద్దనున్న విద్యుచ్ఛక్తిగంటను మ్రోయించితిమి. ప్రత్యుత్తరము లేకుండుటజూచి మీాకినుగారు మరిమూడునాలుగుసారులు మ్రోయించి నట్లు నాకు జ్ఞాపకము. అయినను ప్రత్యుత్తరములేకపోయెను.

ఇంతలో నొకవనిత వీధినూడ్చు పాకీవాని కేదియో పని చెప్పనెంచి కాబోలు నీవలకు వచ్చెను. ఆమెమాటలధోరణినిబట్టి యింటి యజ మానురాలేమో యని సంశయించి ఆమె నడిగినయెడల ఫ్లోరెన్సు గృహమునం దున్నదియు లేనిదియు తెలియగలదని మీాకినుగారు నాతో బలుకుచుండగా నామె మావైపుతిరిగి "మీారేమి పనిమీాద వచ్చిరి?" అని యడిగెను. ఆయడుగుటలో నైన నతినేర్పుగ నడిగెను. ఆముఖమునందు గాని స్వరమునందు గాని, స్నేహవిరోధభావములం దొకటియు గన్పించకుండెను. కాని ఆమరుక్షణముననె యతి స్నేహ ముగ గాని యతివిరోధముగ గాని మారు నట్లాముఖలక్షణములు చెప్పక చెప్పుచుండెను.

"డ్యూకు సతిగారిని చూడవచ్చితిమి. ఎన్నిమారులు గంట మ్రో యించినను కార్యములేకున్నది." అని మీాకినుగారు కొంచెము విసువు కొనునట్లు పలికిరి.

పాపమా ముదుసలి కాళ్లకు కళ్లకు చేతులకు, తలకు వలయు వస్తువులన్నిటిని పూర్తిగ నలంకరించుకొని దర్జాగా వచ్చియుండగా నాతని కసహ్యాకరముగ గన్పించుచున్న యిల్లు అంతకంటె నసూయ గలిగించు యింటి యజమానురాలు తాను నిరీక్షించుచున్న మనిషి యెప్పటికి రాకుండుటయు, ఇవిచాలవేమో యనునట్లా సమయమునకె చెత్తనెత్తుకొని పోవువాడు వీధినూడ్చుటయు, ఆదుమ్ము అతని బట్టలపై బడుటయు, అతనికెంత విసువుదలనైన గలగించియుండును.

అయిన నతడెంతయో యోర్మివహించి మారుపలుక కూరకుండిన ఆ మనిషిని "మేము లోపలికి పోవచ్చునా ? "అని యడిగెను.

"ఏమో కనుగొనియెద" నని ఆస్త్రీ చెత్తనూడ్చువానితో నటులనే పోరాడుచుండెను. వాడామెకు నిర్లక్ష్యముగ జవాబు చెప్పుచు ధూళి రేపుచు తనపనిని చేసికొనుచుండెను. ఆధూళియంతయు మామీద పడుచుండెను. ఎన్నిమారులు గంటమ్రోయించినను లోపలినుండి యెవరును గదలిరాకుండిరి.

* * * *

మమిస్మారీతి నెంతయో సేపు విసువెత్తించినపిమ్మట దర్శనమీయ నెంచి ఆకలవాకంటె యిట్లూరకొనుచున్నదని నేననుకొంటిని. కొంత సేపటికి మరల నామె మావైపుతిరిగి ఏమియు నెరుగనిదానివలె "ఎందుకువచ్చిరి ? " ఎవరుమీరు ? " అని మరల నడిగెను. మాకినుగా రోషికపట్టి మరల పూర్వ ప్రత్యుత్తర మంతటి నేకరువుపెట్టిరి. ఇంతలో నేను తెలివితెచ్చుకొని అతడు చూడకుండ నామెచేతియందొకషిల్లింగు నుంచితిని. ఆషిల్లింగు నేననుకొనినంతకంటె నెక్కువ అద్భుతముగ పనిచేసినది. ఆమె వెంటనే నాదెసతిరిగి " ఇప్పుడామెలోపలనున్నదో లేదో నాకు తెలియదుగాని యెవరువచ్చినను యింటిలో లేనట్లు చెప్పుమని నాతో చెప్పినది. ఆమె యేమిచెప్పినను మీరిపుడు మేడ

మీఁది కరిగెదమని పట్టుదలగ చెప్పునెడల నేను నిర్బంధింపగలనా? మేడమీఁది రెండవగదియె యామెది.”

మీకినుగారు చిరునవ్వు నవ్వుకొని తామింత తాలిమితో మాట్లాడుటవలననే యామె యింత నెమ్మదిగ మాట్లాడిన రహస్యమునుగూడ జెప్పివేసినదని యుద్దేశించుకొని ఆమె చేతిలో రెండుపెన్నుల నుంచెను.

భగవంతుడు దయతలచి విచారములను సులభముగ మరిచిపోవు స్వభావము నాకు గల్పించెను. అందువలన నప్పటి దురవస్థల నెట్లు భరించితినో చెప్పజాలను గాని మీకినుగారు తన మంచితనమువలననే ఫ్లోరెన్సు రహస్యమును కనుగొన గలిగితినని నాడాలోచించుకొని నవ్విన నవ్వు నాకిప్పటికిని జ్ఞాపకమున్నది. ఆడబ్బుగూడ నందుకొని యామె మాముం దరిగి మాకు దారి చూపింపసాగెను. మహోవదాన్యోత్తమునివలె మీకినుగా రామెవెంట నెంతయో “దర్జా”గా నడువ సాగిరి.

ఆగృహాంతరభాగము మరింత అసహ్యాకరముగ నుండెను. ఆదుమ్ము, ఆకంపు, యిప్పటికి గూడ తలచుకొనినంత మాత్రమున వాంతిపుట్టించు నట్లుండెను. అచటగూడ ఫ్లోరెన్సు గదిమీఁద నామె పేరున నొక యట్ట వ్రేలాడగట్టి యుండెను. ఎవరును తన్ను జూడనవసరము లేదనుకొను మనిషి యీయట్టల నేల వ్రేలాడగట్టవలయునని నాకు సందేహము కలిగెను. ఆగుమ్మమునకు విద్యుచ్ఛక్తిగంట లేనందున మేము తలుపు తట్టితిమి. ఈమారెక్కువకాల మామెకొఱకు నిరీక్షింప నవసరము లేకపోయెను.

* * * *

ఫ్లోరెన్సు స్వయముగనె తలుపుతెరచెను. తల దువ్వుకొననందున నామెముఖ మందవికారముగ గన్పించెను. ఆదినమామె స్నానము చేసినట్లు గూడ గన్పించకుండెను. నాడు కారాగారమునకు నన్నంపినప్పు

డా మెధరించిన దుస్తులకును, యిప్పటిబట్టలకును, అప్పటి ముఖ విలాసమునకును, యిప్పటి ముఖవైఖరికి నెంతయో భేదముగలదని నేననుకొంటిని.

రాజీనిమిత్తము మిాకినుగారి యొద్దకు మూడునాలుగుసారులు పోయి యుండుటవలన నామె మిాకినుగారిని బాగుగ నెఱుగును.

"ఓహో మిారా! లోపలికి దయచేయండి! నేననుకొనలేదు. మిారు వచ్చెదరని—నేను ఎట్లయిననేమి! మిారిప్పటిలో విచ్చేయుట యెంతయో సంతోషకరముగ నున్నది. ఒక్కగడియ మాత్రము క్షమింపవలయును—"

అనుచు నామె మాకొక గదిని చూపించుచు లోపలికరిగెను. జుట్టుదువ్వుకొని మరియొకబట్ట మార్చుకొనుట కామె లోపలికేగి యుండవచ్చునని నేననుకొంటిని. ఆగది యెన్నిదినములనుండియో తుడువనట్లుండెను. గోడలకువేసిన రంగంతయు వెలసిపోయియుండెను. మిాకినుగారా గది నతిజాగరూకతతో పరికించుచుండిరి. నాకెంతయో యసహ్యము గలిగి కన్నులు మూసికొంటిని. ఆగదిలో నొక మేజాపై రెండుగదులుగల "ట్రే" యొకటి యుండెను. దానిమిాదనున్న డాగులనుబట్టి లోపలనుంచిన కల్లుసీసాలు వొలికిపోయి యుండవచ్చునని యెవ్వరైనను సులభముగ గ్రహింపవచ్చును. నేలమిాద బరచియుంచిన కొబ్బరిత్రాళ్ళ చాపమిాద గూడ నచ్చటచ్చట నల్లనిమరకలు కట్టి యుండెను. ఆమెను జూడవచ్చిన స్నేహితులు సగముకాల్చి పారవేసిన సిగరెట్టుపీకలవలన త్రాళ్లుకాలి యామచ్చలుగట్టినవని సులభముగ గ్రహింపవచ్చును. భోజనములబల్లపైనున్న మచ్చలనుబట్టి చూడగా దానిని తఱచుగ బట్టలను చలువచేయుట కుపయోగించుచున్నారని యెవరికైన స్పష్టముకాగలదు. చూరుచాపలు ధూళిధూసరితములై నిర్లక్ష్యముగ లాగుచుండుటవలన సగము జారిపోవుచుండెను.

కుర్చీమీటలు విరిగిపోవుచున్నట్లవి కదలునపుడెల్ల చప్పుడగు చుండెను.

ఫ్లోరెన్సు పేదరిక మనుభవించుచున్నదే మోయని యనుమానించితినిగాని ఇంతదుర్భరస్థితియందున్నదని నేనూహింపలేదు. మనుష్యులు పేదఱికము ననుభవింపుచుండవచ్చును. కాని పేదవారముగదాయని యసూయాస్పదులమై, ధూళిధూసరులమై, కంపురొప్పుచు నుండనవసరములేదు. నేను కటికపేదఱికము ననుభవించితిని. దానివలన నేనెన్ని కష్టముల నొందినను కొన్నిలాభములు గూడ లేకపోలేదు. నామట్టునకు నాకు నష్టములకంటె లాభములె యెక్కువనుండునట్లు కన్పించెను. లేనిపోని యనవసరపు బాధ్యతలును, వేషములును తగ్గును. సామాన్య వర్తకులందరు బాగుగ పరిచితులయి, యెక్కువధరలనుచెప్పి యెక్కువ ధన మవహరింప ప్రయత్నింపరు. బట్టలానాటి కుండవలయు 'ఫేషను'ల ప్రకారము నుండనందున యెవరేమనుకుందురోయను భయముండదు. నాటకములకును, చిత్రప్రదర్శనములకును పోవునపుడు నాల్గవతరగతిలో కూర్చున్నను అడుగువారుండరు. ఆకలి యధికముగా నుండునపుడు రోడ్లప్రక్కలనమ్ము ఫలముల కొనుక్కొని యాప్రక్కనే తినవలసి వచ్చునపుడెవరైన జూచి యేమనుకొనియెదరో యను బిడియముండదు.

ఈ పనులన్నియు స్వయముగ నొనరించిన దాన నగుటవలన వివరముగా చెప్పగలుగుచున్నాను. పుచ్చులేని కాయగూరల స్వయముగా నెంచి బజారులో కొని యింటికిపోయి వాని తరిగి వండి భర్తకు వడ్డించుటవలన నాకెంతయో సంతోషము కలుగుచుండెను. కాళ్లకు తొడగికొను మేజోళ్లెన్నిసార్లు చినిగిపోయినను వానిని స్వయముగా బాగుచేసుకొని తొడుగుకొనుచుండగా నెవరు నాటంకము చెప్పలేదు.

ఇటువంటి దారిద్ర్యబాధల నేనెరుగకపోలేదు. మాభర్తలు మా వివాహకాలములందు మాకిచ్చిన వివాహపుటుంగరములను తాకట్టు

పెట్టుకొనవలసిన దినములు గూడ నాకును రోజుమేరకిని సంప్రాప్తము లైనవి. లవుజాయి ఆసంగతి విని తనకేలముందుగా చెప్పకపోయితి మని యెంతయో నొచ్చుకొనెను. జూదమాడుటకుగాని వినోదముల సేవించుటకుగాని మేమట్లొనరించిన యెడల నెవరేమయిన ననవచ్చును. ప్రాణమునిలబెట్టుకొను నిమిత్తము, ఆహారమునకై మేమట్లు చేయ వలసివచ్చినది. అంత కటికపేదరిక మనుభవించినను గూడ నేనెప్పుడింత మురికిగా నుండలేదు. 'కుళ్లు' అన నెట్టిదియో నట్టి నిరుపేదరికమును గూడ నేనెరుగకొంటిని. మనిషి జీవముతో బ్రతుకుటకేమాత్రము నవకాశమున్నను, చిన్న సబ్బుముక్క, చీపురుకట్ట, చింకికొల్లాయిగుడ్డ సంపాదించుకొనుట కవకాశముండకపోదు. ఎప్పుడైన యట్టియవకాశము గూడ లేకపోయినప్పుడు వానిని యిరుగుపొరుగులవారి నడిగి అరువు తెచ్చుకొనుట కెట్టి యాటంకము నుండజాలదు.

పదినిముషములు మేమచట గూర్చుండిన పిమ్మట ఫ్లోరెన్సు తల దువ్వుకొని, మంచి దుస్తుల ధరించివచ్చెను. మాటలాడుచుండినపు డామె పెదవులు వడకుచుండినట్లు నాకు తోచెను.

"మీరా వీలును గురించియే వచ్చిరికాబోలును ?"

"మరియేమి ! మీకినుగారనిరి."

"ఆవీలునుబట్టి నాకు గల హక్కులన్నిటిని విడిచిపెట్టుకొనియెద ననియు, యెట్లైన రాజీచేసుకొనుటయే నామతమనియు నేనిపుడే లోర్నాకొక జాబువ్రాసి—"

"బహుశా వీలులు దస్తావేజులు మొదలగు వాటినిగురించి శాస నము లెట్లున్నవో మీకు తెలియక మీరట్లువ్రాసియుండవచ్చును. దొంగ వీలులను సృష్టించుట యెంతద్రోహమో వ్రాసినవీలులను కప్పిపుచ్చుటగూడ నంతద్రోహమేయగును. ఫేజునతి అట్టిద్రోహమొన రించుట కెన్నడును సమ్మతింపజాలదు. అనగా మీదగ్గరనున్నవీలు

చెల్లునోచెల్లదో అందునుగూర్చి యామె తగవులాడదని నేనుచెప్పను. కాని వ్రాసినవీలును కప్పిపుచ్చుటకై యామె యెట్టి లంచగొండి చేరము ను చేయజాలదనిమాత్రము ఖండితముగా చెప్పగలను. మేము కోర్టులో నిపుడు దాఖలుచేసినవీలు కాదని దానివెనుక కీర్తిశేషులైన సర్ మార్టినుగారింకొక వీలును వ్రాయుటయు దానిప్రకారము మీరే వారియాస్తికంతటికిని వారసులగుటయు జరుగునెడల మీరే ప్రస్తుత మామెయాక్రమించుకొన్న స్థితియందుందురు. మీకామెయందుదయ దాక్షిణ్యములంత యెక్కువగానున్న యెడల మీయాస్తిలో కొంత భాగమిచ్చి యామెను కటాక్షింపవచ్చును. కాని మీచేతులోనున్న వీలుప్రకారము జరిగింపక దానిని దాచివేయుదుననుటమాత్రము తప్పు. *

ఫ్లోరెన్సు రెప్పలు మూతపడినవి. ఆముడుచుకొనిన విధమును బట్టిచూడగా యామెకట్టియధికారమే లభించునెడల నాకొక చిల్లిగవ్వ యైన నిచ్చుటకంగీరింపకుండునని నాకుతోచెను. తిరిగి యామెకన్నులు తెరువగనే " మంచిది. ఆవీలు నొకమారు నన్నుజూడనిచ్చెదరా! "అని మీకినుగారడిగిరి.

ఒక నిమిషమామె తటపటాయించి ఆవెనుక నొక దీర్ఘనిశ్వాసము విడచి "తప్పకుండ చూడవచ్చును" అని యామె లోపలికరిగెను.

## ౪౭

"అనవసరముగ నీ యువతి చిక్కులలో పడుచున్న" దని మీాకినుగారుచేతులను నులిమికొనుచు బలికిరి. పరిస్థితులాయన కనుకూలముగ నుండునప్పుడట్లు చేతులను నులిమికొనుట అతనికలవాటు. లోర్నా! ఆమె యాందోళనమును కనిపెట్టితివా? నేనా వీలుజూచుట ఆమెకిష్టము లేదు. నన్ను మోసగించుటకు వీలులేదని యామె యెరుగును." అని యతడు సగర్వముగ బలికెను.

నా యప్పటి యాలోచన నతనిమాటల నంతగా చెవిని జొరనీయకుండెను. ఏ స్త్రీయెంత తుచ్ఛురాలైనను పురుషులతో వాదించి, పరాభవమొందుట నా కెంతమాత్ర మిష్టముండదు. అందువలన నా కెంతయో బాధకలుగును. ఆ బాధ యిట్లుండునని నేను వివరించి చెప్పజాలను. తనవిజయమున కానందించుచు నా రీతిని చేతుల నులిమికొనుచు కూర్చుండిన మీాకినుగారి మూర్తివంతయు నాకా సమయములో కేవలమడవిమనిషి యాకృతివలె గన్పించెను.

ఆ గృహమందలి విపరీతపరిస్థితులకు శరీరము జలదరించుచుండ మీాకినుగారి యందలి యసూయ యతిశయించుచుండ నేనతనితో "పాపమామెస్థితి అత్యంత నిరాశభూయిష్టముగా నున్నట్లున్నది" అని పలికితిని.

"అత్యంత అపాయకరముగా నున్నదను" అని యతడు నామాటల సవరింపజూచెను.

"అన్నవస్త్రము లిచ్చి తగినవసతులను నేర్పరచునెడల నామెకెట్టి ప్రమాదము నుండ" దని నే నంటిని.

"మన మెన్నిచేసినను కాదనదుగాని యామె మాత్రమందుల కించుకయు కృతజ్ఞతచూపదు" అని యతడు మారుపలికెను.

ఆ మాటనిజమె. ఆమె తప్పక కృతఘ్నురాలగును. ఎవరు కృతజ్ఞులగుదురో, ఎవరు కృతఘ్నులగుదురో యను సందేహము ప్రతివారు నాలోచించుచుండిరేని ప్రపంచముసందేపనియు జరుగదు. ఫ్లోరెన్సు నా కెంతమాత్రము కృతజ్ఞతజూప నవసరములేదు. కృతజ్ఞతజూపుట కామె కెట్టియవకాశము నుండదు. గాని యామె యంతరాత్మకు సర్వసాక్షియగు పరాత్పరుడొకడు పైనున్నాడను సంగతి బాగుగా భోధపడవలయును. అప్పుడు ఆమె దైవమునకైన కృతజ్ఞతను తెలుపగలదు. అని నేను ఆలోచించుకొంటిని.

కాని యీాదయార్ద్రపు టాలోచనలన్నియు నెంతనిష్ప్రయోజనములుగా పరిణమించునో మాతాశిశువుల మిరువురమిపు డెంతప్రమాదకరస్థితియందుంటిమో ఆ సంగతి నే నపుడించుకయు నూహింపనైతిని.

*  *  *  *

ఫ్లోరెన్సు తిరిగివచ్చునపు డామె శరీరమంతయు వెల్లబారియుండెను. ఏదైన జబ్బు ప్రవేశించినదేమో యని నే ననుకొంటిని. మా యింటిలో నా కిదివరకు జూపించిన వీలు ఆమె చేతియందుండెను.

దాని నామె మీాకినుగారి కిచ్చెను.

మీాకినుగారందుకొని కళ్లజోళ్లనించుక సవరించుకొని కాలుపై కాలునినుమడించి కూర్చుండి మిక్కిలి జాగ్రత్తగా దానిని చదువనారంభించిరి.

ఆ గదియందు దొకగోడకమర్చియుండిన చవుకరకము "అలారమ్" గడియారము టిక్కుటిక్కున చప్పుడుచేయుచుండెను. ఆ గడియారపు శబ్దము తప్ప మరేమియు విన్పించకనంతయు నిశ్శబ్దముగా నుండెను.

ఫ్లోరెన్సు "బిఱ్ఱబిగిసి" నట్లు కూర్చుండెను. కాని ముఖముమాత్రము మరియొక వంకకు త్రిప్పుకొనియుండెను. ఆ ముఖవైఖరి యేది యెట్లైనను సరియే యను యుపేక్షభావమును ప్రకటించుచుండెను. మమ్ము మోసపుచ్చుట కామె యట్లు నటించుచున్నదని నేనూహించితిని.

ఇక నా సంగతియా! ఏదియో కలగనుచున్నదానివలె మనస్సంతయు కలవర మొందుచుండగా మీకినుగారి వైఖరి నంతటిని తదేక దృష్టితో చూచుచుంటిని. ఆతని ముఖలక్షణములను బట్టి చూడగా స్థితిగతులు నే ననుకొనినంత సులభముగ పరిష్కృత మగునట్లు కన్పించ కుండెను.

ఆ దస్తావేజు నామూలాగ్రము నతిజాగరూకతతో—పదిసారులైన—చదివిన పిమ్మట నతడు తలయెత్తి కంటిజోడు నించుక సవరించుకొని జేబులో నున్న భూతద్దమును పైకి తీసి చేతిరుమాలుతో దానిని బాగుగా తుడచి దానిని కళ్లయెదుట బెట్టుకొని మరల దస్తావే జంతటిని జదువ జొచ్చెను.

ఆతడు చదువు చాలించి మాతో తిరిగి మాట్లాడునప్పటి కెన్నియో జన్మాంతరములు గడచిపోయినట్లు నాకు తోచెను. అట్లెంతయో దీర్ఘ కాలము గడపిన పిమ్మట నతడు "ఇది యదార్థమైన దనుటకు సందేహము లేదు. దీనియం దెట్టి లోపములును లేవు." అని నిర్ధారణగా పల్కెను.

ఫ్లోరెన్సు పెద్ద నిట్టూర్పు విడచెను. ఆమె ముఖము మరింత తెల్లబడెను. కాని కన్నులు మాత్రము విజయసూచకముగా నా కన్నుల నెదుర్కొనెను. నే నది జూచి తృళ్లిపడి మీకినుగారి దెస జూచినట్లు జ్ఞాపకము.

"మీకినుగారూ! మీరు చెప్పిన దంతయు నిజము. ఈ వీలును వెంటనే నేను కోర్టులో దాఖలు చేయవలసి యుండెను. కాని న్యాయముగ ఫేజుసతికి రావలయు నపారమగు ఆస్తి నంతటిని నే నిట్లాక్రమించుకొనుట అన్యాయము కాదా యను కారుణ్యభావమున నింతకాల

ముపేక్ష జేసితిని. నాకు పిల్లగాని, పిచ్చుకగాని లేదు. ఆమె పిల్లపిల్ల తరముగా దీని ననుభవింపవచ్చును. ఇన్ని సంగతుల నాలోచించి సంవత్సరమున కైను వేల సవరనులు మాత్ర మిచ్చిన జాలునంటిని. కాని నా తెలివితక్కువ యాలోచన యామె కెంతమాత్రము నచ్చలేదు. ఇంక నిపుడో-అంతయు మించిపోయినది—ఇటుపై నామెయె నాదయ కెదురు చూడవలసి యుండును."

మీాకినుగారి ముఖలక్షణములను బట్టి చూడగా నత డా వీలు నాక్షణముననె ముక్కలుముక్కలుగా జింపివేయుదురని మాకు తోచెను. కాని యతని న్యాయపద్దైకాభిలాష యతని నట్టి పని చేయనీయకుండెను.

"సరియె. ఆవిషయమై మనము తరువాత మాట్లాడుకొందము. లారెన్సు డ్యూకున కీయాస్తి నిచ్చునప్పుడును, అతడు మరణించునపుడును మనస్థిమితము లేకుండెనను అంశము నాధారము చేసుకొని భేజు సతి వాదింపక మానదు. దీని నపుడె కోర్టులో దాఖలుచేసితి వను కొనియెదను."

"దాఖలుచేసితిని. లారెన్సు డ్యూకు నా కెన్నియో యప్పుల నంట గట్టి మరణించెను. వానిని తీర్చుటకు యీా వీలు ప్రకారము రావలయు నాస్తి తప్ప మ రే యాధారమును లేదు."

"ఆ యప్పు లన్నిటి నింతవరకు భేజుసతియె తీర్చుచున్నది గదా?"

"సందేహ మేమి? నా భర్త యాస్తిలో నుండియే తీర్చుచున్నది."

ఘోరెన్సు వాక్యములు నిజమని నాకు తోచినవి. నెడ్డును నేనును నివసించుచుండిన కుటీరము నింకను నా స్వాధీనమం దుంచుకొనినందులకు నే నపుడు సంతోషించితిని. ఘోరెన్సును నేనును నిరంతరము దాగురుమూత లాడుట కీలోకమున జన్మించినట్లు నాకు తోచెను. పరిస్థితులు నా కనుకూలముగ నుండునపు డామెకు విషమముగా పరిణ

మించుచున్నవి. ఆమె సుఖముగ నుండు పరిస్థితులు నాకు దుఃఖభాజక ములుగ గన్పించుచుండెను. ఈ వింతనాటక మెట్లంతమగునో యని నాకు సంభ్రమాశ్చర్యములు గలుగ జొచ్చెను.

*　　　*　　　*　　　*

నే నిట్లు తలచుచుండగా మీనాక్షిగారి న్యాయశాస్త్రానుభవ బుద్ధివైశద్యమున కా వీలును గురించి యెన్నియో యంశములు కాగిత ములకట్టలను బట్టుకొని కోర్టులలో తిరుగులాడుచుండుట అతని మనో ప్రపంచమున బాగుగా గన్పించుచుండెను. ఈ వ్యవహార మంతయు పరిష్కృతమగువరకు నే నీ యాస్తిని తాత్కాలికముగ నైన ననుభ వింపవచ్చునా, కూడదా యను సంశయము నా మనము గలంచుచుం డెను. చిన్ని మార్టిను నిరుపేదరిక మనుభవింపవలసి వచ్చును గదా యని యాలోచించుచుంటినే గాని లేకున్న వెంటనే జేతులు రెండింటిని జోడించుకొని "నీ కోర్టుల కొక దండము, నీ మాయలకు మరి పది దండములు. వాటితో నా కెట్టి సంబంధము నవసరము లే" దని చెప్పి ఆ స్తి నంతటిని ఫ్లోరెన్సున కప్పగించి మా పూర్వపుకుటీరమున కరుగుట మంచిదని నేను వెంటనే నిశ్చయించి యుందును. న్యాయశాస్త్ర సంబం ధములగు లోపాలోపములను గూర్చియు యుక్తిప్రతియుక్తులను గూర్చియు విశేషముగ నాలోచించి కాల మంతటిని మరి వ్యర్థము చేయకుడని మీనాక్షిగారిని ప్రార్థించి యుందును.

ఆమెయు నేనును పోట్లాడి కోర్టులవెంబడి తిరుగ నారంభించి, బంగారమువంటి యాస్తి నంతటి నప్పులపాలు చేయుట నాకు కష్ట తరముగ దోచుటయె గాక యవమానకరముగ గూడ దోచెను.

ధనము సంపాదించుటయె పరమావధిగ నెంచినయెడల మీనాక్షిగారి కా సమయమున నెంత ధనమునైన సంపాదించుట కవకాశ ముండెను. కాని అతని కట్టి యుద్దేశ మున్నట్టు నాకు తోచలేదు.

ఆదస్తావేజు న్యాయమైనదే యని మేముభయులముగూడ నంగీకరించితిమి. నాన్నగారి దస్తూరి నిరుపురము నెరుగుదుము. మాకంటె నావిషయమం దెక్కువ పరిచయముగలవా రింకొకరులేరు.

"దీనిని వెంటనే మీన్యాయవాదులకడ నిచ్చుట" మంచిదని చెప్పుచు మీకినుగా రాపీలు నామె కిచ్చివేసిరి.

"నాతరఫున తమరే వకాల్తి తీసికొనవలయునని నామనవి" అని ఫ్లోరెన్సు కోరెను.

"మీరొక లక్షసవరను లిచ్చినను నేనాపనికిమాత్ర మంగీకరింపను."

"ఆయాస్తి భద్రపరచుట కేర్పరచిన ధర్మకర్తలలో తమరు ముఖ్యులని దెలసినది.

"కావచ్చును. దస్తావేజు ఋజువై మీపక్షము తీర్పుచెప్పిన వెనుక ధర్మకర్తగ నేనెట్లు నడచుకొనవలయునో ఆరీతిగ ప్రవర్తించెదను. దైవముఖముజూచి చేయుపనులలో మీకెట్టి యన్యాయము జరుగదని నమ్మవచ్చును. కాని ప్రస్తుతము భేజునతిపక్షమున పనిచేయుచున్నాను. వారికి చాలకాలముబట్టి నేను న్యాయవాదిగ పనిచేయుచున్నాను. ఇప్పుడింకొకరి పక్షమున నెట్లు పనిచేయుగలను?"

"దావాఖర్చుల నిమిత్తము నాకిప్పుడు కొంతడబ్బు కావలసియున్నది."

"ఇప్పటి పరిస్థితులలో మీయిరువురిలో నెవ్వరికిని గూడ నేను డబ్బీయజాలను. మీకు కావలయు ధనమును ఋణముచేసి తెచ్చుకొనవలయును. ఈవ్యవహారమంతయు పరిష్కృతమై ఆమె పక్షము ననో మీపక్షముననో తీర్మానమగువరకు నెవ రాయాస్తి నుపయోగించుటకు నేనంగీకరింపజాలను."

"మరల నామె పక్షముగూడనా ? అని ఫ్లోరెన్సు క్రూరముగ నవ్వసాగెను.

"మరల నామె పక్షమునకో అని సందేహాస్పదముగ చెప్పితిని. అంతియగాక ప్రస్తుత పరిస్థితులలో ఋణము తెచ్చుట కామెకంటె మీకేఎక్కువ అవకాశములున్నవి. నా యనుభవమును బట్టి నాకు తోచిన నిశ్చయాభిప్రాయమిది."

ఈ మాటలు మరల నన్ననేక యూహాపరంపరలలోనికి దింపినవి. ఇదివరలో నేను స్వతంత్రించి యింటిక్రింద నాయొక్క ధనమంతయు వెచ్చించితిని. నెడ్డును నాన్నగారును మరికొంతడబ్బు బ్యాంకిలో కట్టుట మేలైనది. లేకున్న నాగతి యేమయియుండునో యని నేనపుడు పరితపించితిని.

*       *       *       *       *

పిమ్మట సంతాపహృదయములతో తలలను వ్రేలవైచుకొని నేనును మీకినుగారును గృహోన్ముఖులమైతిమి.

నా హృదయము మరల విచారాగ్ని పరితప్తము కాజొచ్చెను. నెడ్డు యింతలోనే రాగలడనియు,అతనికేదియో పెద్ద ఆస్తి దొరకినదనియు నాకు తెలియకుండిన యెడల నేను వెంటనే పూర్వకుటీరమున కరిగి యుందును. నెడ్డు సంపాదనతో మేమీగృహమును కొనుక్కొని యిచటనే వసియుంపవలయునని నేననుకొంటిని. నాన్నగారి యిల్లుగదాయను అభిమానమున తానెంత ధరచెప్పినను ఇచ్చెదనను యుద్దేశమున స్లోరెన్సు నాయొద్ద నెక్కువ ధనము నపహరించునేమోయని కొంతసంశయముగూడ గలిగెను.

మరికొన్ని రోజులవరకు మేము మరల నేవేవియో యోచనల బడితిమి.

నెడ్డుమరి రాడాయేమి ? ఈ సరి కెన్నిదినముల క్రిందటనో రావలసి యుండెనే ? అని మేడగది కిటికీలోనుండి యనేకమారులతని రాక కెదురుచూడ నారంభించితిని.

రోజామేరి నావిచారము నెరిగి నాయభిప్రాయముల మన్నింపదలంచి తన వివాహము నప్పటికి నిలిపివేసెను. నేనంత యాందోళనలో నున్నప్పుడు తానెట్లు సంతోషకరముగ వివాహమాడగలదని యామె వాదించుచుండెడిది.

ఎంతయోమంది న్యాయవాదులును, కంపెనీయుద్యోగులును, సర్కారుద్యోగులును, యింకెవరెవరో తగుమనుష్యులును నిరంతరము వచ్చుచు బోవుచు నుండిరి. పగటిపూటయేగాక రాత్రిభాగముకూడ పెక్కుదినము లదియేపనిగ నేను మిాకినుగారితో కాలము వెళ్లబుచ్చు చుండుట కతని భార్యయేమి యనుమానించునో యని నాకు సంశయము కలిగెను. అతడు నల్లే యుదయమనక, మధ్యాహ్నమనక నెల్ల వేళల వచ్చుచు బోవుచు నుండెను. ఒకనాటి యుదయమాతడు వచ్చు సరికి రోజుమేరీ యతనిపలుకరించి, జబ్బుతో పవ్వళించియుండిన నాగది లోనికి తీసికొని వచ్చెను.

*        *        *        *

నాకుచేసిన జబ్బు అంతగాఢమైనది కాకున్నను, మంచముపై పండుకొనియె యుండవలయునని డాక్టరు ఆజ్ఞాపించుటవలన నేనటులనే పండుకొనియుంటిని. గాలి యనుకూలముగ వీచుచుండినను, ఎక్కడ జబ్బుచేసిపోవునోయను భయమున రోజుమేరి నిప్పుచేసి గది నెప్పటి కప్పుడు వెచ్చగ నుంచుచుండెను. ఎక్కడెక్కడివియో మంచివాసనల నలరారు చక్కని పూవుగుత్తులను తెచ్చి యామె గదియంతయు నలంకరించెను. పలుచని కాశ్మీరపు దువ్వలువ గప్పుకొని నేను రాత్రి గానుతో పండుకొనియుంటిని. లేనిపోని విచారములతో హృదయము కృంగిపోవకుండుటకై మనసు నెన్నియోవిధముల కట్టుకొనుచుంటిని. కాని నాయిచ్ఛవచ్చిన రీతినంత యనుకూలముగ గట్టుకొనిన యీాయి ల్లంతలోనే మరియొకరి వశమగునుగదాయను విచారము నన్నంత

మాత్రమును విడువకుండెను. మరి యెవరికి చెందినను పోనీయని మనము నించుక నూరడించి యుందును కాని నాకా గర్భశత్రువుగ పరిణమించిన ఫ్లోరెన్సు వశమగునను యూహ జనించినంతనె హృదయము నీరగుచుండెను. పాపమూ ముదుసలి మీకిను గారికిని, నాకును గూడ కొంత విశ్రాంతికరముగ నుండునుగదాయని యెంచి యీజబ్బు నిట్లనే మరికొన్ని దినములవర కుంచుమని భగవంతు ననేకవిధముల ప్రార్థించితిని. అంతలో రోజుమేరీ యచ్చటికి వచ్చి మీకినుగారు నాతో నేమియో ముఖ్యాంశములను వెంటనే మాట్లాడవచ్చి రనియు, జబ్బు కుదురువర కూరకుండుటకు వీలులేదని చెప్పుచున్నారనియు పలికెను.

"బహుశా యేదైన శుభవర్తమానము గొని తెచ్చెనేమో!" అని నేనంటిని.

"శ్మశానములో శవజాగరము చేయువానివలె నున్న ఆముఖమును జూచునెడల నట్టియాశలేవియు గన్పించవు." అని రోజుమేరీ నవ్వుచు పలికెను.

"అయ్యో దైవమా! అట్లయిన చెడువార్తయే తెచ్చెనందువా యేమి?"

అనుచు పెద్దమూలుగు మూలుగుచు కర్పూరతైలమున పూర్తిగ తడసిన చేరుమాలును ముక్కున కదిమిపట్టుకొని యటులనే పండుకొని గోడవైపు తిరిగితిని.

## ౪౮

మిాకినుగారు చప్పుడుకాకుండ బొటనవ్రేళ్లనానుకొని నడచుచు మెల్లగవచ్చి "లోర్నా! మరలనీవు కటిక పేదరికమనుభవింపవలసి వచ్చినందులకెంతయు చింతించుచున్నా" నని పలికిరి. రాబోవు వకీలు నోటీసు చూచి నేనెచట బెంగపెట్టుకొనియెదనోయని యెంచి యాతడు స్వయముగ నావార్త నెరింగింపవచ్చెనట! ఫ్లోరెన్సుతో నెట్టిరాజీ యేర్పాటులును కుదరలేదట. కోర్టులో తీర్పు చెప్పువరకును నేనిల్లు ఖాళీచేయవలయునట! వారము రోజులలో యిల్లంతయు కాళీ చేయకతీరదట. ఇంతకష్టపడి, యింతసొమ్ము వెచ్చించి, యిన్ని దినముల నుండియు, బాగుచేయించుకొనిన యిల్లు చెదలపాలు, పందికొక్కుల పాలు కావలయునట! హాతవిధీ యింకేమి తెచ్చిపెట్టెదవు?

నాకీ సంగతిని చెప్పవలసివచ్చినందులకు మిాకినుగా రెంతయో నొచ్చుకొనిరి. రోజుమేరి యాతనిబోల్చిన పాత్రనతడు పూర్తిగ నటించినట్లు నాకుతోచెను. నా కప్పటిలో నంత్యక్రియలు చేయవలసివచ్చు నెడల నతడే శవ జాగరము చేయవలయునేమో యని నా కపుడు తోచెను.

"బహుశా నా కాళ్లుచేతులను గట్టియైన నావలకు మోసికొనిపో యెదరేమో?" అని నే నతిదీనముగ బలికితిని. పడిశము బాధయొక మూలవిశేషముగ బాధించుచుండెను.

మిాకినుగారు "భయపడవలదు. భగవంతుడుదయతో చూడక పోడు" అని యేవేవియో యుపశమనవాక్యములను బలుకుచుండిరి. ఇంతలో నాకు పెద్దతుమ్ము వచ్చుట చూచి నా జబ్బు తనకుగూడ ప్రాకునేమో యని భయపడి, తానింకను పెక్కుకాగితములను చూడవలసియున్నదను నెపముమిాద పఠనాలయమున కరిగిరి. దాని నతడు తనకచేరీగది

క్రింద మార్చుకొనియెను. నాన్నగారి మరణానంతరము కాగితములన్ని టిని జూచుటకు వీలులేకపోయెను. నా వారసత్వమును గూర్చి ప్రకటించిన వెంటనే మీాకినుగారు లారెన్సుయొద్ద నుండిన కాగితములన్నిటిని తీసుకొనిరి. ఆయనకు మతిస్థిమితముగ లేకుండుటవలన ఫ్లోరెన్సు మొదలు గాగల దుష్టవర్గము వాటినపహరించి యేమి కీడుచేయుదురో యని వాటి నతడు తీసికొనియెను. వాటిని తీసికొనినప్పటి నుండియు నతనికి తీరుబడిలేనందున నింతవరకు వాటిని జాగరూకతతో బరిశీలించుటకు వీలులేకపోయెను.

* * * *

ఆ కాగితపుకట్టలలో నేమియున్నదని మీాకినుగారెంత యోపికతో నెమకుచుండిరో ఆ సంగతి భగవంతునకె తెలియవలయును. నాన్నగారి బంధువులు మిత్రులు మొదలగువారు వ్రాసిన శుభలేఖాదులును, బొమ్మల కార్డులు, క్రిస్మసుకార్డులును, విందుల కాహ్వానించిన లేఖలును, యిరువదియేండ్లనుండి నిలువచేసి యుంచిన రశీదులును, బిల్లులును, యింకే వేవియో కాగితములు నుండెను. ఎన్నియున్నను మీాకినుగారికి ధైర్యమొనగూర్చు కాగితమొకటియు నా కాగితపురాసులలో గన్పించకుండెను. అత్యంతాద్భుతావహముగ నున్నను న్యాయముగనే గన్పించుచున్న ఆ కడపటి వీలు నాక్షేపించుట కేమైన ఆ ధారముగల కాగితమొకటియైన లేకపోవునా యని యతనికాంక్ష.

అయిన నా దినమె నాకు శుభదినముగ పరిణమించునని నే నించుకయు నూహింపనేరక శరీరవేదనకు తోడు మనోవేదనగూడ నన్నట మటించుచుండ నా మంచముపై నటునిటు పొరలాడుచుంటిని.

నా కేమి కావలసియున్నను తెచ్చియిచ్చెదననియు, పుస్తకములను గాని, పత్రికలను గాని చదివి వినుపించెదననియు చెప్పుచు రోజుమీరి నన్నుపశమించుచుండెను. "ఏది కోరినను యిచ్చెదను కాని పిల్లవానిని

మాత్ర మిచటికి తేజాల” నని యామె చెప్పుచుండెను. నాకు కావలసిన ఆ యొక్క పనిని చేయుట తక్కిన వెన్ని వేలుచేసిన నాకు తృప్తికలుగునని నేను బాధించుచుంటిని.

మీాకినుగారేలనో మేడదిగి క్రింది కరిగిరి. గంటసేపైనను మీాదికి రాలేదు. ఏమియు తోచక నడుము విరిగినపాముపలె పండుకొనుట నాకు కష్టముగ నుండెను. కొంతకాలమైన హాయిగ గడుపనెంచి యే నాటకమునకో, సినీమా ప్రదర్శనమునకో పోవలయునని నేనుద్దేశించుచుంటిని. ఇంతలో నెవరో మెల్లగ తలుపుతట్టుచున్నట్లు చప్పుడయ్యెను. రోజుమేరి యేదియో చదువుకొనుచుండుట వలన నాచప్పుడు వినలేదు. నేనొక నిముషమూరకుండి మరల చప్పుడగునేమో యని నిరీక్షించితిని. కాని మరిచప్పుడు కాలేదు. అంత నాకాశ్చర్యము కలిగి రోజుమేరి కా సంగతిని చెప్పి, ఎవరువచ్చిరో చూడమని చెప్పితిని.

ఆమె తలుపుతీసి చూడగ ల్యూసీ యచట నిలచియుండెను.

వీధిలో మేడమెట్లయొద్ద నుండవలసిన ల్యూసీ మేడమీాద పడకగదులదగ్గర నుండుటకు తగినకారణము నరయలేక, రోజుమేరి యామెపై ననుమానింపసాగెను.

“నీవేనా యిప్పుడు తలుపు తట్టినది” అని రోజుమేరీ యాముక్కాలి ముదుసలిని గద్దరించి యడిగెను.

అంత నామె బిక్కమొగము వేసికొని “లోర్నాకుమారి నొక్కమారు చూడగోరి వచ్చితిని.” అని భయముతో వణకుచు బలికెను.

"మరి యెవరును లేరు. మన ల్యూసీయే ! మిమ్మోలనో చూడవలయు ననుచున్నది." అని రోజుమేరీ చెప్పెను.

భాగ్యవిహీనయయ్యు కారుణ్యనిధియగు ఆజీర్ణాంబరధారి నాశరీర స్థితి నరయవచ్చినదేమోయని నేను తలచితిని.

"నేను క్షేమముగ నున్నాననియు, విచారమొంద నవసరము లేదనియు, యింతలో నే బయటికివచ్చెదననియు నామెతో చెప్పుము" అని నేను విసువుదలతో బలికితిని.

పాపము ల్యూసీకంటికి నేనెప్పటికిని లోర్నాకుమారినే !

"నేను లోర్నాకుమారి నొక్కమారు చూచుటకు వీలులేదా ? ఎక్కువకాల ముచటనుండను. ఆమెకెట్టి ఆయాసమునుగల్గించను. ఒక్క క్షణము అదిగో ఆదిక్కుమాలిన రోకుహాము గురించి యొక్క మాట అడిగి పోవలయునని వచ్చితిని." అని యామె దీనముగ బ్రతి మాలుచుండిన మాటలు నాచెవులబడియెను.

ఇదివరలో నేను ప్రాణావసానకాలమం దున్నప్పుడు పాపమీ నిరక్షరకుక్షి నన్ను దయతో రక్షించినది. ఇప్పుడు గూడ నాకీయుభయ జ్వరద్వయపీడన విమోచనము చేయగలదేమో ?

"ఆమె నొక్కసారి లోపలికి విడచిపెట్టుమమ్మా రోజుమేరీ !" అని నేను కేకవేసితిని.

రోజుమేరి ప్రక్కకు తప్పుకొనియెను. అప్పుడు ల్యూసీ లోపల ప్రవేశించెను.

నిరంతర పరిశ్రమవలన గడ్డలుకట్టిన నరిచేతులు నులిముకొనుచు, భరింపరాని మనోవేదన నేదినో యనుభవించుచున్నదానివలె నామె మోమును విన్నదనము దోప దీన భావమున నిలచియుండెను.

"ఏమిట్లువచ్చితివి ల్యూసీ ?" అని నేనడిగితిని. "అమ్మా! ఇప్పుడు యోకుహాము నాదగ్గరకువచ్చి తనగదిలో మరచిపోయిన కాగితముల కట్టను తనకిమ్మని కోరుచున్నాడు. ఆకట్టనిచ్చిన పదిసవరనులు నిచ్చెద నని గూడ ఆశపెట్టుచున్నాడు. పదిసవరను లక్కరలేదు, నాయొద్ద నపహరించిన ద్రవ్యము మరల నాకిచ్చిన జాలునని నేనంటిని. అతడం దుల కంగీకరించెను. అయిన నిన్నడిగి యిచ్చుట మంచిదని వచ్చితిని. వాడికి కావలసినదో, మరియొకటియో యిచ్చి నాడబ్బు నేను రాబట్టు కొనుట న్యాయముకాదమ్మా ?"

వెంటనేలేచి పిచ్చియెత్తినదానివలె నిట్టనిలువున నిలచుండి, ల్యూసీ నేమేమియో ప్రశ్నలనడుగ నారంభించితిని. "ఆ ముష్కర జర్మనుడేనా ? మరల వచ్చినాడా ? ఏమి కావలెనన్నాడా దుర్మార్గుడు ? ఫ్లారెన్సు బసలో వాడు కన్పించలేదేమి ? ఫ్రాస్టుజాడ గూడ గన్పించ లేదే ? వీరపుడేమైపోయిరి ? "

ఇంటి యలవాటులన్నిటిని పూర్తిగ నెరిగిన వాడగుట వలన పని వారందరు మధ్యాహ్న సమయమున భోజనముల కరుగుదురనియు, ల్యూసీవారికి వడ్డించుచు నొక్కర్తియె దిరుగులాడు చుండుననియు నెంచి ఆజోకీయిము సమయము కనిపెట్టి వచ్చెను. జోకీయిము పేరు వినునంతనె ల్యూసీ భయపడుచుండును. అట్టి స్థితిలో నా క్రూరుడామె గదిచెంతకరిగి యచట నొంటరిగ నామెతో మాట్లాడునపు డామె భావమెట్లుండెనో యూహింపవలయునేగాని వ్రాయనలవికాదు. తాను నౌఖరులందరికి యజమానుడగుటవలన వారియొద్ద లంచపంచ ముల గైకొనుట న్యాయమేమైనను, ల్యూసీయొద్ద ననవసరముగ నెక్కువడబ్బు పుచ్చుకొంటినని వాని యంతరాత్మ చెప్పగా నతడా డబ్బు నిచ్చివేయుటకు వచ్చెనట! ఆరుసవరనులు మాత్రమే గాక

వాటికి వడ్డీక్రింద మరిరెండు నవరసులను యిచ్చెదనని యతడు వాగ్దాన మొనరించెనట.

ఆమె యందు కంగీకరించిన పిమ్మట తన కామెవలన నొక చిన్న యుపకారము కావలసి యున్నదని చెప్పెనట!

ఇప్పుడు ఫ్రెండిలున కిచ్చిన గదిలో అనగా పూర్వము తా నుండిన గదిలోని బీరువా గూటియందు తా నొక వార్తాపత్రికల కట్ట నుంచె ననియు తక్కిన సామగ్రిని తీసుకొనిపోవునప్పుడా కట్టను తీసికొనిపోవుట మరచిపోయె ననియు, దాని నెటులైన తెచ్చి తన కీయవలయు ననియు నతడు గోరెనట!

పాప మతని జాతకకాగితములును, ఆంగ్లేయునిగనే భావింపవచ్చు నని సర్కారువా రతని కిచ్చిన సర్టిఫికేటును, ఇంకేవియో నీవిధముగ తన కొక్కనికి మాత్రమె యుపకరించు కాగితములు మరికొన్నియు నా కట్టలో నుండిపోయిననట! వాటి నెటులైన తన కీయవలసినదని యత డనేకవిధముల ప్రాధేయపడి యడిగెనట!

ఆ కట్ట యింతవరకచట నటులనే యుండునని వాని నమ్మకము. ఆబీరువా గూటియొద్ద నొక కుర్చీని గాని, ముక్కాలుపీటను గాని వేసి కొని దాని నెక్కి మీాదికి చూచునెడల నా కట్ట కన్పించునని యతడు చెప్పెనట!

ఆనాడేపనిమీాదనో తలవని తలంపుగ ఫ్రెండిలు బయటి కరిగెను. తలుపు తాళమువేసి యున్నందున ల్యూసీ కాగితములకట్ట తెచ్చుటకు వీలులేకపోయినదట!

"అట్లయిన జోకీయిమున కేమి జవాబుచెప్పితివి?" అని నేనడిగితిని.

"అటులనే తెచ్చియిచ్చెదనని చెప్పితిని. గాని తెచ్చుటకుముందు నీతో యీాసంగతిని చెప్పెదననలేదు."

"వాడింకను వేచియుండునా?"

"లేదు. సాయంత్రమేదియో మిషను పెట్టుకొని నేనాప్రక్కనందు లోని కాకట్టనుపట్టుకొని వచ్చునెడల తానచటికివచ్చి దానిని తీసికొని పోవునట!"

"అట్లయిన నీసొమ్ము నిచ్చివేసినాడా?"

"లేదు లేదు. సాయంత్ర మాకట్ట తనచేతబడునపుడు డబిచ్చునట! ఏమో యిచ్చునో యివ్వడో యెవరెరుగుదురు? ఏదియెట్లున్నను ఫ్రెండిలు లేనపుడతని గదిలోనికరుగుట నాకిష్టములేదు. అయినను నాడబ్బునెట్లైన రాబట్టుకొనవలయునను కోరికగలదు. నేనీముసలి కాలములో దాచుకొనిన దంతయు నంతియె. అదియె నాయవసాన కాలమున కక్కరకురావలసియున్నది. ఎన్నియో యేండ్లనుండియు గూడబెట్టుకొనిన ఆడబ్బునతడపహరించుటవలన మరియొక గవ్వైన గూడబెట్టుటకు నామనస్సంగీకరింపకుండెను. ఏదిఏటులయినను ముందుగా నీతో చెప్పనిది ఏపనిచేయుటకుగాని ఇష్టములేక నిచటికి వచ్చితిని."

"మంచిపనిచేసితివి. అదియె న్యాయము. నీడబ్బులో నొక్కగవ్వైన పోదు. వాడాసొమ్ము నీయకపోయినయెడల నేను తప్పకుండ నిచ్చెదను. కనుక నీవేమియు భయపడకుము."

అని యామె నూరడించి రోజుమేరీని పిలచి యీకథనంతటిని వెంటనే మిాకినుగారికి జెప్పనియోగించితిని. వారావలకు నాలుగడుగులైన నిడిరో లేదో నేనొక్క చెంగున మంచముపైనుండి దుమికి మంచిబట్టలను కట్టుకొంటిని. నాజబ్బంతయు నెచటికరిగెనో నాకు తెలియదు గాని శరీరమందలి నిస్సత్తువంతయుపోయి మంచిబలము వచ్చినట్లుండెను.

ఆకట్టలోనున్న కాగితములగురించి జోకీయిము చెప్పినదంతయు నిజముకావచ్చును. ఈవిదేశీయులు తమ యమూల్య వస్తుసామగ్రిని

గా పాడుకొనుట కిట్టికుయుక్తులనే పన్నుచుందురు. కాని యిన్ని దినములైనపిమ్మట నతడిప్పుడిచటికి వచ్చుటకును ప్రస్తుత పరిస్థితులకు నేమైనసంబంధముండకుండునా యని నాకనుమానముకలిగెను. ల్యూసీ డబ్బునిచ్చివేయుటయెగాక మరికొంతనిచ్చెదననిగూడ వాడామెనేల మంచిచేసుకొన ప్రయత్నింపవలయును? వాడు నిజముగ తనవస్తువులనే మరచిపోయియుండినయెడల బహిరంగముగనే వచ్చి యడుగకుండునా? అడుగసాహసింపలేకవచ్చును. నాటిరాత్రి వాడు నన్ను పెట్టినబాధకేమి ప్రతిక్రియ జరుగునోయని వెరచి యీపన్నాగమును పన్నియుండును. నాకప్పుడొక వంక నాశయు మరియొక వంక భయమును పెరుగజొచ్చినవి. ఏదియెట్లైనను ఆకట్టను తప్పకుండ శోధింపవలయునను మాటనిశ్చయము! నేనీదృఢసంకల్పము చేసికొనినంతనే మరల నాకెచటలేని ధైర్యసాహసములు నావిర్భవించినవి.

పదినిముషములలో నేనుగూడ మీకినుగారున్న గదిలోనికరిగితిని. మీకినుగారికీనూతనోదంతమువలన నెట్టిసంతోషముగాని విచారముగాని గలిగినట్లు గన్పించకుండెను. ఆ మనిషికావంతయైన భావనాశక్తియున్నట్లు నాకు గన్పించకుండెను. న్యాయశాస్త్రాభ్యాసానుసరణినతని కిదివర కలవడిన "పంథా" ననుసరించి యతడేవేవియో ప్రశ్నలనడుగుచు నా ముసలిల్యూసీని వేధించుచుండెను. పాపమా ముదుసలి తానుచెప్పిన కథలో నప్పుడే నేదియో పొరపాటు వచ్చినదనుకొని బెదరిపోయి యవకతవకగ ప్రత్యుత్తరముల నిచ్చుచుండెను.

"నేనుపోయి ఆకట్టను తీసికొనిరానా?" అని రోజుమేరీ యడిగెను.

మీకినుగా రందుల కసమ్మతిని సూచించుచు నెన్నిదినముల నుండియో ధూళిపట్టిపోయిన కాగితములను మలిపి చదువుచుండిరి. నేనట్టి దుర్బలస్థితిలో నచటికరిగి నందుల కతడు గట్టిగ చీవాట్లను పెట్టునా

నారంభించెను. జోకీయిముగాడి కాగితముల కట్టకును మా వ్యవహారము నకును ముఖ్యముగ తనకు నెట్టిసంబంధము లేదని యతడు నిశ్చయపర చుకొనెను.

"రోజుమేరీ ఆలాగుననే తీసికొనిరమ్ము. దానియందే ముందునో చూతు" మని నే నంటిని.

మీకినుగారి కనుబొమ్మలు పైకిలేచినవి. పెదవులను కొరకుచు నతడు నావైపుతిరిగి "ఆ కాగితములను ముట్టుకొనుటకు నీ కేమైన యధి కారమున్నదను కొనుచుంటివా ?" అని యేదియో యుపన్యాసము నారంభించుసరికి పట్టలేనంత కోపమువచ్చి—

"అధికారమా ? ఆ దుర్మార్గుడుచేసిన పనికి వానిని శిక్షించుట కధికారముగూడ కావలయునా ? వారేయధికారముబొంది నన్ను చంపజూచిరి ? ఈ మనిషి ఫ్లోరెన్సు తెచ్చిన వీలులో చేవ్రాలుచేసి యుండినసంగతిని మీరు మరచిపోయిరి కాబోలును ?" అని బిగ్గరగ బలికితిని.

"అయిననేమి ? ఆ వీలు నాక్షేపించుట కెట్టియవకాశమును లేదు. జోకీయిము జన్మనక్షత్ర కాగితము లావీలులోని సంగతుల నెట్లు మార్చగలవు ?" అని యతడు నెమ్మదిగ బలికెను.

కాని అతడీమాటల నాడుచున్నపుడా సులోచనముల లోపల నా తని కన్నులయం దొకవిధమగు అస్వాభావికపు తళుకొకటి నా కన్నుల బడియెను. పురుషస్వభావము ననుసరించి తానీ యకార్యకరణమున కెట్టి బాధ్యతను వహింప నొల్లడనియు, మరియొకరా బాధ్యతవహించు నెడల తనకుగూడ నా కాగితములను జూడవలయునను అభిలాషగల దనియు నాతనిచూపులు నా కపుడర్థములయ్యెను. అంతగా కార్యము తప్పివచ్చునెడల తాను ముందుగనే హెచ్చరించెననియు తనమాట

నిర్లక్ష్యము చేసినందున తగిన పరాభవము గలిగినదనియు తరువాత చెప్పవచ్చునను యుద్దేశ్యమతని యెదలో నపుడు తోచియుండును.

ఇంక నా సంగతియా? నా కట్టిసూక్ష్మతర న్యాయాన్యాయవిచక్షణ మట్టిసమయమం దవసరమని తోచలేదు. మేమపుడు వ్యవహరించుచుండినది న్యాయస్థులగు తగుమనుష్యులతో గాదు. వారియొద్ద నిష్కాపట్య మెంతమాత్రమును పనికిరాదు. జనులు పరపీడన మాచరింపకుండ, సాధువులుగ జీవింపవచ్చునుగాని తగిన ఆయుధములను ధరించియుండవలయును. లేకున్న లోకులందఱు వారి నదలించి వంచించుచుందురు.

అంతేయెగాక నాకు వారిపై ప్రబలముగు క్రోధ ముద్రేకించుచుండెను. రాక్షసునివంటి తనకఠినహస్తమున నాతుచ్ఛుడు నా మూతిని బిగియబట్టి మూర్ఛవచ్చునట్లు బాధించెను. యజమానులయాజ్ఞ ప్రకారమతడట్లు చేసెనని యనుకొన్నను వానిని మాత్రము సులభముగ విడువరాదని మాత్రము నా మనస్సు బోధించుచుండెను.

రోజు మేరి యాకాగితముల కట్టను తెచ్చుటకరిగి యెక్కువకాలము కాకపోయినను నాకుమాత్ర మామె యనవసరముగ జాగుచేయు చున్నట్లు తోచెను.

పాప మెంతసేపటినుండియో నిలచియున్న ల్యూసీ నొకకుర్చీలో గూర్చుండమంటిని. ఒకమూల సగము విరిగియున్న కుర్చీపై నామె కూర్చుండెను. ఆముసలిదాని మనసప్పు డతివిశేషముగ బాధించు చుండిన మహాకఠిన సమస్య యొకటి గలదని నేనప్పు డూహించితిని. తన జీవితకాలమంతటను కష్టపడి కూడబెట్టుకొనిన తనధనము మరల తనకు వచ్చునా రాదా? అదియె యామె నంతవిశేషముగ నపుడు బాధించుచుండెను.

తనప్రాణోద్యోగముల గోల్పోవ సాహసించి నన్నారాత్రి కాపాడిన యాముసలిప్రాణి నుదుట నాడు గనుపించిన దీనభావము నాహృదయమును కలచివైచెను. అప్రయత్నముగ నాకనులవెంబడి రెండు నీటిబిందువులు రాలెను.

ఇంతలో రోజుమేరి కాగితములకట్ట బట్టుకొని వచ్చెను. జోకీయిము చెప్పిన స్థలమందా కట్ట యటులనే యుండెను. అదియంతయు ధూళిధూసరితమై యుండెను. సన్నని దారముతో గట్టియుండెను. అదియైనను గట్టిగ కట్టనందున విప్పుట కెక్కువ ప్రయాసమవసరము లేకపోయెను.

నేనాకట్ట నందుకొని మీకినుగారి కందిచ్చితిని. కట్టనందుకొనక నతడు నాముఖమువంక జూచెను. తాను నటించుచున్న దొకటియు లోన నుద్దేశించినది వేరొకటియునని నేను గుర్తించితినను సంగతి నతడు గ్రహించెను. నాముఖమందలి కోపభావమును గూడ నతడు గుర్తించెను.

"మీ యిష్టమైన తీసికొని విప్పవచ్చును లేకున్న మానివేయ వచ్చును. తరువాత నన్ను మాత్రము దూషింపవలదు. ఏదియెట్లు చేసినను మీరు న్యాయవాదులు. చక్కగ సమర్థించుకొనగలరు." అని పలికి నేనాకట్ట నతని కెదురుగ నుంచితిని.

ఒకటిరెండు లిప్తలతడేదియో నాలోచించుకొనుచు నటులనే యూరకుండి, పిమ్మట దానిలోని కాగితము లెట్టివియో తెలిసికొన వలయునను కౌతూహలమున గానోపు నొకమారు రెండుమూడు కాగితములను మీదికెత్తి చూచెను. పిమ్మట నేమనుకొనియెనో ఆకట్టను దగ్గరకు తీసికొని దారమువిప్పెను.

ఆకట్టలోని దుమ్ము ముక్కురంధ్రములోనికెక్కుటవలన గాబోలు నతడు రెండుతుమ్ములను తుమ్మి కట్టలో నేమి కాగితము లున్నవో చూడవలయునను తమకమున నాతని చెంతనె నిలిచియున్న నన్ను జూచి, నాజబ్బు తనకు ప్రాకుచున్నదని నన్నదలించి యావలికంప జూచెను. అరగంట క్రిందట లేవలేక మంచముపై పడియుంటిననుమాట నప్పటిలో పూర్తిగ మరచియుండుట వలన నూతనాంశము లేమైన గనిపెట్టవలయునను యుద్దేశ్యమున నటులనే నిలచియుంటిని. ఆయన యెంతచెప్పినను కదలలేదు—.

జోకీయిము చెప్పిన జాతకముగాని మరియే కాగితముగాని దానిలో గన్పించలేదు. గాని ఫ్లోరెన్సు డ్యూకును, మరికొంతమందినిగూడ వెంటనే కారాగారమున కంపగల కాగితములు కొన్ని దానియందు న్నట్లు నాకనుమానముగలిగెను. మీకినుగారి కట్టిసందేహము కలుగుటకు ముందుగ నేనే నాసంశయము నిజమని గ్రహించితిని.

"నాన్నగారారుమాసములకు మరణించెదరనగా వ్రాసిరని చెప్పిన వీలేయిది. ఈవీలు వ్రాయుటకే ఫ్రెండిలు మూడునాలుగు వీలుకాగిత

ములను కొనితెచ్చెను." అని నేనతడు చదువుచుండిన కాగితము చూచి పలికితిని.

"లారెన్సుసతి జూపించినదస్తావేజు దీనినకలుగ గన్పించుచున్నది." అని మీాకినుగారనిరి.

"అవును. ఒక్క తేదీతప్ప తక్కినదంతయు నచ్చుగ్రుద్దినట్లు దీని నకలే యనుటకు సందేహములేదు." అని పలుకుచు నతని భుజము నొక చేతితో నానుకొని వేరొక చేతివ్రేలితో నాకాగితమందలి తేదీని చూపించితిని. ఆతుడుపులు, ఆహంసపాదులు, ఆవంకరలు, ఆకామాలు చుక్కలు అన్నియు దాని ప్రతియె. దీనిపై ప్రేసింగుకాగితముపెట్టియో మరి యేకృత్రిమముచేసియో వారావీలును సృష్టించియుందురు. అదిగో ఆ తేదీ యున్నచోట నేవియో కనుపడియు కనుపడని మచ్చలున్నవి! కనుపించలేదా? చూడండి. ఇక్కడ చూడండి మీాకినుగారూ? వాడో మరియెవరో నాన్నగారి ప్రాతవీలు కాపీతీసి తేదీనిమాత్రము మార్చిరి. అనగా "ఫోర్జరీ" చేసిరనుమాట! ఒక్కయంకె మార్పునొందుటవలన నిది ఫోర్జరీయని మనము గ్రహింపలేకపోయితిమి."

నామాటలు నిజమని మీాకినుగారు తిరిగి చెప్పనవసరములేదుగాని అతడేమియు బలుకక నూరకుండుట మాత్రము నాకు చాల భయము గలిగించెను. అందువలననే నూరకుండజాలక—

"తుచ్ఛులెవరు చేసిరోగాని చాలనేర్పుగ జేసిరి సుమండీ" అని నేను మరల బలికితిని.

"ఇంత కుచ్ఛితపు తంత్రము నింతవరకు నేనెచ్చటను చూడలేదు" అని మీాకినుగారనిరి.

మా మాటల కర్థము నూహింపజాలక రోజుమేరీ క్రొత్తవిపత్తిం కేమి వచ్చినదో యని శంకించి—

"అనగా ఎవరిపై నా తంత్రము?" అని యడిగెను.

"మరి యేతంత్రము లేదు. వారి యంత్రము లేమియు మరి సాగవు."

"అనగా యిప్పుడు లోర్నా సంగతి యేమైనది ?"

"ఆమె తండ్రి యాస్తి యామెకే స్థిరపడినది."

జలుబుపడిశెములు పట్టుకొనునేమో యను భయము లేని దగుట వలన రోజుమేరి నన్నమాంతముగ కౌగలించుకొనియెను. మీకినుగారి యుత్సాహము జూడ నతడు గూడ నట్లే చేయునని నాకు తోచెను. కాని యేండ్లు గడపినవా డగుటవలన ఔచిత్యము నాలోచించి మరల నూరకుండెను.

ఇంతలో నామూల నటులనే కూర్చుండియున్న ల్యూసీ నాకంట బడియెను.

"ల్యూసీ నీకు తప్పకుండ మంచి బహుమాన మిచ్చెదను. నీవు కోరిన దెల్ల యిచ్చెదను. నీవు జీవించియుండునంతకాలము నిన్నింకొక పనినైన ముట్టనీయను. నీవలన నాడు ప్రాణము దక్కినది. నేడు ఆస్తి దక్కినది. నీ వింకేపనియు చేయ నవసరము లేదు."

ఆమాట విని ల్యూసీ బిగ్గరగ నేడువసాగెను. ఆ యేడ్పు చూచి నేను వెఱగొందితిని. ఎన్ని ప్రశ్నల నడిగినను నామె బదులు పలుకక మరింత బిగ్గరగ నేడువసాగెను. చివరకు విశ్వప్రయత్నముపై నేల యేడ్చుచున్నావని యడుగగా, తన కా యిల్లు తప్ప వేరొక యిల్లేదియు లేదనియు, దానిని విడచుటకంటె మరణించుటయే మేలనియు తా నిటుపై నచట పనిచేయకున్న మరి యెచట పనిచేసి జీవింపదగునో తెలియకున్నదనియు నామె వెక్కి వెక్కి యేడువసాగెను. ఎచటికి పో నవసరము లేదనియు, పని చేయకుండగనే యామెను పోషించెద ననియు నెంతో బోధించి చెప్పినను ఆమెకు బోధపడకుండెను.

చివర కామె జీతమును కొలదిగ హెచ్చించి యెప్పటివని నెప్పటి యట్లు చేయనిచ్చెదనని యొప్పుకొనువరకామె యూరడిలకుండెను. రిత్తగనే యామె జీతము నేల హెచ్చింపవలయునని తక్కిన పనివారికి యీర్ష్య గలిగెను. పోనీ నాకరు లందరికి పెద్దగా జేసెద ననినను, చెలికత్తెగ చేసికొనెద మనుకొనినను పాప మామె కాపాటి తెలివి తేటలు భగవంతు డీయకుండెను.

ఇప్పు డింకొక నూతనావస్థ సంభవించెను. నాకప్పటికే ఆయాసము గలుగుటవలన తక్కిన కార్యక్రమ వివరముల నన్నిటిని మీకినుగారి కిష్టము లేకపోయినను వొప్పగించి పరుండవలసి వచ్చెను.

అయినను నొక సందేహము నన్నింకను విడచిపెట్టకుండెను.

ఇంత గుండెలుతీసిన పనిచేసిన, అపారప్రజ్ఞగల ఆ జోకీయిము తన దోషనిర్దేశమునకు ప్రబలనిదర్శనముగ పరిణమింపగల యీ నకలు కాగితమును చింపి యావలపారవేయక తనకాగితములలో నేల దాచి యుంచెనో యని యాశ్చర్యపడజొచ్చితిని. ఎంత యాలోచించినను తగిన సమాధానము కన్పించనందున మీాకినుగారి నడిగితిని. "ఆమాత్రపు టాధారము లేకపోయిన యెడల వారి యెత్తుగడ యంతయు పూర్తిగ సఫలీకృతమగుటకు సందేహములేదు. వీడీ పనిచేసినందులకు ఫ్లోరెన్సును తల్లియు వీనికెంత ధనమునైననిచ్చి యుందురు. వారు విజయమొందిన పిమ్మట తరచుగవారిని బెదరించి డబ్బుగైకొనుటకిది యుపయోగించునను యుద్దేశమున వాడీకాగితమునింత భద్రముగ డాచియుండవచ్చును" అని మీాకినుగారు చెప్పిరి. అప్పుడది నిజమేనని నేననుకొంటిని.

ప్రస్తుతకర్తవ్యమును గూర్చి మే మేదియు నిశ్చయింపజాలకుంటిమి. ఈ మోసపుటెత్తు గడను వెంటనే యపరాధ పరిశోధక వర్గమువారికి తెలుపవలయునని మీాకినుగారి పట్టుదల. వలదనినేను. చివరకాతడు చెప్పినదానికి నే నంగీకరింపవలసివచ్చినది. పోలీసువారితో కావలయు నంత వ్యవహారము పెరిగినది. వారిపేరెత్తిన నాకాపాదమస్తకము కంపమెత్తును. ఇంకవారిని జూచునపుడెట్లుండునో యూహింపవలయునే గాని వ్రాయశక్యముగాదు. ఆ భయమువలన పోలీసువారి జోక్యము వలదని నే నెంతచెప్పినను మీాకినుగారు వినరైరి. చివరకు వారిప్రమేయము గలిగించుకొనక తీరినదికాదు. జోకీయిము ఫ్లోరెన్సులవంటి దుర్మార్గులను చేజిక్కినప్పుడు విడువరాదనియు అట్లు విడచునెడల

మనము రాష్ట్రప్రజలకు ద్రోహమొనరించిన వారమగుదుమనియు మీాకినుగారనిరి. వారు మోసగించుటయె వృత్తిగ పెట్టుకొని ప్రజలనతి విశేషముగ బాధించుచుందురని యతని యభిప్రాయము. అదినిజమె. నేను కాదనను. కాని ఫ్లోరెన్సును జైలులో పెట్టునెడల సిగ్గువలన నా శరీరమంతయు చివికిపోవునని నాకు తోచుచుండెను. లారెన్సును పెండ్లియాడుటయెగాక డ్యూకుసతియను పేరున నామె వ్యవహరించు చున్నది. అది నాపుట్టింటిపేరు. నా తండ్రితాతలా పేరున కపరిమిత మగుకీర్తి ప్రతిష్ఠల నొనగూర్చిరి. ఈ యపకీర్తి వలన నవి యన్నియు మట్టిగొట్టుకొని పోవును.

కుటుంబగౌరవప్రతిష్ఠల విషయమున నేను పూర్తిగ పూర్వాచార పరాయణురాలనని యొప్పుకొనియెదను. నాకావిషయమందొక పిచ్చి నమ్మకము గలదు. ఎన్నితరములనుండియో యశేషశ్రీముషితో మెలంగుచున్న మాకులప్రతిష్ఠలను చెడగొట్టుకొనుటకు అనాలోచిత ముగ లారెన్సు విశ్వప్రయత్న మొనరించెను. చాలవరకు సఫలత నొందెను. దానినింకను పెరుగనీయరాదు. ఇంతియగాక మాచిన్ని మార్టినునకు డ్యూకుభేజని పేరుపెట్ట నిశ్చయించుకొంటిని. అందువలన డ్యూకుల ప్రతిష్ఠ కెట్టిలోపమును రానీయకూడదని నాయభీష్టము.

తరతరములనాటి యాకంపెనీ యెంతకాల మీావిశ్వమందు సుస్థిరమై యుండునో యంతకాలమును గూడ డ్యూకుల పేరుప్రతిష్టలు నిష్క ళంకముగ నుండవలయుననియు, నాచిన్నిమార్టిను యశము దానిని మరింతవిశేషముగ వ్యాపింపజేయవలయు ననియు నేను కోరుచుంటిని. ఈసంగతులన్నియు మీాకినుగారికి చెప్పి ఫ్లోరెన్సును కారాగారమున కంపు ప్రయత్నముల మానుడని మీాకినుగారిని బ్రతిమాలుకొంటిని.

నే నాడుదాననని యు, అందువలన కేవలభావనావీచికలకు కలంగి లేనిపోని యట్టహాసములను చేయుచుంటిననియు, ఇపుడు ఫ్లోరెన్సుపై

తగినచర్య చేయనియెడల నేను కృత్రిమోద్దేశమున నట్లు చేసినట్లు పోలీసువారు భావింతురనియు, అందువలన లేనిపోని ప్రమాదములు గలుగుననియు మీాకినుగారు వాదింపసాగిరి. చివరకు ఫ్లోరెన్సును తప్ప కుండ శిక్షింపవలయునని నిశ్చితమాయెను.

మావాద ప్రతివాదములు ముగియునప్పటికి అపచారపరిశోధ కోద్యోగి వచ్చెను. మీాకినుగారును అతడును గలసి యేవేవియో యేర్పాటుల నొనరించుకొనిరి. నాటి సాయంకాలము జోకీయిమును పట్టుకొనులోపల సాక్ష్యమునిమిత్తమై చేయు సర్వసన్నాహములు పూర్తికావలయునని వారి సంకల్పము.

జోకీయిము కాగితముల కట్టను మరల నెప్పటియట్ల గట్టి యథా స్థానము నందుంచితిమి. ఆ కట్టలో నీ దస్తావేజుండగా చూసినట్లు ఆరు గురు మనుష్యులయొద్ద ప్రమాణపత్రికలను తీసికొనుటయు వీలునకు చాయాపటములు తీసికొనిన పిమ్మట నా కట్ట యప్పటిస్థలమున కరి గెను. మాయింటి సమీాపమందున్న ఛాయాపటముల దీయువాని నొకని దెప్పించి, ఆ కట్టకొకటియు, ఆ వీలున కొకటియు ఛాయాపట ముల నతడు దీయించెను.

“గడియకే గండమో యెవరు చెప్పగలరు ? అందువలన మన మెల్ల ప్పుడు జాగరూకులమై యుండవలయు”నని మీాకినుగారు పలుకుచుం డిరి. జోకీయిము ఆ కాగితములకట్టను పట్టుకొనియుండగా వానిని పోలీ సువారి కొప్పగించవలయునని యతని యుద్దేశ్యము. ఒకవేళ వాడీసం గతి నెరిగి యీా కాగితములను చింపివేయునేమో ! అప్పుడు సాక్ష్యము లేక చిక్కుపడవలసి వచ్చునని అతడీఛాయాపటము లన్నిటిని దీయిం చెను.

సాయంకాల మేడుగంటలపుడు ల్యూసీయాకాగితముల కట్టను రహ స్యముగ దీసికొనిపోయి జోకీయిము కీయవలయుననియు ఆ సమయ

మున నందరును పొంచియుండి సమయము కనిపెట్టి జోకీయిమును పట్టు కొనవలయుననియు ఏర్పాటు. ఎంతయో ప్రయత్నముమీద ల్యూసీ యట్లు చేయనంగీకరించెను.

ఈ పోలీసువారు, యీ సందడి, యీరహస్యపుటాలోచనలుచూచి యామె యేమియు బోధపడక బెదరిపోయెను. ఎంతడబ్బు నిచ్చెద మనినను ఏమిచేసెదమనినను గూడ ఆమె యాపనిచేయుటకు సమ్మతిం పకుండెను. తానా కట్టను తీసుకొనివెళ్లవలసిన గడియలో నురిపెట్టు కొని ప్రాణత్యాగము చేసుకొనుట మేలుగ నుండునని యామె యను కొనుచుండెను.

అట్టి విపరీతము జరుగకుండుటకై రోజుమేరీ ఆమెకెన్నియొ కథలను చెప్పి తానతివిశేషముగ ప్రేమించుచుండిన యజమానురాలి కామా త్రమైన సహాయము చేయకున్న తనువే నిరర్థకమనియు, జోకీయిము యీయవలసిన బాకీ నంతటి నామె యిచ్చివేయుననియు బోధించి హితవు చెప్పుచుండెను.

ఆ రోజున నాకు శరీరము దుర్బలముగ నుండెనని యిదివరకె చెప్పి నట్లున్నది. కాని జోకీయిము కాగితములకట్టను పరీక్షించుసందడిలో నా జబ్బు యెచటికో పారిపోయెను. ల్యూసీచేయవలయు మహాసహాయ సమయమా సన్నమగుచుండెను. నా శరీరమున బడలిక విశేషముగ నుండెను. అయినను నేను తాలిమిపట్టలేకుంటిని. ఫ్లోరెన్సు చావు బ్రతు కులు నా చేతిలోనున్నట్లు నా కపుడుతోచెను. అందువలన నా మన సెంతయో కలవరమొందుచుండెను. మీకినుగారి కెంతచెప్పినను నా హృదయతాపమతడు గుర్తింపకుండెను. అందువలన నాడు ఫ్లోరెన్సు నకు నేనొనరించిన సహాయమిప్పటివరకు గూడ మీకినుగారికి తెలియ కుండ గప్పిపుచ్చితిని.

ఈ పోలీసు వ్యాపారము నాకు చాల అలజడిని గలిగించుచున్న దనియు అందువలననే నెచటికైన బయటికరిగి యొకగంటలో వచ్చెద ననియు రోజుమేరీకి చెప్పితిని. ఫిన్లేసతిని చాలకాలము నుండియు చూడ లేదుగనుక నామె యింటికొకమారు పోయివచ్చెద నంటిని. రోజుమేరీ నన్ను వారింపజూచెను గాని నాకు నేనే యజమానినగుటవలన నన్నాపజాలకపోయెను.

బయటి కరుగుటకు వలయు బట్టలను ధరించినపిమ్మట నింటియం దెచ్చటెచట నేమేమిడబ్బున్నదో దాని నంతటి నా చేతిసంచిలోనికి చేరవేసితిని. మొత్తముపై నంతయు నిరువది సవరనులయ్యెను. వెం టనే గుర్రపుబండీ నొకదాని మాట్లాడుకొని ఫ్లోరెన్సు క్రొత్తగా నాక్ర మించుకొనిన హోటేలున కరిగితిని.

రాత్రి భోజనమున కందరు నెదురు చూచుచుండు సమయమున నే నచటి కరిగితిని. ఆ యిల్లు చాలమనోహరముగ గన్పించుటయెగాక నచటి మనుష్యులందరును హాస్యము లాడుకొనుచు వినోదముగ కాల క్షేపము చేయుచుండిరి.

అచట నిలచియుండిన యువతి యొకర్తె లేనిపోని ఆలస్యముచేయక వెంటనే నాకు ఫ్లోరెన్సు గదినిజూపించెను.

ఫ్లోరెన్సు ఆ గదిలో పెద్దకొలువు చేయుచున్నంత అట్టహాసము చేయుచుండెను. బాగుగ మెలికలు తిరిగిన మీసకట్టులతో నొక యిటలీ యువకుడామె చెంతనే కూర్చుండి యా సభ కలంకార మొనగూర్చు చుండెను. ఆ ప్రక్కనే మధ్యవయసు దాటిన యబలయొకర్తె పెద్ద టోపీయును, వదులుగా నుండిన యొక గౌను ధరించుకొని కూర్చుం డెను. సుందరముగ గన్పించుచుండిన బాలికయొకర్తె అప్పుడే యేదియొ పనిచేసుకొని వచ్చి యచట నిలచుండెను. మరియొకస్త్రీ కొంచెము

దూరముగ గూర్చుండియుండెను. ఆమెను మనిషియని చెప్పుటకంటె అస్థిపంజరమని చెప్పుట ఎక్కువసమంజసముగ నుండును.

* * * *

ఫ్లోరెన్సు సిగరెట్టు కాల్చుచుండెను. సాయంకాలము లందతిసంతోషకరముగ నుండుసమయములందాపె ధరించు ఆకుపచ్చని పట్టువస్త్రముల గట్టి యామెచేతులను ద్రిప్పుకొనుచు, నవ్వుచు నేమేమియో మాట్లాడుచుండెను. ఇంతవేగ మీామె తన వైధవ్యస్థితి నెట్లు మరవ గలిగినదని నే నాశ్చర్యపడుచుంటిని. ఆ నాటిరాత్రి లారెన్సు శస్త్రఘాతమున సమసి యేదియో కొన వెండ్రుక నూపిరియుండి విధివశమున జీవించిన స్త్రీయేనా యిప్పుడిచట నీ రీతి మాట్లాడుచున్నదని నే నక్కజపడి చూచుచుంటిని.

సాధారణముగ నట్టిసమయములందు తలవని తలంపుగ లోనికరుగుట యుచితముగ నుండదుగావున నేను గుమ్మములో నిలచుంటిని. తన వ్యవహారములన్నిటి నామె ఈ సభికులకు చెప్పుచుండెను. ఆ యిటలీ దేశీయుడామాటల ఃతియాదరముతో వినుచున్నట్లుండెను. తానింతలోనే మహదైశ్వర్యసంపన్నురాలు కాగలదనియు, తనమేడ నప్పుడింతకంటె నూరురెట్లెక్కువ మనోహరముగ నలంకరింపవచ్చుననియు, నామె చేతులను కండ్లను త్రిప్పుకొనుచు చెప్పుచుండగా నతడు తన్మయత నొంది యామె దెసనట్లే జూచుచు నితరవిశ్వమంతటిని మరచి యుండెను.

ప్రక్క నిలచున్న కుఱ్ఱది యావలించుచు "మీ కథయంతయు నొక నవలవలె నున్నదండి డ్యూకుగారూ ? ఎంత వినినను వినవలయుననియె యున్నది గాని యిప్పుడు గంటఅయినది. ఇంక తడవు చేయునెడల పదార్థములన్నియు చల్లారిపోవును." అని పలికెను.

"మీ రామమహాదైశ్వర్యమనుభవించు రోజులలో మీపూర్వమిత్రులను మరువరనుకొనియెదను." అని పెద్దటోపీ ముసలిది పలికెను. "అయ్యో చెప్పమరచితిని. నేనత్యంతవిభవమనుభవించుచుండిన రోజులలో అనగ సర్వస్వమునకధిపతినిగనుండిన రోజులలో నాయొద్ద కొందరెందరో స్త్రీలు పురుషులు వచ్చుచు బోవుచునుండెడివారు. వారి నందరిని నాకుతోచినరీతి ననుదినము సంతోష పెట్టుచుండెడిదానను. అంతియెగాని నేనెవరిని మరచెడిదాననుకాను. ఒకనాడు కాలీసులో నాభర్త పందెమువేసి అశ్వారోహణముచేసి గుఱ్ఱమును పరుగెత్తించుచుండిన సమయములో "మీరు నమ్మెదరో నమ్మరోగాని అప్పుడు" అని యేమేమియో చెప్పుచు నొకసారి వెనుకతిరిగిచూచెను. అంతట నేనామెకంటబడితిని.

ఫ్లోరెన్సు తనసంభాషణ నంతటితో కట్టిపెట్టెను. అత్యంతోత్సాహ సమయమున ననవసరముగ సంతరాయము కలిగెనుగదాయని పాపమాముదుసలి విశేషముగ విచారింపసాగెను.

ఆమె నన్నుచూడగనే నాకాపాదమస్తకము కంపముపుట్టెను. నేను మాట్లాడనారంభించునప్పటికి కుతూక బొంగురుపోయి నోటమాట రాకుండెను. చివరకెట్లనో కుతుక స్వాధీనముచేసుకొని "నీతో రెండు నిముషములొక రహస్యాంగమును మాట్లాడవలసియున్నది. వచ్చెదవా ?" అని యడిగితిని.

ఏమి మునిగినదో యని లోపల సందేహించుచున్నను గర్వాతిరేకమున నామె నన్నాపాదమస్తకము తిలకించుచు "ఎందులకో కొంచెము సెలవీయవచ్చునా ?" అని యడిగెను.

గదిలోని వారందరు మా యిరువురి సంభాషణ నతియాశ్చర్యముతో వినజొచ్చిరి.

"మనమిప్పుడు మాట్లాడవలసిన రహస్యము లేమున్నవి ? నాతో రాజీచేసుకొనుట కిప్పుడు సమయము తప్పిపోయినది. ఇక నేమి పరిష్కారము కావలసియున్నను కోర్టులో న్యాయవాదులద్వారా పరిష్కృతము కావలయు."

ఫ్లోరెన్సు యీ రీతినిట్లు పలుకుట వినినంతనె యా యిటలీ దేశీయుని కనుకొనకులందొక విధమగు మెఱపు మెరసినట్లయ్యెను. ఆ పెద్ద టోపీముదుసలియామె సొత్తేదియో నేనపహరించి నటులతి రోషముతో నా దెసజూడ నారంభించెను. వ్యాకుసతిని వంచించి యామె నింతకటిక పేదరికము నందుంచిన యామె మరదలిని నేనేయని యా ముదుసలి తనప్రక్కనున్న శల్యపంజరపు మనిషితో చెప్పుచుండెను.

ఈ తుచ్ఛసంభాషణల కెంతమాత్రము పాటింపక "ఫ్లోరెన్సూ ! నీతో నేనిప్పుడవసరముగ మాట్లాడవలసిన పనియున్నది. ఇప్పుడెవరను కొనని కొన్ని విశేషాంశములు తెలసిపోయినవి. ఇంతమందిలో మన మాసంగతిని మాట్లాడ కూడదు." అని పలికితిని.

అంత నామె తన సంశయము నిజమైయుండునని వెఱచి వెంటనే నాతో బయలుదేరి రెండు అంతస్థులు దాటెన పిమ్మట నొకగదిలోనికి తీసికొనిపోయినది. ఆగది చిన్నదికాదు. విద్యుద్దీపములును, విద్యుద్వ్యంతములును గలిగి యాగది విశాలముగ నుండెను. కాని దానిలోని వస్తువులన్నియు కలగూరగంపవలె ప్రోవులు ప్రోవులుగ పడియుండెను. వస్తువుల నసందర్భముగ నెరజిమ్ముటయం దామె కమానుష ప్రజ్ఞ యున్నట్లున్నది. ఆపరుపుమీద నప్పుడే యెవరో పండుకొని లేచి నట్లుండెను. ఆపరుపుమీది దుప్పటియు తలదిండులును, నూనెమెతగ బట్టినట్లుండెను. బట్ట లచ్చటచ్చట బడియుండెను. అలంకరణ మొనరించుకొను మేజాబల్లమీద ప్రపంచములో సర్వసామాన్యముగ గన్పించు వస్తువులన్నియు చిందరవందరగ పడియుండెను. సిరాబుడ్డి,

కలము, కాగితములు, వార్తాపత్రికలు, నవలలు, పౌడరుడబ్బీలు, రంగు డబ్బీలు, తాళముచెవులు, పూలగుత్తులు యింకేమేమియో పడి యుండెను.

"మంచిది. నీవు చెప్పవలసిన దేమిటో యిక చెప్పవచ్చును."

ఆమె నప్పుడు చూచినంతనె నాకపరిమితమగు జాలి కలిగినదని చెప్పిన జాలును. అంతకంటె నధిక మవసరములే దప్పటి పరిస్థితుల నూహించుకొనుటకు.

"ఫ్లోరెన్సా ! నీతంత్రమంతయు తెలసిపోయినది." ఆరంభముననె నేనెట్లీ యసందర్భపు మాటనంటినో నాకే తెలియకుండెను.

*　　*　　*　　*

కాని ఫ్లోరెన్సున కామాటల భావము పూర్తిగ తెలసిపోయినది. నిట్టనిలువున నామె కొయ్యగట్టిపోయెను.

"జోకీయిము నీసరికి పోలీసువారు జైలులో పెట్టియుందురు. ఇంక రెండుమూడు గంటలలో నీమీదను, ఫ్రాస్టుమీదను "వారంట్లు" పట్టుకొని పోలీసువారు వచ్చెదరు. వారు వచ్చులోపల మనము బయలుదేర వలయును." అని నే నన్నియంశము లామెకు బోధపడునట్లు చెప్పితిని.

"నాతల్లి యిచట లేదు. జర్మనీవెళ్లినది. అచట నామె జోకీయిము బట్జిని కలుసుకొనును. ఈ వ్యవహారమంతయు పూర్తియైన పిమ్మట వారుభయులు పెండ్లిచేసికొనియెదరు. వారి యుద్దేశములు నాకు సరి పడనందున వారితో కలహించితిని." అని మనసునందెట్టి యారాటము లేనటు లామె నటియింపసాగెను. కాని యామెగుండె లతి తీవ్రముగ కొట్టుకొనుచుండిన సంగతిని నేను గ్రహింపగలిగితిని. కొంతసేపూరకుండి పిమ్మట నామె "లోర్నా ! నీవు నిజముగ నామేలెంచి నేను తప్పించు కొనునట్లు హెచ్చరించుటకే వచ్చితివా ? లేక—" అని సందేహముతో నాదెస జూచెను.

"లేకలేదు కాకలేదు. నిశ్చయముగ నీ మేలు గోరి నిన్ను రక్షించుటకే వచ్చితిని. వెంటనే నీ వీ తొమ్మిదిగంటల ప్యారిస్ ఎక్స్‌ప్రెస్ బండి కరుగవలయును. వేళకు నీయొద్ద డబ్బుండునో వుండదో యని టిక్కట్టున కగు డబ్బు గూడ తెచ్చితిని. ఇప్పుడు ని న్నాబండి నెక్కించినగాని నాకు శాంతి గలుగదు. నీవు విదేశమునం దుండునంతకాల మేదియో కొంత భృతి నిచ్చెదను. ఈ యేర్పాటు లన్నియు మన యిద్దరికి తప్ప వే రెవ్వరికిని తెలియకూడదు. నీ వెచట నుండునదియు నెలనెలకు నాపేర నొక జాబును వ్రాయుచుండుము. అప్పుడు నీపేర నొక "చెక్కు"ను పంపుచుందును. నీకంటె నేనే ముందుగ మరణింపవలసి వచ్చునెడల నీవు జీవించి యున్నంతకాల మా డబ్బు నటులనే పంపునట్లు తగిన యేర్పాటు చేసెదను లెమ్ము."

ఆమె యీ మాట లన్నిటిని నమ్మినని నేను చెప్పుచుంటినే గాని చివర కామె నమ్మినట్లు తెలిసిపోయినది.

"నీ వెందుకు నాకీ యుపకారము చేయ నెంచెదవు?" అని యామె యనుమానించుచు నడిగెను.

"ఎందు కమ్మా ఎందుకు?—" అని మీాకినుగా రడిగినట్లే యున్న దీ ప్రశ్నయును.

"ఎందు కేమిటి? నా యన్న లారెన్సు డ్యూకును పెండ్లియాడితివి గనుక! అంతకంటె వేరే కారణము చెప్పలేను. నీ కీ యాపద వచ్చిన దాతనివలననే యని నా యుద్దేశ్యము. ఆ స్థితికి మించిన వేషము వేసి యిల్లు గుల్లచేసికొను యీ వైభవేచ్ఛ నీకు గలిగించిన దతడే! ఆ తగులములలో బడి న్యాయాన్యాయ విచక్షణలేక నీ వీ యకార్యకరణములకు బూనుకొనుచుంటివి."

“పాప మత డేమియు చేయలేదు. చచ్చి స్వర్గలోకమునం దున్నాడతని నేల ననవలయును? ఈ పన్నుగడల నన్నిటిని పన్నినది మాతల్లి. ఫెర్నుద్వీపము సంగతి యాతని తల కెక్కించిన దామెయె. నేను భాగ్యవంతుని భార్యను కావలెనని సంకల్పించి యామె యీ కుట్ర నంతటిని కల్పించినది. అమ్మో! మా తల్లి సంగతియా? ఎవరికిని గూడ తెలియ శక్యముకాదు. ఆమె సామాన్యురాలు కాదు.”

ఫ్రాస్టు చాల దుర్మార్గురాలని నేను గూడ నెరుగుదును. కాని యామె యెంత క్రూరాత్మురా లైనను ఆమె కడుపున బుట్టిన కుమార్తెయె యామె నిట్లు దూషించుట కేవల మనుచితమని నాకు తోచినది. అనుచితమను మాట యేమి? అది లోకవిరుద్ధమని గూడ చెప్పవచ్చును.

ఆ సమయమునసె నే నామెతో మరికొంత కాలము ప్రస్తావించి ఫెర్ను ద్వీప చరిత్ర మంతటిని దాని స్వాధీనము చేసికొనుటకై యామె తల్లి పన్నిన పన్నుగడలను అడిగి తెలసికొనవలసి యుండెను. ఫ్లోరెన్సు నా సరళస్వభావమును గాంచి తన నిర్దోషిత్వమును స్థాపించుకొనుట కదియె మెదనని యేమేమియో చెప్పుచుండెను.

కాని నాపై తన కెంతయో యభిమాన ముండినటు లామె నటిం చుట కారంభింపగా నా కసహ్యాకరముగ దోచెను. కాలము ననుసరించి మనుష్యుల పరిస్థితులు మారుచుండవచ్చును గాని వారి యభిప్రాయ ములును ప్రవర్తనములును అంతగ మారజాలవు. ఆమె కాదు మరి యెవరు వచ్చి చెప్పినను గూడ నా కామెపై నదివరకు గలిగిన యభి ప్రాయ మిప్పు డించుకయు మారకుండెను. ఆవెంటనే నెల కెంత పంపిం చెదవని యామె యడిగిన ప్రశ్నను బట్టి నా కదివరకుండిన యభిప్రా యము మరింత బలపడియెను.

నేను పంప నెంచిన సొ మ్మెంతయని చెప్పగనె యామె యొక వింత నగవు నవ్వెను. ఆ నవ్వునం దాశాభంగము, కొంత సంతృప్తియు గూడ గన్పించినది. కొంతకాల మూరకుండి "సరియె యేదియో విధముగ దానితో కాలక్షేపము చేసికొనియెదను లెమ్ము." అని యామె సణిగి కొనెను.

"ఏదియొవిధముగనేమి? బాగుగనె కాలక్షేపము చేయవచ్చును. సంవత్సరమునకు వేయినవరనులనిన నొకకుటుంబమునకు కుటుంబము హాయిగ బ్రదుకవచ్చును. అందులో యూరపునందన్నియు నింతకంటె కారుచౌక. కాని మనచెంతచేరు స్నేహబృందము మాత్రము మంచిది

కావలయును. లేకున్న నెన్ని వేళ్లైనను చాలవు. ఇక రైలునకు వేళ యైనది."

భోజనములకు గంటకొట్టి చాలసేపైనది గనుక వెంటనే భోజనము చేసి రావలయునని యామెను తొందరపెట్టితిని. ఆమె భోజనముచేయ నిష్టపడకుండెను. భోజనము చేయకుండునెడల చాల చిక్కుపడవలసి వచ్చుననియు దూరదేశ ప్రయాణమగుటవలన నామాట వినుట మంచి దనియు నేను చెప్పగా చివరకామె సమ్మతించెను. చాలకాలము నుండియు నామెరాక కెదురుచూచుచుండిన ఆమిత్రులందరి కామె యేమిసమాధానము చెప్పునోయని నేనాశ్చర్య పడుచుంటిని.

ఆగదిలో రెండు ట్రంకుపెట్టెలుండెను. గదిలోని వస్తువులన్నియు నా రెండు పెట్టెలలో నిముడవలయును. చాల కష్టమయినపనియె! అయినను ప్రయత్నించి చూతము అని ప్రయత్నించితిని. నేననుకొని నంతకంటె నెక్కువసామగ్రి నెటులనో పట్టించితిని. ఫ్లోరెన్సు గూడ నచట నుండునెడల ఆపని అంతత్వరలో కాకపోవును. ఇద్దరు మనుష్యులు కలసి చేయునెడల నెక్కువపని జరుగునని కొందరందురు. కాని నాకా మాటనచ్చదు. సామాన్యముగ నేనొకర్తె నుండునపు డెక్కువపనిని తక్కువకాలములో చేసికొనుచుందును. మరియొకరుండునెడల నెక్కువ కాలముపట్టును. ప్యాకెట్టులు కట్టుట మొదలుగాగల పనులలో గూడ నాకింకొక రుండినయెడల పని సరిపడదు.

ఫ్లోరెన్సు భోజనముచేసి వచ్చుసరికి రెండువంతులపని ముగిసినది. ఆమెదుస్తులను సడలించుకొని కట్టుకొనులోపల ఉన్నపనిగూడ పూర్తి యయ్యెను.

"హొటేలు వారితో లెక్కలను పరిష్కారము చేసుకొని వారి కీయవలయు డబ్బిచ్చివేసితి" నని యామె కొంతగర్వముగ పలుకుచు ముఖమునకు పౌడరు రాసుకొనుచుండెను.

"ఇంతలోనే పనిముగిసి బండిని తీసికొనివచ్చును. నీపనియింకను ముగియలేదాయేమి ?"

* * * *

"చాలవరకు పూర్తియైన" దనుచు నామె యప్పుడే విప్పిన ఆకు పచ్చని గౌనుదులిపి పెట్టెలోపెట్టితిని. కాని ఆమెకున్నంత ధైర్యము నాకులేకుండెను. మిాకినుగారు వెనువెంటనుండి యూవలిపనినంతటి నతి త్వరితగతిని నడపించుచున్నారు, అతని ప్రేరణమున పోలీసువారేక్షణ మున వారంటు తెచ్చి యూమెను పట్టుకొందురోయని నాకుభయముగ నుండెను. నేరస్థురాలిని తప్పింప బ్రయత్నించువారు గూడ నేరస్థులగు దురని నేనెరుగుదును, అందువలన నేనచటనుండగా పోలీసువారచటికి వచ్చునెడల ఫ్లోరెన్సు ఒక్కర్తెయెగాక నేనుగూడ కారాగార ప్రవేశ మొనరింపవలసివచ్చును. అందువలన నాయూవేదనమరింత యధిక మయ్యెను. న్యాయశాస్త్రపద్ధతులతో చాల కాలమునుండియు నెడ తెగని పరిశ్రమ చేయవలసివచ్చుటవలన చాలవరకవి నాకు పట్టుపడినవి.

అచ్చట మగకూలీలెవరును దొరకనందున ఆడువారి నిద్దరిని మాట్లాడి ఆపెట్టెలు రెంటిని క్రిందికి దింపించితిని. ఆలోపల ఫ్లోరెన్సు రగ్గును, గొడుగును చేతిసంచీని చేరదీసి క్రిందికిదిగితిని.

ఆమె నల్లనిదుస్తులను ధరించెను. ముఖమునకు నల్లని ఆచ్ఛాదనము వేసికొనియెను. ఆముఖాచ్ఛాదనమువలన పోలీసువారామెను మరింత వేగమనుమానించి పట్టుకొందురేమోయని నాకు సంశయము గలిగెను.

ఆ యిటలీదేశపు పెద్దమనిషి క్రిందిచావడిలో పచారుచేయుచుండెను. వానితో మాట్లాడకుండ తప్పించుకొనవలయునని ఫ్లోరెన్సు ప్రయత్నిం చెనుగాని కార్యము లేకపోయెను.

"మిారెచటికో ప్రయాణమగుచున్నట్లున్నదే!" అని యతఁ డడిగెను.

కష్టప్రయత్నముపై లేనినవ్వు తెచ్చుకొని "మరల నింతలోనే వచ్చెదను. తలవనితలంపుగ వెళ్లవలసి వచ్చినది!" అని యామె బదులు చెప్పెను.

"ఇంత యాకస్మికముగనా ?"

"అవును. అట్లె వెళ్లవలసి వచ్చినది" అని యామె యేమేమియో యిటలీభాషలో చెప్పి యతనియొద్ద సెలవు పుచ్చుకొనెను.

అతడు బండివరకు వచ్చి, మమ్ము బండి నెక్కించి, ఆమె చేతిని ముద్దిడుకొని సెలవు పుచ్చుకొనెను. బండి కదలినపిమ్మట ఆయువకుడు తన్ను పెండ్లియాడగోరెదననియు, ఇటలీదేశమునం దతడు పెద్దరాజో, రెడ్డియో యనియు, గొప్పయాస్తి గలవాడనియు చెప్పెను. ఆమాటలను నేను విశ్వసింతునని యామె తలంచెను. గాబోలును.

* * * *

"ఆంగ్లదేశమం దతని కేమిపని?" అని నేనడిగితిని.

"ఏదియో యోడలకంపెనీలో నుద్యోగమని చెప్పినాడు."

సాలునకొక లక్షసవరనుల రాబడిగల యావన వితంతువు. ఇటలీదేశమున పెద్దరాజో, రెడ్డియో యగుసుందరాంగుని మహావైభవోపేతముగ వివాహ మాడబోవుచున్నటు లామె నాటకమాడుచున్నది కాబోలును. నిజమరసి చూడగా, ఏదియో నావికాలయమున చిల్లరగుమాస్తాపనిచేయు యువకుడు తప్పుచేసి కారాగారమున బడనున్న వితంతువును పెండ్లియాడ ప్రయత్నించుచున్నాడు. ఇటువంటి మహాగాధ లీ లండనునగరమం దనుదిన మెన్నిహాలోకేల్లయం దెన్ని జరుగుచున్నవో యెవరికెరుక ? నిజముగ లండనునగర మిట్టివారి కెంత మందికో యపరిమితావకాశ మిచ్చుచున్నది.

టిక్కట్టు కొనుట, సామాను తూపించుట, తూచినవానికి లంచ మిచ్చుట, సామాను పట్టించుకొని లోనికరుగుట మొదలుగాగల

28

హడావిడి యంతయు పూర్తియైన పిమ్మట ఫ్లోరెన్సు లండనునగరము దాటిపోయెను. మిాకినుగారి క్రోధము మరింత రవిలిపోయెను. ప్రయాణికు లెక్కువగ లేని పెట్టె నెమకి దానియం దామె నెక్కించి, ఆమెకు కావలయు వార్తాపత్రికలను, పుస్తకములను కొనిపెట్టి ఆమె సుఖముగ ప్రయాణము సాగించుట కన్ని సౌకర్యముల నొనగూర్చి బండి కదలువరకుగూడ నామె కిటికీయొద్ద వేచియుంటిని. నేనచట నట్లు వేచియుంటినేగాని క్షణమొక యేడుగ నుండెను. మిాకినుగా రంపిన రక్షకభటు లేక్షణముసం దచటికి వత్తురోయను భయము నన్నెప్పటికప్పుడు వేధించుచుండెను. రైలు కదలినపుడు "నీవు చాల పుణ్యాత్మురాలవమ్మా లోర్నా! అనేకవందనములు" అని యామె పలికెను.

ఆమాట నామె యుద్దేశపూర్వకముగ నన్నట్లు నాకు తోచెను. ఆపలుకు లామె నోటినుండి వెడలునపుడు కనుకొలకుల నశ్రుబిందువులు చిందులాడుచుండెను.

ఆమెను జూచుట కదియె యాఖరు. పిమ్మట నొక సంవత్సరము వరకు మాకిరువుర కుత్తరప్రత్యుత్తరములు మాత్రము జరుగుచుండెను.

ఇచటినుండి బయలుదేరిన కొన్ని మాసములవర కామె ప్యారిసు నగరప్రాంతముసం దొకగ్రామములో నివసించుచుండెను. యుద్ధ మారంభమైన పిమ్మట నామె యిటలీదేశమున కరిగెను. లండనునగర మం దామె గలసికొనిన ఇటలీయువకు నామె పెండ్లియాడినదో లేదో ఆసంగతిని వ్రాయలేదు.

సాధ్యమైనంత త్వరితముగ నేనిల్లు చేరుకొంటిని. నేను భయపడి నంత యల్లరియు జరిగెను. ఫిన్లేసతి యింటికిమాత్ర మింకెవరును పోలేదు. పోవుటకు ప్రయత్నములు జరుగుచుండెను. అదృష్టవశమున ఫిన్లేసతి

యింటికి టెలిఫోను లేకపోయెను. లేకున్న నాటక్కరితనమంతయు వారు గ్రహించి యుందురు.

ల్యూసీ ఎందరెన్ని విధములనో ప్రోత్సహించి చెప్పిన పిమ్మట జోకీయమున కాగితములకట్ట నందిచ్చుటకు బయలుదేరెను. కాగితములచటికి తీసికొనిపోయి యెంతసేపు వేచియుండినను జోకీయము రాకుండెను. వానికేదియో యనుమానమును, భయమును గలిగియుండ వలయును. అందువలననే రాలేదనియు, చుట్టుప్రక్కల నెచటనో పొంచి యుండి పోలీసువారి రాకపోకల నతడు కనిపెట్టి యుండవచ్చుననియు మీకినుగా రనిరి.

ఏకారణములవలననో గాని మొత్తముపై నతడావేళ కనుకొనిన చోటుకు రాలేదు. అటుపై వానిజాడయె గన్పించకుండెను. ఫ్రాస్టు సతిని గలసికొనుటకు వాడు మరల జర్మనీ కిరిగి యుండవచ్చును. లేదా లండనునగరమున మరి యెచటనో నివసించుచుండవచ్చును. నాకు మాత్రము మరి కన్పించలేదు.

జోకీయిము బెట్టి తప్పించుకొని పారిపోయినట్లు రూఢియైన సమాచారము తెలిసినపిమ్మట మీకినుగారు వానిని పట్టుకొను ప్రయత్నము నాపి, ఫ్లోరెన్సును పట్టుకొనుటకై ప్రయత్నింప సాగిరి. నన్నా విషయమందే పని చేయగోరినను రేపు మాపనుచు కాలయాపనము చేయుచుంటిని.

"ఈ వేష మంతటిని జూడగ నా దుర్మార్గురాలిని శిక్షించుట నీ కిష్టములేనట్లున్న" దని యత డొకనాడు కోపముతో బలికెను.

"అవును. నిజమే" యని నే నంటిని.

ఇప్పుడు నా యాస్తిపాస్తులను గాపాడుకొనుట నాకెంత ముఖ్యమో, ఫ్లోరెన్సు సంగతి సమాచారము లెవరికిని తెలియకుండ కప్పిపుచ్చుట యంతకంటె ముఖ్యమయ్యెను. లేకున్న నేరము చేసినదాని తప్పించిన నేరమునకై నేను శిక్ష నొందవలసి వచ్చును.

ఫ్లోరెన్సు నంపకముపెట్టిన రాత్రి పదునొకండు గంటలవేళ కెటులనో మంచముపై బడితిని. తరువాత నా యొడలిపై నాకు తెలివిలేకుండెను. తెల్లగ తెల్లవారిన పిమ్మట నొకమారు తెలివివచ్చెను. ముఖము కడగికొనుటకు గాని తల దువ్వుకొనుటకు గాని బుద్ధిపుట్టలేదు. రాత్రి భోజనము చేయకనే పండుకొంటినను మాట మరచిపోతిని.

మంచముపై నుండి లేవ బ్రయత్నించుసరికి శరీర మతిదుర్బలముగ గన్పించెను. కొంతసేపటికి మరల తెలివి తప్పిపోయినది. తెలివి తప్పుట కాదు. అది యెట్లు పోయినదో గాని శరీరయంత్రము వదలి నా ప్రాణశక్తి యావలి కరిగెను. ప్రపంచ సంబంధములగు బాధ లన్నియు నింతటితో వదలును గదా యని సంతోషించుచుంటిని. కాని మీకినుగారు నెన్డు నిదివరకు జూచియుండలేదు. అతని కీయాస్తి నిచ్చునో యీయడో యని మాత్రము సందేహాము గలిగెను.

రెండుగోజు లటులనే గతించినవి. నోటి మాటలేదు. కంట చూపు లేదు. శరీరముపై చైతన్యము లేదు. ఆతరువాత మరల నా ప్రాణ మెట్లు శరీరములో ప్రవేశించెనో తెలియదు గాని మెలమెల్లన నా నొడలిపై తెలివియు, కంట చూపును, నోటి మాటయు క్రమముగ వచ్చిన ట్లయ్యెను. రోజురోజునకు దుర్బలము తగ్గి, బలము హెచ్చి, రోగము కుదిరి కొన్నాళ్లకు స్వస్థత నొందితిని.

జబ్బులో నేను లేవకూడదని బాధపెట్టుచుండిన రోజు మేరి యిప్పుడు నేను లేవకుండుట బాగులేదని బాధపెట్ట నారంభించెను. లేచి తిరుగాడ కుండినయెడల నొడలి కాహారము పట్టి బల మెక్కదని యామె వాదింప సాగెను.

ఒకనాడామె "నీకిప్పుడు పరిపూర్ణారోగ్యము లభించినది. ఆసంగతి నీవెరిగియు గూడ మమ్ము బాధించుట కిట్లు వేషము వేయుచున్నావు. మూడుపూట్లు తినుచున్నదాన వేలతిరుగాడజాలవు ? పిల్లవానిని చూడ వలయునని యున్నదికాబోలును తీసుకొనిరానా ?" అనెను.

నేను పిల్లవానిని జూచితిని. ఆక్రిందటి సాయింకాలమె దాది వానిని తెచ్చి నాకు చూపించెను. రెండుగంటలసేపు నాయొద్దనుంచెను. మరల నాటియుదయమె తీసికొనివచ్చెను. ఆసంగతిని రోజుమేరీకి తెలియ బరచి నాయందేల నామె యిట్లు విసవుకొనుచున్నదో తెలియ కూహించుచుంటిని.

"పిల్లవాని కిప్పుడు చక్కనిగౌను తొడిగించితిని. చూడుచూడుమని యున్నాడు. ఒక్కమారు వానిని జూచివచ్చెదవుగాని రమ్ము. ఒక్క గడియసేపు వానితో నాడుకొనునెడల నీకు బలమువచ్చును." అని యామె నన్ను హెచ్చరించెను.

లేచి నడువగలనేమో యని నాకాశగలిగెను. సరియెయని సమ్మ తించితిని. ఇంతలో నామె నాక్రొత్తగౌను తెచ్చియిచ్చెను. అదిచూచి నాకు పట్టరాని కోపమువచ్చెను.

"ఈ హడావిడియంతయు నెందులకు ? నేనును పిల్లడును నలంక రించుకొనుట ఎవనిదర్శించుటకు ?" అని కేకలువేసితిని.

రోజుమేరి నవ్వుచు సిగ్గుతో తలవంచుకొనెను. "జానుమెడ్లీ మిమ్ము చూడవచ్చె నక్కా. మీయిరువురిని చూడవలెనని యతడెంతయో యువ్విళ్లూరుచున్నాడు." అని యామె మెల్లగ బలికెను.

నాకోపము మరింత ప్రజ్వరిల్లెను. "జానుమెడ్లీ మరల నేముఖము పెట్టుకొని నన్ను చూడవచ్చెను. తప్పుచేసినవానికే యట్టి సాహస ముండునెడలనే నేల యూరకుండవలయును ? కానిమ్ము వానియాగ డమునకు తగినకట్నమిచ్చెద." అని యంటిని.

చివరకు కథ ముగిసినది. ఏమాత్రము తరువాయి యున్నను ముగిసినట్లే భావింపవచ్చును. ప్రపంచమందన్నిటిలో నొక్క కథలకు మాత్రమే ముగింపు గన్పించుచున్నదని నాయుద్దేశము.

గ్రీన్విచ్చిలో నున్నప్పుడు జానుమెడ్లీనిగురించి వ్రాసిన కథను చాల తగ్గించి వ్రాసితిని. దానిని విపులముగ వ్రాసియుండవలసినదని యిప్పుడు నాకుతోచుచున్నది. జానుమెడ్లీ సామాన్య పురుషుడుగాడు. చాల అద్భుతప్రవర్తనగలవాడు. మొదటినుండియు నతని చరిత్ర వింతగనె యుండెను. యుద్ధాంతమువరకుగూడ నది యద్భుతావహముగ నుండెను. ఐరోపా మహాసంగ్రామము నందతడెన్నియో బిరుదులను పతాకములను సంపాదించెను. నెడ్డుజీవితము మెడ్లీజీవితము రెండును అద్భుతమైనవియె. అందువలననె యవి వారి భార్యలకత్యంతప్రియతరములైనవి.

రోజుమేరీ నాకుక్రొత్తగౌను తొడిగించి కచేరీసావడిలోనికి తీసికొనిపోయెను. ఈయట్టహాసమేమియు బాగులేదని లోలోన కుపితురాలనగుచు రోజుమేరీ కెప్పుడో గట్టిగ బుద్ధిచెప్పవలయుననుకొంటిని.

మెడ్లీగారప్పటికప్పుడే దయచేసిరి. ఫ్రెండిలు వానికెక్కువ మర్యాద జేయనొల్లక మేమువచ్చువరకటులనే నిలపెట్టియుంచెను. మెడ్లీ యందుల కేమియు కోపగించుకొనక టోపీ చేతపట్టుకొని నవ్వుచుండెను.

నాకతడు వందనమొనరించుటకు తగిన యవకాశమీయకను, ఆయనకు నేను వందనమాచరింపకను సేవకునికాజ్ఞాపించురీతి నతని నావెంట పఠనాలయములోనికి రానాజ్ఞాపించి వెంటనే యచటికరిగితిని.

పాపమతడేమనుకొనియెనో గాని నేనుచెప్పినట్లుచేసెను. రోజుమేరీ గూడ నతనివెనువెంటనె వచ్చెను. కాని నావైఖరికిమాత్రము కొంచెము కోపగించుకొనుచుండెను.

పఠనాలయమున ప్రవేశించినంతనె దర్జాగా నొక సోఫాపై గూర్చుండి యతని గూర్చుండుమనక న్యాయాధికారి నేరస్థునడిగినరీతి—

"నీయసందర్భపువైఖరి కేమిసమాధానము చెప్పెదవు మెడ్లీ ?" అని యడిగితిని.

"నేను చెప్పగలుగునది చాలకలదు. కాని కూర్చుండునెడల బాగుగ చెప్పగలను" అనెను.

ఈదుందుడుకు మాటకు నాకోపము మరింత యధికమయ్యెను. నేనేమియు ప్రత్యుత్తర మీయకుండుట గాంచి యతడు మంచి విలువ గల కుర్చీయం దొకదానిలో నుపవిష్టుడై టోపీతీసి కాలిమునుకులపై నుంచుకొని, తనవింతగాథనుచెప్పనారంభించెను. ఈచేష్టలు నాకోపాగ్ని నెంతయు మండించుచుండెను. కాని రోజుమేరీ యేమనుకొనెనో యని యోపికపట్టి యతనికథను విన నారంభించితిని. ఆకథ వినుకొలది నాకోపమంతయు వానకురతడియు నిప్పుకణములవలె చప్పున చల్లారి పోయెను. అయినను నేనాతని కథసంతటిని నమ్మజాలకుంటిని.

చెప్పవలయు రీతిగ చెప్పునెడల అతడానాడు చెప్పిన సంగతులు మరియొక గ్రంథముగ పరిణమించును. అందువలన చాల సంకుచితము చేసి వ్రాయ నుద్దేశించితిని.

"అమ్మా! మీభర్త నెడ్డుభేజుగారు మీ కీకథను తనయాంతరంగిక మిత్రునిద్వారా తెలుపనెంచి నన్ను స్వయముగ చెప్పగోరుట వలన—"

ఆమాటలు నాకత్యంత సంభ్రమాశ్చర్యములు గల్గించినవి. నాదర్జాయును, నాఠీవిగా కూర్చుండుటయును ఎచటికి కరిగినవో నాకు తెలి

యడను. నేనపరిమితమగు నాతురతతో "నీవు నాభర్త నెఱుగుదువా? ఆతని సమాచారమంతయు తెలియునా? ఇప్పుడెక్కడ నున్నారో చెప్పగలవా?" అని యడిగితిని.

"తెలియునమ్మ అంతయు నెరుగుదును. సావకాశముగ చెప్పెదను. కుర్చీలో కూర్చుండుము." అని పలికి యతడు తనకథను, నెడ్డు కథను ఏకరువు పెట్టెను.

నెడ్డు తండ్రియు, తన తండ్రియు వారి బాల్యమునుండి కలసిమెలసి తిరుగుచుండెడు వారు. యౌవనము ప్రాప్తించగనే వారుభయులు గలసి నావలలో నెక్కడలేని సముద్రములను గ్రుమ్మరుచుండెడివారు. వారిద్దరొకేరకము ఉద్యోగమునం దుండకున్నను వారిలో నెక్కువ తక్కువ పాటింపులేమియు లేకుండెను. ఆద్రిమ్మరుటలో నొకనాడు వారుభయు లనాలోచితముగ ఫెర్ను ద్వీపమును చేరుకొనిరి. మెడ్లీ తండ్రి దృఢగాత్రుడు కానందున అనతికాలముననె మరల స్వగృహమున కరిగి యచట కాయగూరల వర్తకము నారంభించెను. పాపమా ముసలివానికి ఫెర్ను ద్వీపము యొక్క నిలువన బాగుగ తెలియకుండెను.

ఇంగ్లండులో నెడ్డును చదువవేసినప్పుడతని తండ్రి కుమారుని మెడ్లీ తండ్రి యాధీనమందుంచి తన తనయు నొకకంట జూడవలయునని మరి మరియు కోరెను. సెలవుదినములందు నెడ్డు మెడ్లీయింటికివచ్చి అదియె పుట్టిల్లునలె దిరుగుచుండెడివాడు. అందువలన తనకును నెడ్డునకును బాల్యస్నేహము. ఒకరినొకరెల్లప్పుడు నత్యంత గారాబమున ప్రేమించుకొనుచుందురు. ప్రాస్టుసతి నెడ్డుతల్లిని పెంచి పెద్దజేసెను. అందువలన నెడ్డు తండ్రిగారి యింటనే నివసించుచుండెను. నెడ్డు తలిదండ్రులు మరణించిన పిమ్మట నామె చాకచక్య మధికమయ్యెను. నెడ్డునకొక తమ్ముడుండెను. తనకొక తమ్ముడున్నాడను సంగతి పాపమా యన్నకు

29

మొన్న మొన్నటివరకును గూడ తెలియకుండెను. ఈ రెండవ కుమారుడు పుట్టిన యనతికాలముననె యతని తలిదండ్రులు గతించుటవలన ఫ్రాస్టుసతి ఆరెండవవాని నతిగారాబమున కన్నకొడుకువలె పెంచుచుండెను. పెద్దవాని నతనితండ్రి యెచటనుంచెనో యామెకు తెలియదు. అందువలన తానుపెంచుచున్న పిల్లవానికే ఫెర్నుద్వీపమంతయు రావలెనను యుద్దేశమున నామె వానికి చిన్నప్పటినుండియు నాసంగతి చెప్పుచుండెను. వానికి లభించు ఫెర్నుద్వీప మెచట తనకు చెందక పోవునోయను సంశయముతో నామె ఆపిల్లడు తనకుమారుడే యని యందరితోడను వ్యవహరించుచుండెను. పాపమా చిన్నవానికి గూడ తెలియదు యదార్థము. ఫెర్నుద్వీపమందు బంగారు గనులున్న సంగతి యామెకెట్లు తెలసెనో తెలియదుగాని ఆమె కాసంగతి తెలియుట మాత్రము వాస్తవము.

చదువుసంధ్యలు లేనందునను, అదుపాజ్ఞలు లేనందునను ఆ కుర్రడు గాలిపట్టిపోయి తుంటరిగ పరిణమించెను. వానిపై పెంచిన మోహ మధికముగ నుండుటవలనను బంగారుగనుల ఆశవలనను తన కూతురు ఫ్లోరెన్సు నాయనకిచ్చి వివాహమొనరింప వలయునని ఫ్రాస్టుసతి తలచుచుండెను. కాని ఆ పిల్లవాడు గజదొంగగ పరిణమించుటయు లారెన్సు డ్యూకు తన వలలోపడునను నమ్మికగలుగుటయు జూచి ఆమె వానికింకొక రత్నముకట్టి తన కూతురు ఫ్లోరెన్సు నెటులయిన లారెన్సున కీయ వలయునని నిశ్చయించుకొనెను. క్రమక్రమముగ నా ముసలిది తనయభిమానమును లారెన్సు డ్యూకువంక ద్రిప్పుకొని వానికెటులైన ఫెర్ను ద్వీపము లభింపజేయవలయునని ప్రయత్నింపసాగెను. నాడు మీనాన్నగారియింట ప్రవేశించి యతని తుపాకితో గాల్చినదాతడే! అతని పేరు జార్జి. ఆ జార్జిని పోలీసువారు పట్టుకొనుటవలన తనకంతగా లాభము లేదని యెంచి ఫ్రాస్టు ఆ నేరము నెడ్డుమీదవేసి వానిని బంధింప

జూచెను. చివరకు జార్జి నిజముగ్రహించి తాను చేసిన దానికి చాల విచారించి నెడ్డున కొకలేఖ వ్రాసెను.

తానీ యసందర్భపుపని నేలచేసెనో యాసంగతి నతడేమియు వ్రాయలేదు. కాని దానివలన కొన్ని వివరములు మాత్రము తెలిసినవి. ఫ్రాస్టుసతి తగినయదను కనిపెట్టి నెడ్డు విడచిపెట్టిన కోటుజేబులలో నాడు నాకుగన్పించిన దుర్మార్గపు వస్తువులనుంచెనట. ఆమెయెయాపని చేసినట్లు మెడ్లీ నొక్కిచెప్పెనుగాని యతడది స్వయముగ జూచినది గాదని నా యభిప్రాయము. ఏదియెటులయినను నెడ్డు జేబులోని వస్తువులామెయె యుంచియుండ వలయుననుటకు సందేహములేదు. ఆ దుర్మార్గురాలు ఘర్నద్వీప పటముకు నెడ్డు జేబులోనుండి యపహరించి దాని ప్రతినింకొకటి వ్రాయించి దానిని జార్జికిచ్చి, అసలుప్రతిని తనయొద్దనుంచుకొనియెను. ఆ జార్జియె రోజుమేరీభర్త. అతనికే పోలీసువారు "వింతపురుషుడని" పేరుపెట్టిరి.

* * * * *

నెడ్డు తనసోదరుడే యని తెలియక తానింత కాలమతనికి వ్యతిరేకముగ ప్రవర్తించినందులకు పరితపించి, జార్జి, సిహాచేయుటలో మరికొంచె మెక్కువగా నల్లమందు వేసికొని యుద్దేశపూర్వకముగ నాత్మహత్యగావించుకొని యుండునని నేనపుడూహించితిని. అంతియగాక పోలీసువారొక మూలనుండి తనకై గాలించి వెదకుటజూచి భయపడి గూడ యతడాపని చేసికొనియుండును.

అతడేమి యాలోచించి మరణించెనోగాని మొత్తముపై నాత్మహత్య గావించుకొనుట మాత్రము నిజము.

నెడ్డు తన సోదరుడే యని ఆతనికెవరో తెలియబరచిరి. బహుశా ఫ్రాస్టుసతియె చెప్పియుండవచ్చును. నెడ్డుసమాచారము తెలిసినవాడొక మెడ్లీ తప్ప మరియెవ్వరి నాతడెరుగకుండెను. ఆ మెడ్లీని జూడ

గోరి యతడొక లేఖను వ్రాయగా దానికి మెడ్లీ జవాబు వ్రాయుచు తనకంపెనీ పేరుగల "విజిటింగు" కార్డు నాతని కంపెను. తనయొద్ద నుండిపోయిన సమూనాపటమే అసలు పటమనియెంచి దాని నెట్లైన నెడ్డున కందజేయవలయునని పాపమత డుద్దేశించెను. ఆ సమయమున కతడు తనసడవడికను దిద్దుకొని ప్రపంచములో న్యాయముగ ప్రవర్తింపవలయునని భావించుకొనుచున్నట్లుండెను. కాని తన సదుద్దేశములు సఫలములు కాబోవుసంతలో మరి యేయవాంతరము వచ్చెనో తెలియదు గాని, అతడా యవాంతరమును తప్పించుకొనజాలక నాత్మహత్య గావించుకొనెను ఏమో ? అదియైన నూహింపవలసినదే గాని అతడుద్దేశపూర్వకముగ నాత్మహత్య గావించుకొనినట్లెవరు చెప్పగలరు ? అతడు మెడ్లీవిలాసమున నెడ్డునకొక యుత్తరము వ్రాసెను. దానిలోనైన తానెందులకు మరణించినదియు నతడు తెలుపలేదు. ఆ లేఖ నెడ్డునకీ దేశములోనే యందియుండిన కథ యెట్లు మారియుండునో తెలియదుగాని అతడు అమెరికా కరిగిన పిమ్మట నచటనుండెను.

ఫెర్ను ద్వీపపటము అనగా తనయొద్దనున్న నకలు ఎచటనుండెనో ఆ వివరములన్నిటి నతడాయుత్తరములో వ్రాసెను. అనగా గ్రీన్విచ్చి యందలి 16 వ గృహమందు మేడమీదిగదిలో మంచముక్రింద చాప కట్టియుండిన కన్నములో నదియున్నదని యతడు వ్రాసెను. అదిచూచుకొని నెడ్డా వివరములన్నిటిని జాను మెడ్లీకి తెలుపుచు వెంటనే ఆకన్నము నందుండు వస్తువులన్నిటిని తనయొద్దకు తీసుకొని రావలసినదని వ్రాసెను. మెడ్లీ ప్రాణస్నేహితుడగుటవలన నెడ్డెన్ని యక్షరములను వ్రాసెనో ఆయక్షరముల ప్రకారమా వస్తువులన్నిటిని పట్టుకొని యమెరికా కరిగెను. అచట నేను దాచుకొనిన అసలుపటమును, బ్యాంకు నోట్లను అన్నిటినిగూడ నతడు తీసికొనిపోయెను. నే నచటనున్న సంగతిని, ఆ వస్తువులన్ని యచట కెట్లువచ్చినవో ఆ సంగతిని తెలసికొనిన

పిమ్మట నెడ్డు ఆ డబ్బంతటిని మరల నా కంపవలసినదని యాజ్ఞాపిం చెను.

ఇప్పటికిని నెడ్డు రహస్యములు చాలవరకు బోధపడినవి. కాని మే మిరువురము కాపురము చేయుచుండిన రోజులలో నతడొక్క డర్ధరా త్రములం దెచటి కరుగుచుండెనో, కొన్నాళ్లెచటికో పోయి తిరిగి గ్రాం టుపేరున లండను నగరమున కేలవచ్చెనో ఆ వివరము లింకను తెలియ వలసియున్నవి.

* * * *

ప్రాస్తుసతి యీసంగతి సందర్భములన్నిటిని చాలవర కెరింగి యుండుటవలన జార్జిచేసిన దుండగములన్నియు నెడ్డుచేసిన ట్లారోపించి నెడ్డు నెటులైన జైలు కంపవలయునని ప్రయత్నించుచుండుటను నెడ్డు గ్రహించి తన యూరుపేరులను కార్యములధోరణిని మార్చుకొనుట మంచిదిగ తలంచి ఆమె తంత్రములకు ప్రతి తంత్రములను పన్నుచు వచ్చెను. లండనునగరమునం దెంతయో కాలమునుండి ముగ్గురు భూతత్వశాస్త్రజ్ఞులు రహస్యముగ రాత్రిందివము లీ ఫెర్ను ద్వీపము నందలి గనులతత్వమును గనుగొన బ్రయత్నించుచుండిరి. వారందరును పేదవారె యగుటవలన వారి ప్రయత్నములను బహిరంగము చేయు టకు వీలు లేకపోయెను. ఏధనవంతునకీసమాచారము తెలసిపోయిన తమ కేమి ముప్పువాటిల్లునో యని వారు ముగ్గు రతిగోప్యముగ మారు వేషములతో సంచరించుచుండిరి. చివరకెటులనో లారెన్సు ద్యూకున కీసంగతి తెలిసి యతడు వీరిని వంచింప ప్రయత్నించెను. అప్పుడు నెడ్డు ప్రతివంచనము చేయవలసి వచ్చి తన పేరుప్రతిష్ఠల నన్నిటిని మార్చు కొనవలసి వచ్చెను. లారెన్సు ప్రయత్నములు చాల ప్రబలమైనవని నేనప్పటిలో నూహించుచుంటిని. కాని నెడ్డు నవి ఎక్కువగ బాధింప లేదు.

కొంతమంది సంపన్నులయొద్దనుండి ఋణము గ్రహింపదలచి నెడ్డు గ్రాంటు పేరున వారితో రాయబారముల నెరపి వారియొద్ద కరిగి తనకు కావలయుద్రవ్యమును సంగ్రహించెను. తన నిజనామమున వ్యవహ రించునెడల తనపేదస్థితిని జూచి వారుగూడ లారెన్సువలె తననెచట మోసము చేయనెంచెదరో యని యతడు భయపడి యుండును.

నన్ను వివాహమాడుటకు ముందు నెడ్డును అతని సహచరు లిద్ద రును అందులో మెడ్లీ యొకడని వేరుగ చెప్పనవసరములేదు. తమ రహస్యప్రయత్నములను ఫెర్నుద్వీపమునం దీగనులున్నవను సంగతిని తమ ప్రయత్నములు ఫలించువర కెంతటియాప్తులకైనను చెప్పకూడదని ప్రమాణము చేసికొనిరట! అందువలన నెడ్డు నాకీసంగతుల నెప్పటి కప్పుడు చెప్పవలసి వచ్చినను గూడ చెప్పజాలకుండెడివాడు. డబ్బు చాల తొందరగ కావలసి వచ్చుటవలన నతడు నాన్నగారి నడిగి ఋణము తెచ్చుకొనఁ బ్రయత్నించెను. నాన్నగారప్పుడు ఋణమిచ్చి నను, ఏమైనను సరియెయని సాహసించి నే నతనివలన ఋణమిప్పింప బ్రయత్నించి సఫలమనోరథనై యుండినను ఈకథ యంతయు జరుగక పోయి యుండును.

ఫ్రాస్టుసతియె జార్జి శవమును మాంఛెస్టరునకు తీసికొనిపోయి యుండును. ఆతని అంత్యక్రియలను లండనునగరముననే జరిపించునెడల నేనును, రోజుమేరీయును ఒక్కసారియె యొకపురుషుని మరణమునకు వితంతువసనముల ధరింపవలసి వచ్చి తన యుద్దేశములు నెరవేరుట కభ్యంతరము కలుగునని సంశయించి, ఎందులకైన మంచిదని యామె యట్లు గావించెను. నెడ్డు మరణించినట్లు నేను నమ్మవలయునని యామె యుద్దేశము. నేనట్లు నమ్ముకొనునెడల, నెడ్డు నెట్లయిన నామె చంపింప గలుగునెడల నేనతని యాస్తిని సంపాదించుకొనుట కిట్టిప్రయత్నము లను జేయ కూరకుందునని యామె యూహ.

నాన్నగారి కనసానకాల సమయమున నాయం దెట్లు దయగలిగెనో నేను చెప్పజాలను. లారెన్సు ఫ్రాస్టుసతు లిరువురును గలసి తన్ను మోసగించిరని యతఁడు గ్రహించి యుండవలయును. లేక చివరదశలో తన కన్నబిడ్డ యొక్కతెయు తనయొద్ద లేనందుల కతనిమనసు కరిగెనో చెప్పజాలను. కాని నేను గర్భవతి నైతినని మాత్ర మతఁడు గ్రహించుట వాస్తవము. ఫూలనర్తకునియొద్ద నొంటరిగనుండు సమయమున నేను పనికత్తెగ నుంచుకొనిన మనిషి నాన్నగారికి జబ్బుచేసినపు డతని కుపచారము చేయవచ్చిన నర్సులలో నొకతెగ నుండెను. తాను పని చేయుచుండు సమయమున నేను గర్భిణితోనున్న సంగతి నామె గ్రహించి నాన్నగారికి తెలియబరచి యుండును. లారెన్సు బుద్ధిహీనత నానాటికి ప్రబలమగుట జూచి యీసమాచారము తెలిసిన పిమ్మట నతడు తనబుద్ధిని మార్చుకొని ప్రాతవీలును మార్చి వింతగదోచు చున్న యీక్రొత్తవీలును వ్రాసి యుండవచ్చును.

నాపేర నిట్లింకొక వీలు వ్రాసినసంగతి నతడామెతో చెప్పెనో లేదో తెలియదుగాని తమ సంభాషణను గూర్చి మాత్రము నాతో చెప్పవలదని యామె కాజ్ఞాపించి ప్రమాణము గూడ చేయించుకొనె నట. అతడు మరణించువర కామె యతనియొద్దనే యుండి పిమ్మట కొన్నాళ్లకు నన్ను చూడవచ్చి యీసంగతిని చెప్పెను.

* * * *

ఇంక నాయాస్తి నపహరించుటకు మెడ్లీ నెట్టి సమాధానమడుగు టకును వీలులేదు సరికదా నెడ్డునందంత ప్రేమాభిమానములు గలిగి యెప్పటికప్పు డతని కపరిమిత సహాయ మొనరించుచుండినందులకు నాకృతజ్ఞతావందనము లర్పించవలసివచ్చెను. అతని సహాయమునకు మెచ్చి నెడ్డప్పుడే తగిన పారితోషిక మిచ్చెనట !

జాను చెప్పుచుండిన వినుకొలఁది నాసంతోష మతిశయించి శరీర మంతయు పులకరింపసాగెను. నెడ్డునకు నాచిన్నికుమరుని పుట్టుకసంగతి యేమియు తెలియకుండుట నాకాశ్చర్యము గలిగించెను. క్రొత్తగ కుట్టించి తొడగించిన గుస్తుల నిటునటు జిమ్ముచుండఁగ రోజుమేరి నాచిన్నిమార్టిను నచటికెత్తుకొని వచ్చెను.

మార్టినువిషయమై నెడ్లీ యెట్టి సంశయము నొందక వాని సత్యం తాదరమున నెత్తుకొని లాలింపసాగెను. వాని కాడుకొనుటకు తన బంగారుగొలుసు నిచ్చెను. అదిచూచి పిల్లఁడు నవ్వుకొనుచు నాడుకొన సాగెను.

మేమీ విధముగ సంతోషముతో కాలక్షేపము చేయుచుండగా ఫ్రెండిలు మెల్లగ తలుపుత్రోసికొనివచ్చి యేదియో రహస్యము చెప్పవలసియున్నదని పలికెను.

నా కచటినుండి లేచుటకెంతమాత్రము యిష్టములేకుండెను. అయి నను ఫ్రెండిలు యెంతయో పనియుండినగాని యట్లు పిలువడనియెంచి "ఎందుకు ఫ్రెండిలు ? "అని యూవలికరిగితిని.

"ఎవరోపెద్దమనిషి మిమ్ము జూడవచ్చెను. తనతోకొంతసామాను గూడ పట్టుకొనివచ్చెను. ఆయన యెవరో యెరుగనుగాని విదేశము నుండి వచ్చినట్లున్నది.

ఆ మాటలు వినినంతనె నాకు బ్రంహాండ మైనంత సంతోషము గలిగెను. కొంచెము జాగ్రత్తగా మెలంగకుండిన యెడల మూర్ఛవచ్చి నేల గూలియుందును.

"అతడెచట నున్నా" డని నేనడిగినట్లు జ్ఞాపకము.

"గదిలో నొక కుర్చీయందు కూర్చుండబెట్టి నేనిటు వచ్చితిని."

ఇంకెవరు? ఆమరుక్షణముననె నేను నాప్రియభర్త బాహువల్లరుల జిక్కుకొంటిని. తప్పించుకొనుట కిష్టములేకపోవుటయెగాక నేనట్టి ప్రయత్న మొనరించినను కార్యములేకుండునంత బిగ్గరగ నన్నతడు కౌగలించుకొనియెను.

ప్రయాణములన్నియు చాలవరకు ప్రాణప్రియుల సమాగమమున ముగియుచుండునట్లు వ్రాయుదురు. కాని మేమానాడు కలసికొనినది మాత్రము నాకట్టికథవలె గన్పించలేదు. నాప్రాణప్రియునిరాక నాకప్పుడెంత యానందదాయకముగ నుండెనో చెప్పుటకు మాటలు చాలవు.

అప్పుడు మేమాడుకొనిన మాటలు నాకు జ్ఞాపకముండినను గూడ నిచట వ్రాయకపోదును.

ప్రపంచమందలి మనుష్యు లందరికంటెను, వస్తువు లన్నిటికంటెను నధికముగ నాప్రేమజూఱగొని నాకనుదినమునారాధనదైవముగనుండిన నాబహిఃప్రాణమె ఆకుర్చీలో కూర్చుండెనని చెప్పితినిగదా! జానుమెడ్లీని వరించినందులకు రోజుమేరీ కెంతసంతోషముగ నుండెనో నెడ్డును వరించినందులకు నాకంతకంటె వేయిరెట్లెక్కువ సంతోషముగనుండెను. ప్రబలమగుశత్రువులను, నిరోధములను నిర్జించి గెలచి నాభర్త విజయుడై వచ్చెను. "డ్యూకు అండు డ్యూకుకంపెనీ" వారి ప్రతిష్ఠకు మించిన కీర్తి ప్రతిష్ఠల గాంచెదనని నాన్నగారితో బలికిన భీషణప్రతిజ్ఞ నతడు నెరవేర్చుకొని, ప్రౌఢతమమగు ఆయింటి బిడ్డను వరించుటకు తగిన పురుషుడు తానొక్కడేయని జగమునకు చాటెను.

* * * * *

కాని ఆకథయంతయు వేరు. ఆయాస్తిపాస్తుల నొక చిల్లిగవ్వ విలువకైన నేను సరకుగొనలేదు. గర్వమనుమాట యెట్టిదియో యెరు

గని మహాసాధుపుంగవుడగు నావివాహకాలము నాటి నామనోహరుడు నాప్రాణధవుడు మరల నాకండ్ల బడియెను. నాకదియె కోటానుకోట్లు! ఈధనమేల? భూములేల? మేడలేల? నాభర్త దీర్ఘాయుష్మంతుడై నన్నెప్పటికి నిట్లే ప్రేమించుచుండిన నాకు చాలును.

కొంచెము దూరమరిగి నేను నెడ్డు ముఖమును మరియొకసారి చూచితిని. ప్రయాణపరిశ్రమమున కొలదిగ గిడసబారిన ట్లుండెను. ఆతలవెంట్రుకలం దొకటి తెల్లబడియెను. అది చూడగనె నాకతని యందు మరింతప్రేమ యతిశయించెను.

"ఓహో! మామెడ్లీ గూడ నిచటనే యున్నట్లున్నదే! మంచివాడు. నాయుత్తరములేవియు నీకందకున్నవని నాయాగమనవార్తను స్వయముగ నీకు తెలుపవలయునని యతని గోరితిని."

"సరియెమంచిది. డ్రాయింగు హాలులోనికిరండు. అచటమీకొక చోద్యమునుజూపించెదను" అని యెటులనో పలికితినిగాని యా సమయమున నా ముక్కు రంధ్రముల నూపిరి యాడుచుండెనో లేదో భగవంతునకెరుక!

మేముభయులము యొకరి మెడలపైనొకరము చేతులనువేసుకొని డ్రాయింగు హాలులోనికరిగితిమి. అచట జాను పిచ్చియెత్తినవానివలె పిల్లవాని నాడించుచుండెను. అంతలో మేము వచ్చుటనుగాంచి యతడు "ఓహో గవర్నరుగారూ! యీప్రక్కకొక్కసారి చూడండి" అని మెడ్లీపలికెను.

"ఓహోహో! ఈసుభవార్త నింతకాలమునుండియు నాకేల చెప్పకుంటివి? ఇంతప్రాణస్నేహితులమయ్యు నా యొద్ద నీ రహస్యము దాచితివా?" అని నెడ్డు హాస్యముగ పలికెను.

రోజామేరీ సంతోషమున కంతములేకుండెను.

"ఈ బిడ్డమీదేనండి? మీరేచెప్పక దాచినారీసంగతిని. ఆ ముక్కుతీరు, ఆ కన్నులసొగసు, అంతయు మీ పోలికయె! మీ ప్రతిబింబమె!! అద్దములో వేరుగ చూచుకొన నక్కరలేదు. అతని పేరుగూడ భేజు గారేనట!" అని మెడ్లీ బదులుబలికెను.

ఎంతయో యాశ్చర్యముతో "నిజమేనా?" యనునట్లు నెడ్డు నావైపు చూచెను. ఆచూపు నేనిప్పటికిని మరువలేదు. మరియెప్పటికిని మరువననియె నానమ్మకము. "అవు" ననునట్లు నేను తలనూచి మాట్లాడజాల కూరకుంటిని. అపుడు నాకన్నుల మందానందకందళితాశ్రుకణ ప్రపూరితములయ్యెను.

నేనపుడనంత మహానంద తరంగముల నూపిరితీయుటకైన తెరపి లేనంత తీవ్రగతి నోలలాడుచుంటిని. తక్కినకథ చెప్పుట కెక్కడి వేళ?

ద్వితీయభాగము సంపూర్ణము.

# ఆయుర్వేద యోగ ముక్తావళి

గ్రంథకర్త — పండిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

ఇందులో, కషాయాలూ, చూర్ణాలూ, ఘృతాలూ, తైలాలూ, లేహ్యాలూ, కజ్జలిఔషధాలూ, వంటఔషధాలూ, ఆసవాలూ, అరిష్టాలూ వీటికి సంబంధించిన ముఖ్యయోగాలన్నీ కూర్చబడ్డాయి. ఒక్కొక్క ఔషధానికి విద్వద్వైద్యుల వాడుకలో వుండిన ఒక్కొక్క యోగమే పొందుపరచబడ్డది. శ్రీ శాస్త్రిగారు, తమ గంధర్వఫార్మసీలో ఔషధాలు తయారుచెయ్యడంలో 30 సంవత్సరాలుగా ఆర్జించిన అనుభవం అంతా యిందులో క్రోడీకరించారు. తెనుగుభాషలో, ఇంత వరకూ, ఇంత ఉపయోగకరమైన వైద్యగ్రంథం మరొకటి లేదు. శ్రీ శాస్త్రిగారి రచనామాధుర్యం తెలిసినవారికి వారి టీక ఎంత సులభంగానూ, ఎంత సరళంగానూ వుంటుందో వేరే చెప్పనక్కరలేదు. 800 పేజీల గ్రంథం, కాలికో బైండు. వెల 4—0—0 మాత్రమే.

# వైద్యక పరిభాష

ఇదిన్నీ పండిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు రచించినదే. ఆయుర్వేదవైద్యానికి సంబంధించిన పరిభాషాపదాలు ఎన్నో ఇందులో చక్కగా వివరింపబడ్డాయి. ఇది చెంత ఉంచుకున్నవారు ఎలాంటి గొప్ప వైద్యగ్రంథం అయినా సులువుగా బోధపరుచుకోవచ్చు. ప్రతీ వైద్యునకూ ఇది మిక్కిలీ అగత్యమైనది. అచ్చులో నున్నది.

# గృహదహనం

శ్రీ శరచ్చంద్రచటర్జీ బంగాలీమూలం అనుసరించి, సాహిత్య శిరోమణి శ్రీ పిలకా గణపతిశాస్త్రిగారు ఆంధ్రీకరించిన నవల యిది. శరచ్చంద్రుని గొప్ప రచనలలో ఇదొకటి. ఎక్కడికక్కడే ఆవేగం కలిగించే ఘట్టాలిందులో ఎన్నో వున్నాయి. రెండు సంపుటాలు 4—0—0

విడిగా, ఒక్కొక్క సంపుటం 2—0—0

[illegible] పుస్తకములు పేరుపడ్డ అన్ని బుక్ షాపులలోను ఈ ధరలకు దొరుకును.